# ప్రకరణ సూచిక :

# స్కాట్లండులోని పూర్వ రంగం

## 1

అప్పటికి ఇంకా అతడికి రెండేళ్ళయినా లేవని పెద్ద వాళ్లు రూఢిగా చెప్తున్నా, ఆండ్రూ ఆ సంగతి తనకు జ్ఞాపకం వున్నదని ఎప్పుడూ అంటుండేవాడు. అంతేకాదు, జ్ఞాపకమున్నదనే ఆయన గాఢ విశ్వాసం.

"ఏమైనా, అది నాకు జ్ఞాపకముంది" అని గట్టిగా అంటుండేవాడు.

"నాకు జ్ఞాపకమున్న మొదటి విషయమే అది'' అనేవాడు.

ఈ సంఘటనలో ఉద్రేకం పొందదగి నంతటి దేమీ లేదు. అతని తల్లిదండ్రులు, మేనమామ, పినతల్లి, విలియం మారిసన్, మిసెస్ ఆండ్రూ, ఐట్కేన్ తలలుచేర్చి షుమారు రెండు అడుగుల గుడ్డమీద అంటించినటువంటి మెరిసిపోతున్న ఒక కాగితాన్ని చూస్తున్నారు. దాన్ని చుట్టటానికి అనువుగా గుడ్డకు రెండు చివరలా రెండు కర్రముక్కలు అమర్చబడి వున్నవి. గుమికూడి చూస్తున్న వాళ్ళదగ్గిరికి తప్పటడుగులు వేసుకుంటూ వచ్చి, చొచ్చుకొని ప్రవేశించే స్వభావంగల

ఆండ్రూ, అదేమిటో తెలుసుకుందా మన్నట్లుగా వారి మధ్యన తానూ తలదూర్చాడు. తండ్రి, పినతండ్రి విలియం ఇద్దరూ నవ్వుతూ అతడు చూడటానికి వీలుగా దాన్ని కొంచెం క్రిందకి దించారు.

"ఆండ్రూ, ఇది దేశపట" మన్నాడు తండ్రి.

"దేశపటం!" అని తిరిగి ఉచ్చరించాడు ఆండ్రూ.

"ఇది అమెరికా దేశపటం" అన్నాడు గంభీరంగా తండ్రి. అతడు చిన్నబిడ్డలతో కూడా ఎప్పుడూ పెద్దవాళ్ళతో మాటాడినట్లు మాటాడుతాడు. "అదిగో అక్కడ" అని ఒక చుక్కను చూపిస్తూ అతడు "అది పిట్స్‌బర్గ్ పట్టణం. అక్కడికే అంకుల్ ఆండ్రూ, ఆంట్ అన్నాలు వెళ్లుతున్నారు. అంకుల్ విలియం ఇంకా పైకి ఓహాయో రాష్ట్రంలోకి వెళ్లుతున్నాడు" అన్నాడు.

పిట్స్‌బర్గ్ అన్నది తరువాత కాలంలో ఆండ్రూ తన సంపత్తిని పెంచుకొన్న నగరంపేరు. తల్లిదండ్రులు జ్ఞప్తి చేయుట వల్ల పిట్స్‌బర్గు అన్న పేరే అతని మనస్సులో ఈ సంఘటనను స్థిరంచేసి వుంటుందనటంలో సందేహం లేదు.

జీవితకాలం మొత్తంలో యే కొద్దిమంది వ్యక్తులో పదో లేక ఇరవైయ్యో మైళ్లు తప్ప ఎన్నడూ కదలి వెళ్ళని ఒక చిన్న స్కాచ్ నగరంనుంచి కుటుంబం వొకటి కుదుళ్ళతో సహా లేచి, సముద్రాలు దాటి, చుట్టుప్రక్కల ప్రదేశాల్లో వుండి ఇంకా ఇండియన్లు ఆపదలు కల్పిస్తున్న విశాలమూ, అజ్ఞాతమూ అయిన దేశంలో దిగి నూతన జీవితాన్ని

ఆరంభించటమంటే ఏమిటో అర్థంచేసుకోటానికి ఆండ్రూ ఇంకా చాలా చిన్నవాడు

"మీరుకూడా మాతో రావలెనని నా కోరిక!" అని ఆంట్ అన్నా ఐట్కిన్ నిట్టూర్పింది.

"వద్దు, వద్దులే అన్నా" అని ఆండ్రూ తండ్రి నిష్కర్షగా తలత్రిప్పాడు. "ఇప్పుడే ఈ క్రొత్త అద్దె యింట్లోకి మారాము. నావి నాలుగు మగ్గాలు నడుస్తున్నవి. ఇప్పుడు కాదు" అన్నాడు.

విలియం కార్నెగీ నారతో బుటేదారు పనితనాన్ని చూపించే బల్లకుడ్డలను, చేతిగుడ్డలను తయారుచేసి నేత పనివాడు తమ ఇంటిలోనే నేత నేసి జీవించే స్కాట్లండు లోని వేలకొలది నేతపని వాళ్ళలో ఇకడొకడు.

ఆండ్రూ జన్మించిన డన్ఫర్మ్లైన్ స్కాట్లండులోని బుటేదారు పని కంతటికీ కేంద్రంగా వుంటుండేది. అచటి వాళ్ళల్లో ఎక్కువమంది నేతపనివాళ్ళు. మంచి అభివృద్ధిలో వున్నప్పుడు ఆ నగరంలోని కుటీరాల్లోను, పరిసర గ్రామాల్లోను నాలుగు వేలకు పైగా వున్న మగ్గాల చప్పుళ్లు విని పిస్తుండేవి. నేతపని వాడు కావలసిన వస్తువులకోసం, లేదా నమూనాలకోసం పని ఇచ్చేవాడిదగ్గిరికో, గుత్తవ్యాపారి దగ్గిరికో వెళ్ళి అవి తీసుకొని ఇంటికి తిరిగివచ్చి, ఆ తాను నేసి తిరిగి పని ఇచ్చినవాడి దగరకు వెళ్ళి దాన్ని వొప్పచెప్పి, రావలసిన డబ్బు పుచ్చుకొని మరొక ఆర్డరు తెచ్చుకుంటాడు.

విలియం కార్నెగీ 1834 లో మేరీ మారిసన్‌ను వివాహమాడాడు. అప్పటికే ఇతడు నేతపనివాడుగా పేరు పడ్డాడు. అంతస్తున్నర వున్న రాతికుటీరంలో వీరిద్దరికి 1835 నవంబరు 25 న పెద్దకుమారుడు కలిగాడు. ఉత్సాహవంతుడైన ఆతని తాత గౌరవార్థం అతనికి 'ఆండ్రూ' అని వారు నామకరణం చేశారు. విలియం మగ్గం క్రింది అంతస్తులో ఒక గదిని ఆక్రమించుకొని వుండేది. దానికి ప్రక్కగా ఉన్న గదిలోను, ఇంటికి కొసన వున్న చిన్న గదిలోను వాళ్లు నివసిస్తూండేవాళ్లు. విలియం ఎప్పుడూ ఏవేవో కలలు కంటుంటాడు; అయినా మంచివాడు. నీతిమంతుడు. ఒక సంవత్సరం అటూ ఇటూగా ఇతడు తన వ్యాపారాన్ని బాగా పెంపొందించాడు. వాళ్ళు పెద్దయింట్లోకి మారారు. అనంతరంగా మరి మూడు మగ్గాలు కొన్నారు. వాటిమీద పనిచేయటానికి మనుష్యులను పెట్టుకున్నారు. క్రింది అంతస్తంతా నేతగదులు. వారి నివాసం పై అంతస్తులో.

తరువాత చాలాకాలానికి ఆ ఆండ్రూ మహాధనవంతుడైనప్పుడు వంశ వృక్షాలను వ్రాయటం వృత్తిగా పెట్టుకొన్న ఒక వ్యక్తి వచ్చి అతని వంశవృక్షాన్ని తయారుచేసే పని ఇవ్వవలసిందని కోరాడు. వాళ్ళను స్కాచ్ రాజకుటుంబపు సంతతివాళ్ళని అందులో నిరూపిస్తానని సూచన చేశాడు

"ఇది వినటానికి నా కెంతో చింతగా వుంది" అని, ఈ మాటలు నచ్చని కోటీశ్వరుడు "నేను ఒక నేతపనివాడి కుమారుడ నన్న భావంతోనే నా భార్య నన్ను వివాహం చేసుకున్నది" అంటూ ప్రతి సమాధాన మిచ్చాడు.

అతడు స్కాచ్ రాజుకు మనుమణ్ణి, మునిమనుమణ్ణి చేస్తానని కూడా చెప్పి వుండేవాడు.

ఈ కుటుంబం వారు కొన్ని తరాలుగా నేత పనివాళ్లు తన కుటుంబం బలిష్టులు, నీతిమంతులు అయిన కర్మకారులు పుట్టిన కార్మిక కుటుంబమైనందుకు అతను ఎంతగానో గర్వించేవాడు. నిజం! స్కాట్లాండులో ప్రభు వర్గానికి చెందిన కార్నెగీలు వుండేవారు. కార్నెగీ అన్నది నార్తెస్క్, సౌతెస్క్ ప్రభువులకు కుటుంబ నామం. తరవాత కాలంలో ఆండ్రూ స్కాట్లండులో తన స్థానాన్ని నిర్మించుకొన్నప్పుడు అతడు నార్తెస్క్ ప్రభువు ఆప్తమిత్రుడైనాడు. తమ ఇద్దరికీ కుటుంబ సంబంధమైన బంధుత్వం లేదని తెలిసినప్పటికీ వాళ్లు ఖులాసాగా ఒకరి నొకరు 'సోదరా!' అని సంబోధించుకొనేవారు. ప్రభువులతో బంధుత్వం కోసం కార్నెగీ ఎన్నడూ ప్రయత్నించలేదు.

చిన్ని ఆండ్రూకు నాలుగైదేళ్ళ వయస్సు వచ్చినప్పుడు వాళ్ళ నాన్న కాళ్ళతో పలకలను త్రొక్కి ఆసుకోలని అటూ ఇటూ త్రిప్పుతూ రవసెల్లాలమీద తెల్లనిపూలు, తీగలు, పక్షులు ఇతర దృశ్యాలు నేసి క్లిష్టమైన పనితనంగల అంచులతో వాటిని రూపొందిస్తుంటే మగ్గం ప్రక్కనకూచుని చూడటానికి ఎంతో సరదా పడేవాడు. మగ్గంమీద పని చేస్తూ "బాయటీ రాస్", "లోఛబర్ నో మోర్" లేదా.

"'Scots who have for wallace bled,
Scots whom Bowie had often led,
Welcome to your glory bed,
Or to Victory."

అన్న పాతకాలపు స్కాచ్ వీర గీతాలను, పాడుకుంటూ పాడటంకంటె గొణుగుకుంటూ ఉండే సిగ్గరి, సాధువు అయిన తన తండ్రి అంటే ఆండ్రూకు ఎంతో భక్తి.

"1314లో బానాక్‌బర్న్ యుద్ధానికి ముందు ఇంగ్లీషు సైన్యానికి ఎదురుగా నిల్చిన తన సైన్యాన్ని ఉద్దేశించి రాబర్టు బ్రూస్ చేసిన ప్రసంగంగా ఈ 'స్కాట్స్...' అన్న గేయం ఊహింప బడుతున్నదని తన తండ్రి పాటను తొలిసారిగా మధ్యలో ఆపి తనకు చెప్పి తిరిగి ఎత్తుకొని ఎప్పుడు పాడాడో ఆండ్రూకు జ్ఞాపకంలేదు. కొన్ని సమయాల్లో అతడు ఇది కూడా చేర్చి చెప్తుండేవాడు : "రాబర్టు బ్రూస్!"—మన మొదటి రాబర్టు బ్రూస్ రాజు అయినది ఇక్కడే. బుజ్జీ ! నీకు తెలుసునా ? అంటే వందల సంవత్సరాలకు పూర్వం ఇంగ్లీషువారినుంచి స్కాట్లాండ్ దేశానికి ముక్తి కలిగించిన ఇద్దరిలో ఒకడు. రెండవవాడు సర్ విలియం వాలెస్" అతడు ఆసుర్కోలిని ఎడమనుంచి కుడికి,మళ్ళీ వెనకకు ఆడించేవాడు. "బ్రూస్‌ను ఇక్కడే డన్‌ఫర్మ్‌లైన్‌లోని అబ్బీలో ఖననం చేశారు... అంతకు అగని రాణి, అనేకమంది మన రాజులు రాణులు ఎంతోదూరంనుంచి మాల్కం కానోర్ కుకు వచ్చారు. అతని రాణి మార్గరెట్. ఆమే 1075 లో ఈ అబ్బీని స్థాపించింది" అని అతడు చెప్పేవాడు.

స్కాట్లండ్‌కు మధ్య యుగంలో రాజకీయ మత విషయిక ముఖ్యనగరం కావటంవల్ల డన్‌ఫర్మ్‌లైన్ వాస్తవికంగా ఒక చరిత్రాత్మకమైన చిన్న నగరం. అందులోని

రాజసౌధం, మధ్యాగారం మరికొన్ని కట్టడాలు ఈనాడు శిథిలావస్థలో వున్నవి ఒకప్పుడు స్కాచ్ రాజకుటుంబం నివసించినదీ,ఇంగ్లండు రాజు ఛార్లెస్ I జన్మించినదీ అయిన రాజసౌధానికి సంబంధించిన ఒక గోడమాత్రం నేటికీ పడిపోకుండా నిలచి వుంది. గౌరవనీయుడైన బ్రూస్ గోరీతో సహా రాజుల గోరీలకు, రాణుల గోరీలకు నీడ నిస్తూ అందమైన నలు చదరపు బురుజులతో, ఎత్తయిన శిఖరాలతో వున్న అందమైన గోథిల్ అబ్బీ ఇంకా నిలిచివుంది. డన్ఫర్మ్లైన్ నుంచి ఆగ్నేయ దిక్కుగా ఫిర్త్ ఆఫ్ ఫోర్త్ లోయగుండా చూస్తే, మబ్బులు లేని రోజున, పదిహేను మైళ్ళ దూరాన పొగల మధ్య కనిపించే ఎడింబరోలోని పొగ గొట్టాలు,గండ శిలమీద ఉన్న దాని ఎత్తయిన దుర్గం కనిపిస్తవి.

వివాహం వల్ల అంకుల్ అయిన జార్జి లాడర్ ఇష్టుడయిన బంధువు ఇతడు చరిత్ర, జనశ్రుతిని బోధించే ఉపాధ్యాయుడు. అంకుల్ లాడర్ ఒక షాపు వ్యాపారి. అతని భార్య కొన్ని యేండ్లకు పూర్వం చనిపోయింది. ఇతడు ఆండ్రూను, తల్లిలేని తన కుమారుడైన జార్జిని నగరంలోను నగరం చుట్టుప్రక్కలా వున్న చరిత్రాత్మక ప్రదేశాలకు తీసుకునిపోయి చూపిస్తుండేవాడు.బయలు దేరబోయేముందు వారు చూడనున్న ప్రదేశాలను గురించి కొంత తెలుసుకో మనేవాడు. అందువల్ల అతడు దేన్ని గురించి ప్రసంగించ బోతున్నాడో వాళ్లకు ముందే తెలిసివుండేది. ఉదాహరణకు అతడు వాళ్ళను నగరానికి కొన్ని మైళ్ల దూరాన వున్న

లోచ్ లెవెన్‌ను తీసుకువెళ్ళినప్పుడు వాళ్ళకు సరస్సులోవున్న చిన్న ద్వీపంమీాద నేడు శిథిలావస్థలో వున్న, దుర్గంలోనే ఎలిజబెత్ రాణి ఏడవ హెన్రీ రాజుకు పెద్ద మనుమరాలిని గనుక వారసత్వం వల్ల రాజ్యం నాదని కోరిన దురదృష్ట వంతురాలు మేరీని ఖైదీ చేసిందన్న సంగతి వాళ్ళకు తెలుసు.

తరువాత చాలా సంవత్సరాలకు అంద్రూ, ఇక్కడా అక్కడా జనోపయోగ కృత్యాలను చేస్తున్నప్పుడు, లాడర్ టెక్నికల్ కాలేజీని కట్టించి తనకు ప్రియుడైన తన అంకుల్‌కు స్మృతిచిహ్నంగా దాన్ని దానం చేశాడు.జార్జి లాడర్ జూని యర్ ఆండ్రూలు జీవిత పర్యంతం పరస్పరమైన స్నేహాను బంధంతో వర్తించారు. అతి బాల్యదశలో పిల్లలు ఒకరిపేరు ఇంకొకరు పలకలేకపోయేవారు. ఎంతో బాగా అనగలిగితే ఆండీ జార్జిని 'డాడ్' అనీ, జార్జి కార్నెగీని కుదించి 'నైగ్' అనీ అనగలిగేవారు. తరువాతి జీవితంలో కూడా వాళ్ళు ఒకరి నొకరు అలాగే పిలుచుకొన్నారు.అలాగే ఉత్తరాలల్లో సంత కాలు చేశారు.

వారి వయస్సు ఆరేళ్లు వున్నప్పుడు స్కాట్లండులోని ఉత్తర భాగంలో పర్యటించటానికివచ్చిన యువ విక్టోరియా రాణిని చూడటం కోసం వాళ్ళను తీసుకువెళ్ళటం జరిగింది. ఆమె ఆంగ్ల దేశీయురాలు. దాక్షిణాత్య. ఈ బాలురు దేశ భక్తిపూరితులు. తమ దేశానికి దేశీయుడైన ఒక రాజు వుండాలని వీళ్ళ అభిప్రాయం. అందువల్ల ఈ స్కాచ్ బాలు

రిరువురూ ఆమెను శీతలమైనవిమర్శక దృష్టితో చూశారు.

"ఆమె మీ అమ్మవలె పొడగరి కా"దన్నాడు డాడ్.

"ఆమె గాను ఏమంత అందంగా కూడా లే"దన్నాడు నైగ్. వాళ్ళ వెంట వచ్చిన తన అమ్మను చూస్తూ.

వయసు వచ్చిన తరువాత ఇంగ్లండునెడ అతని దృష్టి పక్వమైంది. అతడు ఉన్నతులు, బిరుదాంకితులు అయిన అనేకమంది ఆంగ్లేయులతోను, వారి కుటుంబాలతోను సన్నిహితమైత్రిని పెంపొందించుకున్నాడు. కాని అతడు బాల్యంలో సామరస్యంలేని స్కాచ్ పక్షపాతి.

డన్ఫర్మ్లైన్లోని కార్మికులు, విద్యార్థులు బాగా చదువుకుండేవారు. ఆలోచనలు చేస్తుండేవారు. వర్తమాన విషయాలమీద అక్కడ మితవాదులు మొదలు అతివాదుల వరకూ అన్ని భావఛాయలున్నవారు ఉండటంచేత చర్చలు చేస్తుండేవారు. ఈ చర్చలు ముఖ్యంగా రాజకీయమత విషయాలను గురించి సాగుతుండేవి. వాళ్ళ చిన్న పుస్తకాల షెల్ఫులలో ఉన్న పుస్తకాలను ఒకచోటికి చేర్చి చదువుదామని తృష్ణ ఉన్న ఎవరికైనా పుస్తకాలను ఎరువు ఇచ్చే అయిదుగురిలో విలియం కార్నెగీ ఒకడు. యీ కారణంవల్లనే కార్నెగీకి గ్రంథాలయాలను నెలకొల్పాలన్న ఆత్మప్రబోధ సహజంగా కలిగింది. అతనికి రాబర్టు బరన్స కావ్యాలమీద కేవలం స్కాచ్ వారికి మాత్రమే వుండదగ్గా, అందులో అతనికి మరీ విశిష్టమై అతనిదే అనదగ్గ శ్రద్ధాయుతమైన గౌరవం వుండేది. కార్నెగీలో ఇది జీవిత పర్యంతం ఇలాగే ఎట్టిమార్పును పొందకుండా నిలచి

వుంది. యౌవనవేళ అతడు సాహిత్యంలో ద్వితీయస్థానాన్ని సర్ వాల్టర్ స్కాట్‌కు ఇచ్చాడు.

తండ్రికి వున్న గ్రంథపఠనాభిలాష కొన్నివేళల్లో అతని పనికి అడ్డువస్తుండేది. అతడికి డికెన్స్ నవల లంటే గాఢమైన గౌరవం. అవి ముప్పదిరెండు పుటలలో చిన్న కర పత్రాలుగా, నెల కొక ప్రకరణగా వస్తుండేవి. స్థానికంగా వార్తాపత్రికలను అమ్మే ఒకవ్యక్తి వాటిని పంచి ఇస్తుండే వాడు. ఇతడు "అండా! సుప్రభాతము! 'ది ఓల్డు క్యూరియా సిటీ షాప్' క్రొత్త సంచిక ఇదిగో!" అంటూ ఇంట్లో ప్రవే శించగానే లిల్లీ కార్నెగీ దాన్ని ఆతురతతో లాక్కునేవాడు, అంతటితో అతని మగ్గం ఆడటం మానేసేది. ఎంత తొందరైన నేతపని వున్నాసరే డికెన్సు అతణ్ని అలా సమ్మోహి తుణ్ని చేసేవాడు. అయిదు... పది... పదిహేను నిమిషాలు కథను మింగివేస్తున్నట్లుగా చదివి ఎలాగో యత్నంమీద త్రెంచుకుని బయటపడి మళ్ళీ ఆ సుశోషిని అతివేగంగా ఆడించేవాడు. మళ్ళీ మగ్గం కోప తీవ్రతతో ధ్వనిస్తూ పని చేసేదిమధ్యలో అతడిభార్య పై అంతస్థులోకూచుని ఆసుత్రోవికి అందించటం కోసం నూలును కండెలకు చుడుతుండేవి. లిల్లీకి మధ్యలో ఒక ఆడపిల్ల పుట్టిపోయిన తరువాత ఆండ్రూ కలిగిన ఆ రేండ్లకు మరొక మొగశిశువు జన్మించాడు. అందువల్ల ఆమె కొన్నివేళలలో నూలుకండె చుడుతూనే కాలితో ఉయ్యాలను ఊపుతుండేది.

ఇంటి నేత పరిశ్రమ పడిపోతున్నదని, ఆ స్థానాన్ని

ఆవిరిమీద నడిచే మర మగ్గాలున్న కర్మాగారాలు ఆక్రమిస్తున్నాయని ఆండ్రూ అతి బాల్యంలోనే గమనించాడు. చేనేతపనివారి ఆందోళన అతితీవ్రం కాజొచ్చింది. కొందరు జిల్లాలో మధ్యగా వేస్తున్న క్రొత్త రైలుమార్గంమీద పని చేయటంకోసం పలుగు పార పుచ్చుకుని వెళ్ళవలసివచ్చింది. కొందరు బొగ్గు గనుల్లో పనిచేయటానికి వెళ్ళారు. మార్గరేట్ కార్నెగీకి సన్నిహిత కుటుంబాలోనివారు ముగ్గురు —సోదరుడు విలియం మారిసన్, ఇద్దరు సోదరీమణులు మిసెస్ థామ్సన్ హోగన్, మిసెస్ ఆండ్రూ ఐట్కిన్‌లు వారి భర్తలతో —అమెరికా దేశానికి వలసపోయినారు. లోకజ్ఞానం తక్కువయిన విల్లీ కార్నెగీ, ఎంతగా సన్నగిల్లిపోతున్నా ఇంకా ఆశను చంపుకోలేక తన పాత వ్యాపారాన్ని, పాత దేశాన్ని అంటిపెట్టుకుని అలాగే వుండిపోయాడు అయితే ఒకరోజున దీనవదనంతో ఇంటికి తిరిగివచ్చి తన నేతపనివాళ్ళలో ఒకడితో ఇలా అన్నాడు. "తమ్మాస్! నిన్ను పంపించి వేయవలసి వచ్చేటట్టుంది. పని చాలా తరిగిపోయింది" త్వరలోనే తన నేత పనివాళ్ళలో మరొకణ్ణి, మరొకణ్ణి వరుసగా పంపించివేయటం జరిగింది. విలియం ఒక్కడే చివరకు మిగిలాడు. మంచి విలువైనదిగా భావింపబడుతూ వచ్చిన ఇరవై పౌనుల ఖరీదుమగ్గాన్ని అమ్మవలసి వచ్చింది. కాని దానివల్ల అతడికి లభించింది కొద్ది షిల్లింగులు మాత్రమే.

జీవిత వ్యయంకోసం మగ్గాలలో రెండోది మూడోది కూడా వెళ్ళిపోవటం తప్పలేదు. కుటుంబం ఒక చౌక కుటీరంలోకి చేరింది. అందులోనే మిసెస్ కార్నెగీ చిన్నదుకాణం

పెట్టి కూరగాయలు, పండ్లు, తీపివస్తువులు అమ్ముతుండేది. మధ్య మధ్య చిత్రమైన సమయాలలో సాయంత్రవేళల్లో సోదరుడైన ధామస్ మోసస్ కోసం ఆ అనురాగమూర్తి స్థిరసంకల్పంతో పాదరక్షలు కుడుతుండేది. మోసస్ పాదరక్షల వ్యాపారి. ఇతడు కేవలం చెడిపోయినవాటిని బాగు చేసి ఇచ్చేవాడు మాత్రమే కాదు. అనేకమంది పనివాళ్ళను పెట్టుకొని పాదరక్షలను ఉత్పత్తిచేసే పెద్ద వ్యాపారి. అప్పటికి ఇంకా పాదరక్షలను యంత్రాలమీద ఉత్పత్తి చేసే విధానం రాలేదు. ఆండ్రూ అమ్మ పక్కన కూర్చొని సూదులకు దారా లెక్కిస్తూ దారాలకు మైనం రాస్తూ మధ్య మధ్య వీలు చిక్కినప్పుడల్లా కొంత కాలాన్ని చదువుకోటం కోసం వినియోగిస్తుండేవాడు. రోజల్లా అతనికి ఏదో పని వుంటూ ఉండేది వీధికి పైగా ఒకటో రెండో ఇళ్ళు వరసలుదాటి వెళ్లి అక్కడ ఉన్న ఉమ్మడి బావినుంచి కడివెడు నీళ్లు తీసుకురావటం అతని మొదటి కర్తవ్యం. అక్కడ అనేకు స్త్రీలు, బాలురు, బాలికలతో వున్న ఒక వరుసలో చేరి అనేకమందలో తనవంతు వచ్చేదాకా నిలచి వుండవలసి వచ్చేది. తరువాత ఎక్కువకాలం బళ్లో గడపి ఇంటికి వస్తే చెప్పిన చిన్నపనులకోసం అటూ ఇటూ వెళ్ళి వచ్చేటప్పటికల్లా భోజనపువేళ అయ్యేది.

'మాన్ వాజ్ మేడ్ టు మోర్న్' అన్న బరన్స్ కవి పద్యం కంఠస్థంచేసినందుకు మిస్టర్ మార్టిన్ అన్న గట్టిపట్టుదలగలవాడైన వృద్ధోపాధ్యాయుడు అతనికి పారితోషికంగా ఒక పెన్నీ ఇచ్చాడు. కుటుంబంలోని వాళ్లవల్ల కాకుండా

బయటివాళ్ళ దగ్గర్నుంచి అతడు సంపాదించిన మొదటి పెన్నీ యిదే స్కాట్ వృగ్రంథాలలోనుంచి ఒకచిన్నకావ్యాన్నో లేక వచన భాగాన్నో కంఠస్థం చేయించి అంకుల్ లాడర్ అప్పుడప్పుడూ ఒకటో రెండో పెన్నీలు అతడికి ఇస్తుండే వాడు. కావ్యాలను కంఠస్థం చెయ్యడం ఆనాటి ఆచారం. కోరినప్పుడు వుపయోగించడానికి వీలుగా నాలుకతుదను వుత్తమకవిత్వసంపదను నిల్పుకొని జీవితాలను సంపన్నం చేసుకున్న ఆనాటి అనేకులలో ఆండ్రూ ఒకడు మాత్రమే.

నెమ్మదిగా అయినా నిశ్చయంగా తాము అమెరికా చేరడానికి యత్నించాలని మార్గరెట్ కార్నెగీ ఒప్పందల చేసుకున్నది. థామస్ హోగన్ను, ఆండ్రూ ఐట్కెన్ను — పిట్స్‌బర్గుకు పైగా వున్న అలిఘనీ నదిమీది పిట్స్‌బర్గుకు సోదర నగర(మైన అలిఘనిలో —)ఇప్పుడిది పిట్స్‌బర్గులో ఒక భాగం ...నివసిస్తున్నారు. పెద్ద ధనికులు కాలేకపోయినప్పటికీ స్కాట్లండ్‌లో కంటె సుఖంగా అక్కడ వారి జీవితం గడచి పోతున్నది. పిట్స్‌బర్గుకు పశ్చిమంగా ఎంతో దూరం కాని ఓహైయోలో ఆమె సోదరుడు మారిసన్ తన వ్యవసాయ క్షేత్రంలో కృషిచేస్తూ కొంత అభివృద్ధికి వస్తున్నాడు. వ్యవసాయ క్షేత్రంలో తన భర్త ఎందుకూ పనికిరాడని మిసెస్ కార్నెగీకి తెలుసు. అయితే పిట్స్‌బర్గులోగాని, అలిఘనీలోగాని తన భర్త ప్రవృత్తికి తగ్గపని ఏదైనా దొరికితీరుతుందని ఆమె ఊహించింది. అవకాశాన్ని తప్పక వినియోగించుకోవాలి అని విలియంకు ఆమె నెమ్మదిగా నెమ్మదిగా వెంటబడి బోధించింది.

అయితే మిగిలిన మగ్గాన్ని, గృహోపకరణాలను వేలంములో అమ్మితే వచ్చిన మొత్తం శోచనీయమైనంత స్వల్పం. కార్నెగీల సముద్ర ప్రయాణానికి అవసరమైన మొత్తానికి ఇంకా ఎంతో తక్కువైంది. ఈనాడు మనం నమ్మలేనంత తక్కువ మొత్తంలో ఎవరైనా సరే తెరచాప పడవ లెక్కి ఆనాడే అట్లాంటిక్ సముద్రాన్ని దాటటానికి వీలున్నప్పుడు కూడా వారిని బయట పడవేయాలని మార్గరెట్‌కు జీవిత పర్యంత మిత్రురాలు ఒకతె పూనుకొన్నంతవరకూ వారి స్థితి నిరాశాపూరితమై ఉంది ఆ మిత్రురాలు మిసెస్. జాన్ హేన్డర్ సన్. మార్గరెట్‌కు "అయ్‌లీఫార్గీ" కన్నెగా పున్నప్పుడు ఆమె పేరు అలిసన్ ఫెర్గుసన్. ఈ పేరునే మార్గరెట్ చిన్నతనంలో "ఆలైఫార్గీ" అని ఉచ్చరించేది అయ్‌లీ ఆమె భర్త ఇల్లు కొనుక్కుందామని ప్రతి నెలా పది షిల్లింగులు, అంటే రెండున్నర డాలర్లు, తీసి విడిగా జాగ్రత్త పెడుతున్నారు మిసెస్ హెన్డర్ సన్, ఎవరి మాటా వినకుండా చివరకు కార్నెగీలకు వినాశం తప్ప ఏమీ కలగబోదని ఊహిస్తున్న మార్గరెట్ సహోదరుడయిన థామస్ మారిసన్ కూడా తిరస్కరించి, తాము దాచుకున్న మొత్తం ఇరవై పౌనులూ మార్గరెట్‌కు ఇవ్వటానికి సంసిద్ధురాలైంది.

"ఓహో! అయ్‌లీ" అని తబ్బిబ్బు పడి ఆశ్చర్యాన్ని వెలిబుచ్చింది. "మరి మీ ఇల్లో!"

"అది ఆగవచ్చు. నా బాల్య మిత్రురాలికి నేను చేసే ఈ సాయం చాలా స్వల్పం" అన్నది మిసెస్ హెన్డర్ సన్.

మిసెస్ కార్నెగీ కనులలో బాష్పబిందువులు క్రమ్మి వేశాయి. "మరి జాన్ ఇందుకు ఒప్పుకున్నాడా?" అని అడిగింది.

"అవును. అయితే ఇది చాలుతుందా అన్నదే మరి?"

"చాలు ననుకుంటాను. ఎలాగో ఇనుక్కుకొని గడుపు కొంటాము" అన్నది మార్గరెట్. "ఓహో! అయ్‌లీ! నీకు కృతజ్ఞతలు తెలుపుకోటానికి నాకు మాటలు రావటం లేదు. గీచి పోగుచేయగలిగినంత తొందరలో తిరిగి ఇచ్చివేస్తామని వాగ్దానం చేస్తున్నాను"

మార్గరెట్ కార్నెగీ ప్రయాణం సన్నిహితమైనప్పుడు డన్ఫెర్మ్‌లైన్ దుఃఖంలో మునిగిపోయింది. ఎన్నో ఇళ్ళల్లో ఇందుకు కన్నీరు కార్చారు. ఎరిగినవాళ్ళందరికీ ఆమె ఏవేళకంగల సలహాదారుగను, మిత్రురాలుగను మెలగుతుండేది. ఆపద వచ్చినప్పుడు అమితమైన సాయం చెయ్యటానికి ఆమె ఎల్లవేళలా సంసిద్ధురాలై ఉండేది. అయితే అమెరికాకు వెళ్ళిపోవాలన్న విషయంలో కుటుంబంలోని ఇతర సభ్యులందరికంటే ఎక్కువ పట్టుదల ఆమెకే. ఆమె భర్త వెళ్ళిపోతున్నందుకు తగినంతగా చింతించాడు. తనకు అతి ప్రియులయిన అంకుల్ లాడర్, డాడ్ కి మరి ఇతర బంధువులకు దూరుడై నగరంనుంచి విడివడిపోతున్నందుకు అత్యధికంగా చింతపడ్డవాడు ఆండ్రూ. నలభై సంవత్సరాలకు తరువాత అతడు ఇలా వ్రాశాడు: "హిందువులకు వారణాసి ఎటువంటిదో, మహమ్మదీయునికి మక్కా ఎటువంటిదో, క్రైస్తవునికి జెరూ

సలెం ఎటువంటిదో నాకు డన్‌ఫర్మ్‌లైన్ సర్వం అటువంటిది. అప్పుడు అమెరికాను గురించి అతడికి ఉత్సాహ భావమేమీ కలగలేదు - బ్రూస్ లేడు, వాలెస్ లేడు, బరన్స్ లేడు. పరికించి చూస్తే గర్వించి చెప్పదగ్గ వీరులు లేని దేశం. తుది రాత్రి, తుది ఉదయ భోజనం, తుదిగా వినిపించిన అబ్బీ గంటల తియ్యని చప్పుడు డన్‌ఫర్మ్‌లైన్‌లోని ఆనాటి ప్రతి అంశం అతనికి హృదయవిదారక మైంది.

తన బాల్యాన్ని గడిపిన ఇంటివైపుకు వెన్ను త్రిప్పిన తారీఖును- మే 18. 1848- ఆతడు ఎన్నడూ మరచిపోలేదు. అప్పుడు అతని వయస్సు పదమూడు సంవత్సరాలు. అందమయిన ఆతని చిన్ని తమ్ముడు థామస్ మోరిసన్ వయస్సు అయిదేండ్లు. ఫోర్తు అగాధంలో వున్న నౌకాశ్రయానికి వెళ్లుతున్న దారిలో పెట్టెబండి కిటికీలోంచి చెమ్మగిల్లే కన్నులతో అప్పువచ్చిన కొండను కనుమరుగాదృష్టినిమూరంచేసిదాచివేస్తున్న డన్‌ఫర్మ్‌లైన్‌లోని కొండ గుట్టలను అన్నిటినీ, తుదిగా అతి పురాతనమైన అబ్బీ శిఖరాన్ని వెనక్కి తిరిగినిలబడి చూశాడు. అంకుల్ లాడర్, డాడ్, అంకుల్ థామస్‌లు వారిని సముద్ర తీరందాకా అనుసరించారు. రేవు చేరగానే ఆండ్రూ హఠాత్తుగా అతి వేగంతో అంకుల్ లాడర్ దగ్గిరికి వెనక్కు వెళ్ళి "అబ్బా! నిన్ను విడిచిపెట్టలేను, నిన్ను విడిచిపెట్టలేను" అని ఏడుస్తూ చేతులతో అతణ్ని చుట్టవేశాడు. ఎవరో నెమ్మదిగా అతణ్ని వదిలించి తీసుకుపోయి నావ ఎక్కించారు. స్వదేశాన్ని విడిచిపెట్టి నవప్రపంచంతో వారి యాత్ర ప్రారంభమైంది.

# సంకటపు సంవత్సరాలు

## 2

అలిఘనీ, 1848 లో మాగుడువాసన, బురద, కొల్లి కొల్లిగా గడ్డికట్టి వుండే వీధులు, ప్రతివసంతంలోను వచ్చి బాధపెట్టే వరదలు, అప్పుడప్పుడు విజృంభించే కలరాలతో ఆకర్షణ ఏమాత్రమూ లేని నగరాలలో వొకటిగా వుంటుండేది అయితే అది క్రమరహితంగా మాత్రం వుండేదికాదు. అయితే అందులో ఇరవైరెండువేల మంది నివసిస్తున్నా అక్కడి రక్షకభటుల సంఖ్య నలుగురుమాత్రమేనని ఆండ్రూ కజిన్ డాడ్‌కు వ్రాసిన వుత్తరంలో సవ్యంగా తెలియజేశాడు. ఇందులోని జనంలో యెక్కువమంది ప్రతినిత్యమూ ఉదయము, సాయంకాలము అలిఘనీ బ్రిడ్జిమీదగా నడిచి వెళ్ళి పిట్స్‌బర్గులో పనిచేస్తుంటారు.

ఆత్మబంధువులైన మిసెస్ థామస్ హోగన్, ఆంట్ అన్నా ఐట్కిన్‌లు కార్నెగీలకు హృదయపూర్వకమైన స్వాగత మిచ్చారు. వీరు అందరు రెబెక్కా వీధిలో నివాసాలు ఏర్పరుచుకొన్నారు. వీళ్ళల్లో ఎవరూ సంపత్తి కలవారు కారు. అయినా భద్రత లభించటంవల్ల తాము సుఖంగా వున్నామనే భావిస్తున్నారు. అంహాల్ టామ్

హోగన్ వారి గ్రోసరీ దుకాణంలో గుమాస్తాగా పనిచేస్తు న్నాడు సుఖప్రదమయిన చిన్న రెండతస్తుల ఇంట్లో వుంటూ దానికి అద్దె చెల్లింప గలుగుతున్నాడు. చాలా సంవత్సరా లకు పూర్వమే భర్త చనిపోయిన ఆంట్ ఐట్కెన్ ఇప్పుడు ఒక చిల్లర దుకాణానికి యజమానురాలై ది అంకుల్ టామ్ సోదరుడయిన ఆండూ హోగన్ ఆంట్ ఐట్కెన్ నివసిస్తున్న ఇంటికి చివరలో ఉన్న చిన్న ఇంట్లో వుంటూ నేత నేస్తుండే వాడు ప్రస్తుతం అందులో నుంచి మారబోతున్నాడు. ఆంట్ ఐట్కెన్ దాన్ని కార్నెగీలకు ఇచ్చింది.

"అన్నా! అద్దె యెంత వుంటుంది?" అని విలియం అడిగాడు

"మీ కెంత విలువ దొరుకుతున్నదాకా ఏమీ వుండదు" అన్నది దయామూర్తి ఆ ఆంట్. విలియం అం దుకు అభ్యంతరం చెప్పాడు కాని ప్రస్తుతం అతనికి అంత కంటే గత్యంతరం లేదు.

ఇక ఇప్పుడతడు, వెనక స్కాట్లండులో చేస్తున్నట్లు గానే చేనేతపని ప్రారంభించాడు. అయితే అమెరికాలో చేనేతను మరమగ్గాలనేత అతివేగంగా త్రోసిపుచ్చటంవల్ల అతడు అక్కడికంటే ఇక్కడ ఎక్కువ ఇబ్బందులమధ్య పని చేయ వలసి వచ్చింది. డన్‌ఫెర్మ్‌లైన్‌లో నేసిన వాటికంటే చౌకరకం బల్లగుడ్డలను, తీసిపారవేయదగ్గ ప్రత్తి జాతి గుడ్డ లను నేసి విలియం ఇంటింటికి తిరిగి అమ్ముతుండేవాడు. ఈ సమయంలో అతడి భార్య చెప్పులు కుట్టుట మనే ప్రాతపనిని

ఎత్తుకొని మిష్టర్ ఫిలిప్ అనే చిన్న చెప్పుల దుకాణదారుకు చెప్పులు కుట్టియిస్తుండేది. ఫిలిప్ దుకాణంలో ఇద్దరు లేదా ముగ్గురు. ఇంటివద్దగ పనిచేసే మార్గరెట్ కార్నెగీ వంటి కొందరు సహాయకులతో దొరకిన ఆర్డర్లకు అనుగుణంగా చెప్పులు కుట్టించి ఇవ్వటమే కాక ఇతర కాల పాదరక్షలను కూడా తయారుచేయించి వాటిని మోసుకొనిపోయి అలిఘనీ, పిల్స్‌బర్గులకు చుట్టుప్రక్కల వున్న గ్రామ సీమల్లోకి కూడా వెళ్ళి అమ్ముతుండేవాడు

ఇంటిపని తక్కువగా వున్నప్పుడల్లాను, కొన్ని సమయాల్లో అర్థరాత్రివరకూ చెప్పులు కుట్టటంలో యెంతో శ్రమపడి మిసెస్ కార్నెగీ వారానికి దరిదాపుగా నాలుగు డాలర్లు సంపాదించగలిగేది. యిప్పుడు చిన్న టామ్‌కుకూడా సాయపడవలసిన వంతు వచ్చింది. బడి లేనప్పుడు అతడు తల్లికి ప్రక్కన క్రిందుగా చిన్న పీటమీద కూచుని సూదులకు దారాలెక్కించి ఇవ్వటం, దారాలకు మైనం వ్రాసి అందివ్వటం చేస్తుండేవాడు. ఆ సమయంలో ఆమె అతనికి అద్భుతమయిన తన జ్ఞాపకశక్తితో స్కాచ్ వైతాళికులు పాడిన కొన్ని వీరగీతాలనో, వాల్టర్ స్కాట్ రచించిన దీర్ఘ కావ్యాలల్లోనుంచి కొన్ని భాగాలనో కంఠస్థం చేసిన వాటిని వినిపిస్తుండేది ఎంతో చక్కగా ఉల్లాసం కల్పించగల దన్న ఆమె కీర్తి పరిసరాలల్లో వున్న పిల్లల్లో బాగా వ్యాపించి పోయింది. ఆమె స్కాచ్ చరిత్రిలోనుంచి కథలను చెపుతుండేనో,

"Nine-and-tweny Knights of fame
Hung their shields in Branksone Hall.
Nine-and twenty squires of name
Brought then their steeds to bower from stall.
Nine-and twerty Yoemant all
Waited, duteous, on them all..
They were all knights of mettle trwe,
Krismar to the blod Bucclewch."

మొదలయిన ఉద్రేకపూరిత కావ్య భాగాలను సర్ వాల్టర్ ఉద్గ్రంథాలనుంచి పఠిస్తుంటేనో ఆతనరతతో కొన్ని వేళ్ళల్లో ఆమె చుట్టూ పిల్లలు గుంపులు చేరేవాళ్ళు.

తొలుతగా కార్నెగీలు అలిఘనీలో నివాసమేర్పరుచుకొన్నప్పుడు ఆ [illegible] దూ[illegible]ంత పొట్టిగా, నలుచదరపు దవడతో, ఒం[illegible] దూరంగా వుండేటట్లు పొదగబడ్డ కళ్[illegible] తెల్లని దర్శించే జుట్టుతో స్పష్టమైన నా[illegible] వుంటుండేవాడు. "బాటమ్ హూసి[illegible] బడే పరిసర ప్రాంతాల్లోని పిల్లలు (అలిఘ[illegible] తంవల్ల వీరికి ఈ పేరు వచ్చింది) ఇతన్ని [illegible] "స్కాచీ" అని పిలిస్తే ఆండీ దానికి స్కాచ్ బాలుని వుచ్చారణతో "అవును నేను స్కాచీనే. అందుకు గర్విస్తున్నా!" నని గట్టిగా తిరిగి దెబ్బకొట్టినట్లు సమాధానం చెబుతుండేవాడు ఇలా ఎగతాళిచేస్తే వాళ్ళల్లో ఎక్కువమంది పిల్లలు తామే స్వచ్ఛమయిన స్కాచ్ వాళ్లు స్కాట్లండునుంచి వలసవచ్చిన వాళ్ళ బిడ్డలు-కావటం ఇందు

లోని హాస్యాస్పదమయిన అంశం. వీరూ ఆండీ లాగానే అమెరికాలో కాక తమ పూర్వదేశమయిన స్కాట్లండులో పుట్టినవాళ్లు. అయితే కొద్దికాలంలోనే ఆండీ ఆ తన స్కాచ్ యాసను అతి వేగంగా పోగొట్టుకొన్నాడు. కొద్ది నెలల్లోనే తానుకూడా "బాటయ్ హూపియర్ల"లో ఒకడయినాడు. ఆ పిల్లలందరూ తరువాతికాలంలో ఎంతో అభివృద్ధికి వచ్చి ప్రముఖపౌరులైనారు. ఉచ్ఛస్థితికి రావటానికి వాళ్ళలో కొందరికి ఆండీ తోడుతగా దోహదంచేశాడు ఇది గమనించ వలసిన మరో విషయం.

దరిదాపుగా ఫలరహితమైన బేగపుతిరుగుడు తిరిగివచ్చి అమ్ముకుపోని గుడ్డలను ఒక మూలపడేసి నిట్టూరుస్తూ "అమ్మా! ఇదేమీ ప్రయోజనంలేదు. ఈ రకంగా అయితే జీవనోపాధిని సంపాదించుకోలేము, ఇక బ్లాక్‌స్టాక్ కాటన్ మిల్లులో ఉద్యోగం చూసుకోక తప్పదు!" అని ఒక రోజున అన్నాడు విలియంకార్నెగీ అక్కడ తనకు పని దొరుకుతుం దని ముందుగానే విచారణచేశాడు. పనికి కుదిరాడు. తరు వాత కొద్ది దినాలకు "ఆండ్రా! మిల్లులో నీకు పనికూడా ఉంది" అన్నాడు.

ఆండీ పనికోసం వెతుకుతున్నాడు. ఎక్కడకు వెళ్ళినా అతణ్ని చాలా చిన్నవాడంటున్నారు. ఇప్పుడు అతడికి అమి తోత్సాహం కలిగింది. "ఎటువంటి పని నాన్నా!" అని అడి గాడు.

"ఉండలు చుట్టటం"

"అందుకు మరి నాకు జీతమిస్తారా!"

"నీకు వారానికి ఒక డాలరు ఇరవై సెంట్లు వస్తుంది" అది నమ్మలేనంత తక్కువజీతం. అయినా, అది కుటుంబనిర్వహణానికి తనుకూడా సాయపడినవాడనౌతానన్న వుద్రేకంతో ఆండీ అది విని పరవశుడైనాడు. తరువాత అతడు తండ్రి సూర్యోదయానికి పూర్వమే లేచి - చలికాలంలో ఇంకా ముందుగానే లేచి అతివేగంగా ఉదయ భోజనంచేసి: స్థిమితంగా సాయంత్రం ఆరుగంటలవరకూ పనిచేయుట కోసం కర్మాగారానికి ఉరకులెత్తేవాళ్లు. విల్లీకార్నెగి వ్యక్తిత్వంగల భావకుడు. ఇతరుల ఆజ్ఞలకు లోబడి ఒక నిర్ణీత కార్యక్రమాన్ని అనుసరించి కూలికి ఒకరి దగ్గర పనిచేయటానికి ఏమాత్రం తగనివాడు. నేతపని యంత్రంమీద జరుగుతుండడాన్ని చూసి అతని అంతరాత్మ ఎదురు తిరుగు తుండేది. తట్టుకోలేక కొన్ని నెలలు గడచిన తరువాత కర్మాగారాన్ని వదిలివేశాడు. ఇంటిలోఉన్న మగ్గాన్ని చేసుకొని బల్లగుడ్డలు మరిన్నిగా అడపాదడపా తయారుచేసి ఇంటింటికి మైళ్ళ తరబడిగా నడచివెళ్ళి ఒకటో రెండో ఆ బల్లగుడ్డలను అమ్ముకొస్తుండేవాడు.

కుటుంబానికి తమ పూర్వదేశంనుంచి వలసవచ్చిన వారితో పరిచయం వృద్ధిపొందుతున్న రోజుల్లో ఆండ్రూ మరొక స్కాట్లండ్ దేశీయుడైన జాన్ హెను కలుసుకున్నాడు. అతడు అతనికి చాలా ఎక్కువ జీతంతో — అంటే వారానికి రెండు డాలర్లు. ఒక వుద్యోగ మిస్తా నన్నాడు. ఇంతవరకు అతడు చేయవలసివచ్చిన అసంతృప్తికరమైన పనులన్నిటిలోకీ అది దొడ్డది. చిన్న ఇంజనుమీద దృష్టినిలిపి.

దాని బాయిలర్ క్రిందనిప్పు వేస్తూ విశాలమైన ఒకచీకటికొట్లో అతడు పనిచేయాలి. అటువంటి పరీక్షా సమయావస్తే దాన్ని సర్ విలియం వాలెస్ ఎలా ఎదుర్కొనేవాడో అని ఊహిస్తూ తన ఉద్యోగంమీద ఉత్సాహాన్ని నిలుపుకోటానికి అతడు యత్నించాడు. ఉద్యోగం ఎంత అసహ్యకరమైంది. అయితే నేం అతడు దాన్ని ఎంతగా అసహ్యించుకుంటున్నాడో అతడు తల్లిదండ్రులకు తెలియనివ్వకూడదు.

తన కర్మాగారంలో ఒకమూల బల్లవేసుకొని కూర్చున్న మిస్టర్ హే — అతని కార్యాలయానికంతటికీ అతడొక్కడే ఉద్యోగవర్గం — ఒక రోజున కుర్రవాడైన ఆండీని పిలిచి అడిగాడు: "నీకు లెక్కలు బాగా తెలుసునా?" అని.

"ఆర్యా! తెలుసుననుకొంటాను" అన్న సమాధానం వచ్చింది

"నీవు బాగా వ్రాయగలవా?"

"ఆర్యా! చాలా అందంగా వ్రాయగలను."

"ఎలా వ్రాస్తావో చూడనీ, యిక్కడ కూర్చో." ఆండీ చేతిలో ఒక కలాన్నిదోపి కాగితాన్ని ముందుకు త్రోశాడు. "ఆ చెడ్డగా లేదు. చెడ్డగా లేదు" అన్నాడు వ్రాసింది చూస్తూ. నాకు బిల్లులు వ్రాసిపెట్టటం నీ కిష్టమేనా?"

"ఓ తప్పక చేస్తాను." అని ఆశ్చర్యపడుతూ తాను పనిచేస్తున్న చీకటి కొట్టులోనుంచి బయటపడటానికి అతను ఎంత ఆతురత వహిస్తున్నాడో వెల్లడించే ఉత్సాహంతో అన్నాడు.

వెనకటంత చెడ్డదిలేదా అంతకంటె మరీ చెడ్డది అయిన పని తనకు రానున్నదని అతడు అప్పుడు కొంచమైనా వూహించలేదు. అతను మిస్టర్ హా యిచ్చిన "సింగిల్ ఎంట్రీ బుక్ కీపింగ్" పని కొద్దికాలంలోనే పూర్తిచేస్తుండేవాడు. యిది అసలు పనికాలంలో సగానికైనా సరిపోదు. అందువల్ల మిగిలిన రోజంతా అతడు కండెలను నూనె తొట్టిలో ముంచి సరిచేస్తుండేవాడు. ఆ నూనెకు ఎంతో కష్టంమీదగాని అతడు సహించలేనంతటి కంపువుండేది. మనస్సును బ్రూస్, వాలెస్ లమీదగ ఎంతగా లగ్నం చేసినప్పటికి యితడు దాన్ని సహించలేక పోతున్నాడు ఓర్చుకోలేక పళ్లు మెలికలు తిప్పి కొరుకుతుండేవాడు. అయినా తను బాధపడుతున్నది తల్లి దండ్రులకు ఏమాత్రం తెలియనిచ్చేవాడు కాదు.

సాయంత్రం అతడు ఒక గంటసేపు ఫిలిప్ చెప్పుల దుకాణం దగ్గర జాన్ ఫిలిప్‌తోను, యితర బాలురతోను గడుపుతుండేవాడు వీళ్ళలో ఎక్కువ మంది స్కాచ్ బాలురు. ఒకనాటి సాయంత్రం అతడు తన బుక్కీపింగు పనిని గురించి వాళ్ళకు చెబుతున్నప్పుడు టామ్‌మిల్లర్ "హా వ్యాపారం వంటి చిన్నదానికి సింగిల్ ఎంట్రీ బుక్కీపింగు పనికివస్తే రావచ్చునుగాని పెద్దకంపెనీలన్నీ తమలెక్కలను డబుల్‌ఎంట్రీ విధానంలోనే వ్రాయిస్తా"నన్నాడు

యిది ఆండీకి క్రొత్త విషయం. అతడు ఆ క్రొత్త పద్ధతిని గురించి యింకా ఎక్కువగా తెలుసుకో దలచుకున్నాడు. అయితే దీన్ని గురించి టామ్‌కు వున్న జ్ఞానం చాల

తక్కువ. కొన్ని సాయంత్రాలు గడిచిన తరువాత ఎవరో ఒకవ్యక్తి క్రమమైన రుసుము తీసుకుని సాయంసమయాల్లో ఆ బుక్ కీపింగు విధానాన్ని పాఠం చెప్తాడనీ టామ్ తెలియజేశాడు. కొన్నాళ్లు ఆలోచనలు సాగించిన తరువాత ఆండీ, టామ్, జాన్ ఫిప్స్, లిల్లీ క్రాలీలు వాళ్ళకు వచ్చే కొద్ది రాబడులలోనే చిన్న మొత్తాలను ఆ పాఠాలు నేర్చుకునేటందుకు దాచుకుంటామని నిశ్చయించారు. అప్పటినుంచి వారు డబల్ ఎంట్రీలోని విశేషాలను నేర్చుకుంటూ కొన్ని సాయంత్రాలు గడిపారు.

గత్యంతరం లేక ఇష్టం లేకపోయినా చేయవలసివచ్చిన పనిలో అనుదినకాలో అతను గడిపిన మొత్తం ఒకటిన్నర సంవత్సరాలకాలమే ఆతని జీవితమంతటిలోకూ ఆనందవిహీనమయిన సమయం. అయితే అతని అదృష్టంలో మార్పు సిద్ధంగా వుంది.

అప్పుడు 'తంతి' బాల్యావస్థలో వుంది. తూర్పు నుంచి పిట్స్‌బర్గ్ వరకూ ఓ లైను పూర్తిచేశారు. దాని వ్యాపారం అతివేగంగా వృద్ధిపొందుతున్నది. దానికి స్థానిక కార్యనిర్వాహకుడు డేవిడ్ బ్రూక్స్ అలిఘనీలో కార్నెగీలకు పొరుగువారు. అతడు, అంకుల్ టామ్ హోగన్ ఇరువురూ సాయంతన వేళల్లో చదరంగం ఆడుకుంటూ ఆనందిస్తుంటారు.

ఒకరాత్రి వాళ్లు అప్పుడే ఒక ఆట పూర్తిచేశారు. మరొక ఆటకోసం పావులను అమరుస్తుండగా మిస్టర్ బ్రూక్స "మా వ్యాపారం అతి వేగంగా పెంపొందుతున్నది. అందు

వల్ల మాకు తంతులను బట్వాడా చేసేటందుకు మరొక వార్తావాహి బాలుడు కావలసి వచ్చాడు. మంచివాడు, గట్టిగా నమ్మదగ్గవాడు మీ కెవరైనా తెలుసునా?" అన్నాడు.

మిస్టర్ హోగన్ తన మనుష్యుల నందరినీ ఒక్క మారు చివరవరకూ జ్ఞాపకం చేసుకొని క్షణమాలోచించాడు. "నా కొక నెవ్యూ వున్నాడు. వాడు ఈ పని చెయ్యవచ్చు. పేరు ఆండ్రూ కార్నెగీ. కొత్త డాలరులా మెరుస్తుంటాడు. నమ్మదగ్గవాడు మనస్ఫూర్తిగా పనిచేస్తాడు. ఎంతపనికీ వెరవడు" అని తగువాత అన్నాడు.

"వయస్సెంత?"

స్వల్పతీక తెచ్చుకొని అంకుల్ టాయ్ అన్నాడు: "పదునాలుగన్నర. వయసులో చిన్నవాడయినా వయసుకు మించిన చురుకుతనం వున్నవాడు. అటువంటి బాలుడికి మీ రేమిస్తారు?"

"వారానికి రెండున్నర డాలర్లు. ఇది ఆతడికి తృప్తిగా వుంటే నా కార్యాలయానికి పంపించి నాతో మాట్లాడమంటారా?"

"అలాగే చేస్తాను."

మిత్రులిద్దరూ ఆట పూర్తిచేశారు. వెంటనే మిస్టర్ హోగన్ కార్నెగీల ఇంటికి వెళ్ళాడు అప్పటికి సాయంకాలం చాలావరకు గడిచిపోయింది. అయినా మిసెస్ కార్నెగీ చెప్పులు కుడుతున్నది.

అంకుల్ టాయ్ తెచ్చిన వార్తమీద ఉల్లాసకర

మయిన చర్చలు సాగాయి ఆండీ ముఖం వుద్రేకంతో మెరిసిపోతున్నది. ఓహో! ఆ దారప్పుకండెం తొట్టిదగ్గర నుంచి దూరంగా వెళ్ళిపోవటం! అతనికి ఏవో నూతన ప్రపంచద్వారాలు తన కోసం విచ్చులాలైనట్లు తోచింది. కానీ అతని తండ్రి మాత్రం అనుమానిస్తున్నాడు.

"ఆండా ఎంత చిన్నవాడో మిస్టర్ బ్రూక్స్ కు తెలిసి వుండ" దని అతను అన్నపెట్టాడు. "అతను యిస్తా నన్న జీతాన్ని బట్టి ఇంతకంటే వయసున పెద్దవాడు బలిష్ఠుడు అయిన కుర్రవాడు కావలెనని అతడు వుద్దేశించి వుంటాడు

"ఆండీ వయసున చిన్నవాడే. కానీ అసాధారణమైన చురుకుతనం వున్నవాడని నేను ఆతడికి వివరించి చెప్పాను" అన్నాడు. అంకుల్ టాయ్ "అతను ఇంతకంటే పెద్దవాడు కావలెనని వుద్దేశించలేదు ఆండీ అతడికి సంతృప్తి కలిగించ గలడని నా విశ్వాసం"

మిస్టర్ కార్నెగీ తల ఊపాడు. "థామస్! నీవు ఇందులోని మంచి చెడ్డల నన్నిటినీ ఆలోచించినట్లు లేదు. అతణ్ని నానారకాలైన స్థలాలకు పంపిస్తుంటారు. అందులో కొన్ని కుర్రవాళ్లు వెళ్ళదగ్గవిగా వుండవు వార్త లను చేతికిచ్చి చీకటి రాత్రుల్లో బయటికి పంపించవచ్చు. బహుశః గ్రామసీమలకు కూడా పంపించవచ్చు అంతే కాదు. మొదట అతనికి ఈమహానగరమే సరిగా తెలియదు" అన్నాడు నొక్కి పలుకుతూ.

"నేను త్వరలో తెలుసుకొంటాను" ఆదుర్దాతో వణికి పోతూ ఆండి మధ్యలో జోక్యం కల్గించుకొని అన్నాడు.

"కాదు, కాదు" అన్నాడు తండ్రి. "నీవు అందులో చేరవద్దు."

పనిచేసుకొంటూనే విషయాన్ని గురించి ముందు వెనుకలు ప్రశాంతంగా ఆలోచిస్తూన్న తల్లి ఈ క్షణంలో తన నిర్ణయాన్ని బయటపెట్టింది. ఆమె అన్నది : "చేరడమే అండ్రికి చాలా మంచిది. నా అభిప్రాయం" "అల్లిక దారపు కర్మాగారంలోనే అతడు నిరంతరం పనిచేస్తుండాలని మనం అనుకోటానికి వీల్లేదు. అక్కడ అతడి అభివృద్ధికి ఎటువంటి అవకాశం లేదు"

"నేను చానిలోనుంచి బయటపడదామనుకుంటున్నా" నన్న ఆండీ గొంతు భావోద్వేగంవల్ల గాద్గద్యం వహించింది. "అక్కడా నెక్ట్రను ఒక్క క్షణకాలంకూడా నేను భరించలేనని ఎన్నో రాత్రులు అనుకుంటుండే వాణ్ని."

అతనివంక తండ్రి ఆశ్చర్యంతో చూశాడు. ఈ వ్యతిరేక భావాన్ని గురించి అతడికి తెలియదు.

"ఈ విషయం మాకు ఎందుకు చెప్ప" లేదని తల్లి అడిగింది.

"మీకు ఇబ్బంది కలిగించటం నాకు ఇష్టంలేక పోయింది."

"మిస్టర్ బ్రూక్స్ రేపు తన్ను కలుసుకోమన్నా" డన్నాడు అంకుల్ టామ్. తంతి కార్యాలయం ఫోర్త్ అండ్ వుడ్ వీధులమధ్య వుంది."

ఆండ్రూకు ఆరాత్రి నిదపట్టటం కష్టమయింది. అతడు మర్నాడు ఉదయమే పెందలకడ మేల్కొన్నాడు.

ఉదయ భోజనవేళ తండ్రి ఇలా అభిప్రాయ ప్రకటన చేశాడు. "మిస్టర్ బ్రూక్స్‌ను చూడ్డానికప్పుడు నేను కూడా నీవెంట వస్తాను. అయితే దీన్ని గురించి ముందుగా మిస్టర్ హాతో ఆలోచిస్తాను."

చాలా చిన్న విషయాన్ని గురించి తండ్రి పెద్దగొడవ చేస్తున్నాడని ఆండ్రీకి అనిపించింది. విషయాన్ని తనకు వదలిపెడితే సూటిగా మిస్టర్ బ్రూక్స్ కార్యాలయానికి వెళ్ళి "నేను ఉద్యోగంలో చేరుతాను" అని చెప్పేవాడు అయితే తండ్రి అంటే అతనికి "అమితగౌరవం. అందువల్ల ఏమీ అనలేదు. మిస్టరు హాన్‌తో ఆలోచించటానికి మిస్టర్ కార్నెగీ అత్యాతంగా వెళ్లాడు.

అతణ్ణి పోగొట్టుకోటంవల్ల నాకు ఎంతో అసౌకర్యం కలుగుతుంది కానీ అంకువల్ల అండ్రూకు బహుశా అధిక ప్రయోజనం ఉండవచ్చు కనుక అతణ్ణి దగ్గరనుంచి మార్చవలసిందే అని నేను సలహా ఇస్తాను. తండ్రి వారు అంగీకరించకపోతే అతడు తిరిగి ఇక్కడికి రావచ్చు." అన్నాడు సత్యాన్ని పలికే మిస్టర్ హా

ఇంతలో ఆండ్రీకి మంచి పంట్లాం తొడిగి మంచి నీల వర్ణపు జాకెట్టువేసి, ముఖంతుడిచి, బూడదరంగు జుత్తును జాగ్రత్తగా సరిదిద్ది దువ్వి, చివర దిద్దుబాట్లు పూర్తిచేసి పరికిస్తున్నది తల్లి వసంతపు ఉదయవేళ అతడు, అతని తండ్రి రెండు

మెట్లు నడిచి పిర్త్ అండ్ వుడ్ వీథుల మూలలలో ఉన్న తంతి కార్యాలయం దగ్గరికి చేరారు మిస్టర్ బూక్స్ కార్యాలయం రెండవ అంతస్థులో కనిపించింది. మెట్లగది ద్వారం దగ్గర ఆ దూ|తోవ్బా తాను చేసుకొన్న నిర్ణయానికి తగ్గట్టుగా |పవ_ర్తించాడు.

ఆగి తం|డికి ఎదురు మళ్ళగా నిలిచి అతడు "నాన్నా! దయవుంచి మీరు ఇక్కడే ఉండిపొండి. ఈపనిని నన్నే స్వయంగా చెయ్యనివ్వండి. మిస్టర్ బూక్స్‌తో నన్ను అన్నాడు. ఒంటరిగా మాట్లాడ నివ్వండి" అయితే తన భయమేమిటో అతడు చెప్పలేదు తం|డి తన చిన్నరూపంమీద దృష్టినిలిచేటట్లు మాట్లాడ ఉద్యోగాన్ని పొందే అవకాశం అతిస్వల్పంగా ఉండేటట్లు చేస్తాడేమా అన్నది. అతని భయం "నాన్నా! ఈపని నంతటినీ నేనే స్వయంగా చేసుకొంటా" నని వేడుకొన్నాడు.

తండ్రి అతనివంక శోధనాపూర్వకంగా చూసి అన్నాడు. "మంచిది. నీకోసం నేను ఇక్కడ ఎదురు చూస్తుంటాను." అందువల్ల తండ్రి |ప్రవేశద్వారం దగ్గర ఆగిపోయాడు. ఆండ్రూ మేనేజరును చూడటానికి వెళ్ళాడు.

మిస్టర్ బూక్స్ ఎంతో దయగా అప్పుడే కుర్రవాడికి ధైర్యం చెప్పాడు. జీతాన్ని గురించిన |ప్రసంగంలో కూడా ఉదారంగా ఉండటానికి యత్నించాడు.

పిట్స్‌బర్గ్ నాకు పూ_ర్తిగా తెలియదు. అయితే, అతి త్వరితంగా తెలుసుకొంటాను. నేను చిన్నవాడినని నాకు తెలుసు, బహుశః ఈ ఉద్యోగానికి తగినంత బలిష్ఠుణ్ని కాక

పోవచ్చు. కానీ నిర్వహించగలనన్న నమ్మకం నాకుంది. నే నో రేవన్లా నాకో అవకాశ మిప్పించమని"

"జీతం-వారానికి రెండున్నర డాలర్లు-నీకు సంతృప్తి కరంగా ఉంటా?" అని అడిగాడు మేనేజరు.

"ఇంకా నేను ఎక్కువ సంపాదించుకో గలిగేదాకా సంతృప్తికరమే"

"పని ఎప్పుడు ఆరంభిస్తావు?"

దీన్ని గురించిన నిర్ణయం చేయటానికి ఆండీకి రెండు క్షణాలకంటే ఎక్కువకాలం అవసరం లేకపోయింది. "మీరు కోరితే ఇప్పుడే ఆరంభిస్తాను"

"చాలా బాగుంది" అని గొంతు పెద్దదిచేసి అతడు "జార్జ్!" అని పిలిచాడు.

ఆండీ కంటే పెద్ద కుర్రవాడొకడు ప్రక్కగదిలోనుంచి వచ్చాడు.

"జార్జ్! ఇతను మన నూతన వార్తా హరి, ఆండ్రూ కార్నెగీ" అన్నాడు మిష్టర్ బ్రూక్స్ "ఆండ్రూ, జార్జి మెక్లైన్ నీకు నగరాన్ని, ఈ పద్ధతులను పరిచయం చేస్తాడు"

జార్జి ఆండీవంక తిరస్కార పూర్వకంగా చూస్తున్నాడు "ఇతను మనకెందుకు పనికివస్తాడు. చెయ్యవలసిన పనికి ఇతను చాలా చిన్నవాడు" అన్నాడు.

"ఆ నిర్ణయం చేయటం నాకు విడిచిపెట్టు" అని మిష్టర్ బ్రూక్స్ ముక్తసరిగా సమాధానం చెప్పాడు. "వెంటనే ఆండ్రూను లోపలికి తీసుకుపో ఆపరేటర్ల దగ్గర

నుంచి వార్తలను పుచ్చుకో ఇవాళ ఇతణ్ని నీవెంట తీసుకో వెళ్లు, నువ్వు ఎలా పనిచేస్తావో చూస్తాను."

ఆపరేటర్ల గదిలో ఆండీ కొద్ది నిముషాలు జార్జితో గడిపాడు. అప్పుడు అతడికి తండ్రి విషయం జ్ఞప్తికి వచ్చింది.

"అరె" అని కేక పెట్టాడు. మా నాన్నను అక్కడ ప్రక్కదారి దగ్గర నిలువబెట్టి వచ్చాను. క్రిందికి వెళ్ళి ఆయనకు చెప్పి వస్తాను."

పరుగెత్తుకుంటూ మెట్లు దిగాడు. "నాన్నా! అంతా నిర్ణయమైంది." పెద్దగా అన్నాడు. "నాకు ఉద్యోగమిచ్చారు. వెంటనే పని ప్రారంభించాలి"

కాంతిని విరజిముతున్న అతని ముఖం అతడెంత సంతోషంగా ఉన్నాడో తండ్రికి తెలియ జెప్పింది.

కుర్రవాడి బుజంమీద చెయ్యి ఉంచి "నిన్ను గురించి నాకెంతో సంతోషంగా ఉంది. బాబూ!" "ఇందుకు మీ అమ్మ సంతోషిస్తుంది. నీవు చేతనైనంత బాగా పని చేస్తావని నాకు తెలుసు," అన్నాడు.

# వార్తాహారి బాలుడు

## 3

అంతా దాన్నిగురించి తరువాతి కాలంలో తను దిరిగి చూచుకొన్నప్పుడు ఆ రోజు అతనికి తన జీవితంలో ఒక మైలురాయిలా, ఒక పరివర్తన బిందువుగా కనిపించింది. చీకటికొట్టులో నుంచీ, కంపుకొట్టే నూనెతొట్టి దగ్గరనుంచీ బయటపడి ఇప్పుడు అతడు మంచి వెలుగులో, తంతికార్యాలయ కలకలంలో, నగరవీధుల్లో, కర్మాగారాల్లో, గిడ్డంగుల్లో, స్వేచ్ఛతో సంచరిస్తున్నాడు. ఇంటిదగ్గర ఎప్పుడో గాని తిండి తినటం పడటంలేదు. దాన్నిగురించి కుటుంబంలో వారికి చెప్పటానికైనా అతనికి అవకాశం దొరకటంలేదు. వెంటనే వీధుల అమరికను, వాటిల్లో నడుస్తున్న వ్యాపారాలను, నగరాన్ని గురించినదంతా తెలుసుకోటానికి అతడు పూనుకున్నాడు. నగరంలోని ప్రముఖులను –వ్యాపారస్థులను, వ్యాపార కార్యనిర్వాహకులను, వృత్తి నిర్వాహకులను --- అందరినీ తెలుసుకున్నాడు. అతని పరిచయస్థులలో తరువాత కాలంలో అధ్యక్షుడు లింకన్‌కు యుద్ధ కార్యదర్శి అయిన

ఎడ్విన్ యం. స్టాన్టన్ ఒకడు. ఆయనతో పరిచయం కలిగినందుకు అతడు ప్రత్యేకంగా గర్విస్తుండేవాడు.

తంతికార్యాలయం వారి వ్యాపారం వృద్ధిపొందుతుండటంవల్ల మరొక కుర్రవాడు అవసరమై ఉండటాన్ని గురించి మిస్టర్ బ్రూక్స్ ఆండ్రూతో మాటాడాడు. "ఆర్యా! నేను ఒకణ్ని తీసుకురాగలనని చెప్పి అలిఘనీ నుంచి తన యిరుగుపొరుగు కుర్రవాడయిన డేవిడ్ మెక్కార్గోను తీసుకొచ్చాడు. జార్జి మెక్లయిన్ వెళ్ళిపోయినాడు. తరువాత ఆండీ బాటమ్ హూసీర్లలోనుంచి ఒకరి తరువాత ఒకరిని మరి మూగ్గురు కుర్రవాళ్ళను — రాబర్టు పిట్కైర్న్, హెన్రీ ఆలివర్, విల్లీ మోర్లాండ్ లను - తెచ్చి ఒప్పజెప్పాడు. వారూ వంతుల ప్రకారం కార్యాలయంలో వ్యాపారసమయం ప్రారంభం కాకముందే ఫ్లూర్ని బాగుచేయటానికి పెందలకడ వస్తుండేవారు. ఈస్టరనే టెలిగ్రాఫ్ కంపెనీ సూపరింటెండెంటు రైడ్ - ఇతనుకూడా డన్ఫర్మ్లైన్ వాడే - పర్యవేక్షణకోసం పిట్స్బర్గ్కు వచ్చినప్పుడు ఈ స్కాచ్ వార్తాహారి బాలకుల్ని చూచి ఎంతో సంతోషించి వారందరికీ ఒకేరకమైన దుస్తులు ఏర్పాటు చేయించాడు - ముదురుపచ్చ జాకెట్లు, ట్రౌజర్లు. ఈ వేషంతో వాళ్ళు నగరంలోని వీధుల్లో వెడుతున్నప్పుడు విశేషంగా జనులదృష్టిని ఆకర్షిస్తుండేవాళ్లు.

ఒక పరిమితి దాటిన తరువాత తంతివార్తలను అందజేసినందుకు వార్తాహారిబాలురకు అదనంగా పదిసెంట్లను

పాటితో పికంక్రింద వసూలుచేసుకునే అవకాశ మిచ్చారు. ఈ జాతి తంతివార్తలను అందజేయటంలో ఇతరులకంటె ఎక్కువపంతు తెచ్చుకొనే విషయంలో ఆ బాలురకు ఆలోచనలు చర్చలు ప్రారంభమైనవి వాళ్ళ మైత్రికి భంగం కలగబోయేటంతగా కలతలు పెరుగుతున్నట్లు కనిపించాయి. అప్పుడు ఆండి అతనికి సహజమైన నీతి నిపుణతతో ఒకనాటి ఉదయాన ఆ బాలబృందాన్ని వుద్దేశించి ఇలా అన్నాడు: "మనం ఇలా పోటీపడటం తగదు వార్తలను ఎవరు అందజేస్తున్నా రన్నది మనం పట్టించుకోవద్దు. ఈ పదిసెంట్ల మొత్తాలను అన్నింటిని సమిష్టినిధిలో వేసి నెలాఖరుకు అందరము సమానంగా పంచుకుందాము."

వ్యాపారంలో ఉపయోగింప బడుతున్న అర్థంతో 'సమిష్టి'(Pool అన్న పదంతో ఆనాటికి ఇంకా పరిచయం కలగలేదు. కానీ అతడు చేసినది మాత్రం అదే. మిగిలిన బాలు రందరూ ఈ సూచన గురించి యోచించి, అండియే ఆ నిధికి కోశాధికారిగా వుండాలనే షరతుతో, అంగీకరించారు. దీని తరువాత దగ్గరలో ఉన్న ఒక తినుబండారాలమ్మే వాడి దగ్గర ఖాతా పెట్టి ఈ పదిసెంట్ల డబ్బులతో కొనుక్కుంటున్న కాండీ, కేకులను గురించి తప్ప మళ్ళీ ఎన్నడూ వాళ్ళమధ్య తగాదా రాలేదు. కొందరు తమకు రావలసినదానికంటే తినుబండారాలను ఎక్కువ వాడుకున్నప్పుడు ఆ వ్యాపారి నెలలోవచ్చే వారి వాటాలుపోను మిగిలిన డబ్బు చెల్లించవలసిందని కోరితే ఆండీ ఇద్దరు ముగ్గురు అతిగా వాడుకుంటున్న వాళ్ళ అవసరపు అప్పుడబ్బులను గురించి

బాధ్యతవహించ వలసివచ్చింది. తీపివస్తువులంటే అతిలో భాన్ని చూపించే కుర్రవాళ్ళల్లో మిక్కిలి పెద్దవాడు బాబ్ పిట్కైరన్. ఇతని దుబారాతనాన్ని గురించి హెచ్చరించి ఆండీ చీవాట్లు పెట్టినప్పుడు "ఇతడు నా కడుపులో జీవ జ్జంతువు లున్నాయి ఆండీ ! తీపివస్తువులను పెట్టి వాటిని మేపకపోతే అవి నా డొక్కలు కొరికేస్తా"యని గంభీరంగా సమాధాన మిచ్చాడు.

వీరంతా ఎటువంటి బాలదళం ! ఇందులోని రాబర్టు పిట్కైరన్ మధ్య మధ్య తన డబ్బును పెట్టుబడులలో పెట్టి, తరువాత పెన్సిల్వేనియా రైల్‌రోడ్ కంపెనీకి ఉపాధ్యక్షుడై నాడు. డేవిడ్ మెక్కార్గో రైలుమార్గాలను నిర్మించటానికి పూనుకొని ఇతరులతో కలిసి అలిఘనీ వాలీ రైల్వే నిర్మాతల్లో ఒకడయినాడు. హెన్రీ ఆలివర్ ఒక పెద్ద ఉత్పత్తి సంస్థకు ప్రముఖుడయి మిన్నసోటాలోని లోహఖనిజ ప్రాంతాన్ని వృద్ధిపొందించటంలో సహకరించి చివరకు ఒక కోటీశ్వరుడిగా మరణించాడు. విలియం మోర్‌లాండ్ పిట్స్ బర్గులో ఒక ప్రముఖుడయి, ఆటార్నీ పదవిని నిర్వహించిన వాడయి, అధిక సంపన్నుడయినాడు.

వార్తావహుడుగా ఆండ్రూ కార్నెగీ ఒక సంవత్సరం పనిచేసిన తరువాత ఒకనాడు మిస్టర్ గ్లాస్ పైనుంచి ప్రజా కార్యాలయంలోకి దిగివచ్చి మిస్టర్ బ్రూక్స్‌తో "నేను ఒక పనిమీద వెళ్ళుతున్నాను. యువకార్నెగీని కొన్ని క్షణాల పాటు కార్యాలయంలో ఉండమనండి" అన్నాడు. అందు

వల్ల పెద్దదైన ఆ కర్తవ్య నిర్వహణకు హఠాత్తుగా పిలుపు తనకు వచ్చినందుకు ఆండీ కొంతగా చకితుడయినాడు. పంప వలసిన తంతివార్తలను అందుకుంటున్నాడు. ఆపరేటర్ గది నుంచి బయటికి వచ్చిన వాటిని అందజేయటంకోసం వార్తా హారులకు పందియిచ్చాడు. మిస్టర్ గ్లాస్ అప్పుడప్పుడే రాజకీయాలల్లో ప్రవేశిస్తుండటంవల్ల అతడు లేనిసమయాలల్లో కార్యాలయ వ్యవహారాలను చూడవలసిందని ఆయడూలను తరువాత పదేపదే పిలవటం జరిగింది.

ఇప్పుడు బాలురకు పదకొండుం బాతికి డాలర్లు ఇస్తున్నారు. తరువాత వచ్చిన జీతపు- రోజున పుచ్చుకోవటం కోసం బాలురందరూ వరుసగా నిలబడ్డారు. ఆండీ తల్లడిల్లిపల్లుగానే అందరికీ జీతం బట్వాడా చేయటం జరిగింది. భీతి వల్ల అతడి తల తిరిగిపోతున్నది. అతన్ని అవసరంలేదని పంపించివేస్తారా ఏమిటి? అతని తప్పేమిటి? మిగిలిన పిల్లలందరూ గది విడిచిపెట్టి వెళ్ళిన తరువాత మేనేజరు నీకు రెండుం బాతికి డాలర్లు అనవం వస్తుందని చెప్పి అతడి చేతికి పదమూడున్నర డాలర్లిచ్చాడు.

అది ఒక శనివారం సాయంత్రం. తరువాతి కాలంలో ఆండీ ఇది బాగా గుర్తుపెట్టుకొన్నాడు. అతడు ఇంటికి రావటంలో చాలాభాగం పరుగెత్తుకుంటూ వచ్చాడు. నడిచే వాళ్ళతో బాట క్రిక్కిరిసి ఉండడంవల్ల కోరినంత వేగంగా పరుగెత్తే అవకాశం లేకపోయింది. అందువల్ల అతడు బండ్లు వెళ్ళే మార్గాన అలిఘనీ బ్రిడ్జికి అడ్డంగా పడి పరుగెత్తి ఇల్లు చేరుకున్నాడు. మధ్యలో ఒక నాటకీయమైన చిన్ని పథ

కాన్ని ఆలోచించాడు. రెబెక్కా వీధిని చేరుకోగానే ఉచ్ఛ్వాస సంకోచం కొంత వేగాన్ని తగ్గించాడు. ఇంట్లోకి వెళ్ళి ఎప్పుడూ ఇస్తున్న పదకొండు డాలర్ల ఇరవైయైదు సెంట్లను తల్లి చేతికి ధైర్యంగా ఇచ్చాడు. తనకోసమని అతడు ఎప్పుడూ డబ్బు ఖర్చుపెట్టకపోవటంవల్ల మిగిలిన పిల్లవాళ్ళు అతణ్ణి గురించి పిసినిగొట్టని అనుకుంటుండేవాళ్ళు. కార్నెగీ కుటుంబ సభ్యులమధ్య ఎంతటి సాన్నిహిత్యమున్నదో కుటుంబానికి సంపాదించే ముగ్గురు ఇంటిలోని వస్తు సామాగ్రిని, ఫర్నిచరు వస్తువులను కొనటానికీ, స్కాట్లాండులోని పూర్వ మిత్రురాలయిన మిసెస్ హెండర్సన్ ఇచ్చిన ఇరవై పౌనుల అప్పును తీర్చివేయటానికి పెన్నీలతో సహా ఎంత జాగ్రత్తగా కూడబెట్టుతున్నారో వారికి తెలియదు.

ఆండీ తల్లి అవకాశమున్నప్పుడల్లా ఒక వెండి అర డాలరును సంగ్రహించి ఈ నిధికి చేరుస్తుండేది. చివరకు ఇవి రెండు వందలు అయినప్పుడు ఆండీ వీటిని పిట్స్‌బర్గ్‌కు తీసుకుపోయి ఇరవై పౌనులకు డ్రాఫ్టు కొని మిసెస్ హెండర్సన్‌కు పంపించాడు. ఆనాడు మహానంద సమయం. కార్నెగీ కుటుంబం ఋణవిముక్తి పొందింది.

ఆనాటి రాత్రి తన రహస్యంతో ఉబ్బితబ్బిబ్బులవుతున్నా తాను తన తొమ్మిదేళ్ళ తమ్ముడు టామ్ ఇంటివెనక భాగంలోని పడక గది లోపలికి వెళ్ళేటంతవరకూ ఆండ్రూ తన అదృష్టాన్ని గురించి ఏమాత్రం చెప్పలేదు. తన రహస్యాన్ని ఏదో సణిగినట్లు బయటపెట్టి రెండు వెండి డాలర్లను ఇరవైయైదు సెంట్లను విడి విడి జేబుల్లోనుంచి తీసి తమ్ముడికి

చూపించినప్పుడు అవి ఒకదాని కొకటి తగిలి చప్పుడు కావటము కాని, వాటిని గురించి అతడు ప్రశ్న లడగటం కాని ఇష్టపడలేదు. టామ్ ఆ సంఘటనలోని ఘనతకు అబ్బురపడ్డాడు. చివర కడిగాడు : "ఆండీ ! వీటితో నీవేమి చెయ్యదలిచావు ?"

ప్రక్క మీదికి వాలుతూ "ఎప్పటికయినా అమ్మకే ఇస్తాను" అని సమాధానం చెప్పాడు. "నాన్నా కొండరికీ గొప్ప ఆశ్చర్యాన్ని కలిగించదలచుకొన్నాను. అందుకే బ్రమ్ పైకి పోవటం ఆరంభించాను. ఎప్పుడో ఒకరోజు నేను మిద్దరమూ "కార్నెగీ బ్రదర్స్" అన్న పేరుతో వ్యాపారము చేద్దాము.

"ఎటువంటి వ్యాపారం !" టామ్ తెలుసుకోదలచుకున్నాడు.

"తప్పక చేద్దాం. నేను ఇంకా నిశ్చయించేసుకోలేదు కానీ మనం ధనాన్ని సంపాదించి తీరుతాం నాన్న, అమ్మ మంచి బండి ఎక్కి తిరుగుతారు." గురక వినిపించి తాను చెప్పేది తమ్ముడు వినటంలేదని తోచేటంత వరకూ అతడు అలాగే భావ వీథుల్లో సంచరించాడు.

మరునాడు ఉదయకాల భోజన సమయంలో అతడు రెండుంబావుకి డాలర్లు బల్లమీద వుంచినప్పుడు తల్లి దండ్రులు తమ కళ్ళను తామే నమ్మలేకపోయినారు. తల్లి కన్నుల్లో సంతోషాశ్రువులు ఒక్కమారుగా పొంగి సుళ్ళు తిరిగాయి. భుజంమీద చెయ్యివేసి తండ్రి "ఆండ్రూ ! నిన్ను చూచి

పుస్తకాలు మాత్రమే చదివాడు కార్నెగీ కుటుంబానికి పుస్తకాలను కొనుక్కోటానికి ఖర్చుపెట్టగల అవకాశం లేదు. కల్నల్ జేమ్స్ ఆండర్సన్ అనే ఉద్యోగాన్ని విరమించుకొన్న ఒక ఉత్పత్తిదారు నాలుగువందల సంపుటాలున్న ఒక గ్రంథాలయాన్ని చేకూర్చుకొన్నాడు ఆదివారం నాడు ఆ కల్నలే లైబ్రేరియన్‌గా పనిచేస్తున్నప్పుడు కుర్రవాడు గ్రంథమొకటి తీసుకొని మళ్ళీ వచ్చే శనివారందాకా దాన్ని తనదగ్గిర వుంచుకోవచ్చు. సక్రమంగా అతడు దాన్ని తిరిగి ఇస్తే మళ్ళీ మరొకదాన్ని పుచ్చుకోవచ్చు. కల్నల్ పెట్టిన ఈ పథకం బాగా ప్రాకిపోయింది అందువల్ల ఉదార స్వభావుడయిన కల్నల్ దీనికి విస్తృతం చెయ్యటానికి నిశ్చయించాడు న్యూయార్కుకు వెళ్ళి అతడు మన్ని పుస్తకాలు కొన్నాడు. గ్రంథసంఖ్య పద్దెనిమిది వందలదాకా పెరిగింది. వాటితో ఆయన నగరం ఒక నివేశనాన్ని చూపిస్తే "మెకానిక్స్ అండ్ ఎప్రెంటిసిస్ లైబ్రరీ" అన్న పేరుతో ఒక గ్రంథాలయాన్ని నెలకొల్పటానికి నిశ్చయించుకున్నాడు. కౌన్సిల్ వెంటనే అందుకు అంగీకరించింది. జీతమిచ్చి ఒక లైబ్రేరియన్‌ను నియమించటంతో పని నడిచిపోతుంది.

అయితే ఈ క్రొత్తసంస్థ ఆండ్రూకు దెబ్బతగిలే ఒక నిబంధనను పెట్టింది. అది ఎల్లప్పుడు ఎప్రంటిస్‌లుగా వున్న వాళ్ళే ఈ గ్రంథాలయాన్ని ఉచితంగా వుపయోగించుకోవచ్చు ఇతరులు అందులో నుంచి పుస్తకాలను తీసుకొనే అవకాశమిచ్చినందుకు సంవత్సరానికి రెండు డాలర్లను చెల్లించాలన్నది. ఆండీ ఆ గ్రంథాలయానికి వెళ్లాడు. "తంతి

వార్తాపత్రిక బాలుడు డబ్బు చెల్లించకుండా పుస్తకాలను తీసుకొనే వీలు వున్నదా ?" అని బ్రెయిన్ ప్రశ్నించాడు.

"నీవు ఎ పెంటిస్‌గా బౌండ్ అయినావా" అని బ్రెయిన్ ప్రశ్నించాడు.

"లేదు. కాని..."

"వార్తాపత్రిక బాలుడు చేతులతో పనిచేసే వాళ్లు కాదు" ఇది తుది నిర్ణయంగా బ్రెయన్ సమాధానం చెప్పాడు.

"కావచ్చు అయితే వాళ్లు చాలా పనికాళ్ళతో చేస్తారు" ఆండీ వెంటనే ప్రతిగా సమాధానం.

"ఏమయినా రెండూ ఎప్పటికీ ఒకటి కాజాలవని బ్రెయిన్ అన్నాడు. బాగా విసిగిపోయి ఆండీ ఈ విషయాన్ని జనమందరికీ తెలియజేయాలని నిశ్చయించుకొన్నాడు. బౌండు కానంతమాత్రం చేత స్టోర్సులలో పనిచేసే పిల్లలను దాత వేరుగా ఊహించారని భావించటానికు వీలు లేదు. వీరిలో చాలామంది నిర్ణీతమయిన రెండు డాలర్ల సుంకాన్ని యివ్వలేరు కనుక గ్రంథాలయాన్ని వినియోగించుకోటం కేవలం ఎ ప్రెంటిస్‌లకు మాత్రమే పరిమితం చేయటంలో కొత్త మేనేజరు దాత వుద్దేశాన్ని అపార్థం చేసుకొన్నారని లోపాన్ని ఎత్తిచూపుతూ అతడు వ్రాసిన లేఖను 'పిట్స్‌బర్గ్ డిస్పాచ్' పత్రిక ప్రకటించింది. ఆ వుత్తరం చివర అతడు 'బౌండు కాని శ్రామిక బాలుడు' అని సంతకం చేశాడు.

ఇది ముద్రణవిషయంలో అతడు చేసిన మొదటి సాహసం. ఒకమారు చవిచూచాడు గనుక తరువాత అతడు తరుచుగా పత్రికలకు వ్రాస్తుండేవాడు. లైబ్రేరియన్ వెంటనే 'దానం ఎవరికోసమయితే వుద్దేశింపబడ్డకో ఉచిత వినియోగ దారుల పట్టికను వారివరకే పరిమితం చెయ్యవలసి వచ్చింది' అని పత్రికద్వారానే సమాధానమిచ్చాడు. ఊహించటానికి వీలున్నట్లే అతడు దీన్ని ఖండిస్తూ మరొక లేఖ వ్రాశాడు. అందులో అతడిలా వ్రాశాడు. "ఈ దానం ఎప్రెంటిస్‌ల కొరకన్నప్పుడు శబ్దార్థాన్ని నిష్కర్ష చేయటం జరిగిందా? వ్యాపారాన్ని నేర్చుకొంటూ బాండు అయిన వారికి మాత్రమే వుద్దేశింప బడ్డదా లేక బాండు అయినా కాక పోయినా శ్రామిక బాలుర కందరికీ వుద్దేశింపబడ్డదా అన్నది ప్రశ్న. ఇందులో మొకటిదే సత్యమని అంటే మేనేజర్లు ఉదారుడైన దాత ఉద్దేశాన్ని అపార్థం చేసుకొన్నారన్న మాట శ్రామిక బాలుడు."

ఈ లేఖ ప్రచురితమయిన తరువాత లైబ్రేరియన్ కల్నల్ ఆన్డర్సన్‌తో బేటీ వేసి వుంటాడు. తరువాత మూడు రోజులు డిస్పాచ్ పత్రిక సంపాదకీయపు పుటలో "బాండు కాని శ్రామిక బాలుడు ఈ కార్యాలయానికి విచ్చేయవలసిందని ప్రార్థన" అన్న పంక్తి ఒకటి ప్రచురితమయింది.

ఆండీ వెళ్లాడు. ఆతణ్ని లైబ్రేరియన్‌ను కలుసుకో వలసిందనీ, పై సూత్రాన్ని సడలించారనీ, అందువల్ల ఎప్రెంటిస్‌లు కాకపోయినప్పటికీ కార్మిక బాలు రందరూ ఉచిత వినియోగదారుల పట్టికలో చేరుతారనీ చెప్పటం జరిగింది.

జాతి కంతటికీ గొప్ప శ్రేయస్సును చేకూర్చిన కార్నెగీ ఉచిత ప్రజా గ్రంథాలయ భావానికి మూలభూతుడైన కల్నల్ జేమ్స్ ఆన్డర్‌సన్‌కు మనం ఎంతగానో కృతజ్ఞులమై ఉండవలసి ఉంది. కార్నెగీ తరువాత కాలంలో ఇలా వ్రాశాడు. "మానవుడు నేటివరకూ కూడబెట్టిన కోటానకోటి ద్రవ్య సంపదనంతటినీ ఇచ్చినా దానికి ప్రతిగా దేనిని ఇవ్వలేనో అటువంటి సాహిత్యాభిరుచిని నాకు కలిగించిన అతనికి" ధన వంతుడైన తరువాత కార్నెగీ అలిఘనీకి ఇచ్చిన గ్రంథాల యంలో హాలుకుముందు కల్నల్ స్మృతి చిహ్నంగా ఆతడు ఒక విగ్రహాన్ని ప్రతిష్ఠించాడు. దాని క్రింద ఉన్న రచనలో కొంతభాగం ఇలా ఉంది.

"పశ్చిమ పెన్సిల్వేనియాలో ఉచిత గ్రంథాలయ స్థాపకుడైన కల్నల్ ఆన్డర్‌సన్‌కు... ఇది వేటి మూలంగా యువకులు ఆరోహింపగలరో అట్టి అమూల్య జ్ఞాన భావనా నిధులు ఎవరికి ఆరీతిగా వివృతం చెయ్యబడ్డవో ఆ "కార్మిక బాలకు"లలో ఒకడైన ఆండ్రూ కార్నెగీ కృతజ్ఞతా పూర్వకంగా నెలకొల్పిన స్మృతి చిహ్నం."

తన చెలికాండ్రయిన జాన్ ఫిప్స్, టామ్ మిల్లర్, జిమ్మీ విల్సన్, విల్లీ కౌలీలతో బాటు మిస్టర్ ఫిప్స్ పాద రక్ష నిర్మాణశాలలో గడిపేది తప్ప మిగిలిన సాయంతనాల నన్నింటినీ-ఇంటిదగ్గర ఉండే ప్రతి రెంటో సాయంతనాల నన్నింటినీ-ఫ్లూటార్క్-లైవ్స్ మెకాలే లాంబుల వ్యాసాలు మెక్సికో పెరూలమీద స్పైనీయులు చేసిన విజయాత్రలను

గురించి ప్రెస్‌కాట్ రచించిన చరిత్రలు, మిగిలిన అన్నింటి కంటె అతి శ్రద్ధతో పఠించిన బాన్‌క్రాఫ్ట్ కృతి హిస్టరీ ఆఫ్ ది యునైటెడ్ స్టేట్స్ చదవటంతో అతడు గడిపివేసేవాడు. అతడు కొన్ని సాంకేతిక గ్రంథాలను, ముఖ్యంగా లోహ నిర్మాణాన్ని (Iron Making) గురించినవి, అతిజాగరూకతతో పఠించాడు. అప్పుడు ఎవరూ గ్రహించక పోయినప్పటికీ ఇది అతని భవిష్యత్తు కొరకు సూచికగా కనిపిస్తున్నది

అంకుల్ జార్జి లాడర్‌తోను, యువ జార్జితోను, బాల్యంలో తన పినికి పాత్రుడైన కజిన్ డాడ్‌తోను అతడు ఎప్పుడూ ఉత్తర ప్రత్యుత్తరాలు నడుపుతుండేవాడు ఆ లేఖల్లో అమెరికా సంయుక్త రాష్ట్రాలల్లోని స్వేచ్ఛా సాహసాలను గురించి అభ్యుక్తులు, గర్వోక్తులు ఉంటుండేవి. ఈ లేఖలే కజిన్ డాడ్ మనస్సులో బీజాలను నాటి తరువాత కొలది సంవత్సరాలల్లోనే అతడు అమెరికాకు వలసవచ్చేటట్లు చేశాయి.

విలియం కార్నెగీ స్వీడెన్ బోర్జియన్ చర్చిలో చేరాడు. అతని భార్య మతవిషయాలల్లో తాను మారంగా ఉంటున్నా అతని విశ్వాసాలలో ఎట్టి ప్రమేయం పెట్టుకోలేదు. ఆండీ కొన్ని సాంవత్సరాలు అక్కడి సండే స్కూలుకు వెళ్లాడు. అప్పుడు అతడు విశేషంగా స్వీడెన్ బోర్జియన్ విషయాలపై వ్రాసిన పుస్తకాలున్న సండే స్కూల్‌లోని చిన్న గ్రంథాలయానికి లైబ్రేరియన్‌గా ఉన్నాడు. 'మ్యాగ్రాఫ్' అనే పేరుగల ఆ సండే స్కూల్ పత్రికను అప్పు

డప్పుడూ చిన్నచిన్న రచనలు చేస్తుండేవాడు. ఈ చిన్న రచనల్లో ఒకటి యుద్ధ వ్యతిరేకతను నిరూపించేది అయి వుండటం ముఖ్యంగా గమనింపదగ్గ విషయం దీనిని అతను తన పద్దెనిమిదో యేట క్రిమియాలో ఇంగ్లండు రష్యామీద యుద్ధం చేస్తున్న మొదటి సంవత్సరం వ్రాశాడు. అతడు చర్చిలో పాట పాడుతుండేవాడు. సంగీతం వినటమంటే అతడికి మంచి ఆసక్తి, అయితే చర్చి సంగీతపు నాయకుడు ఒప్పుకొన్నట్లు అతడి కంఠంలో ఆశించదగ్గది ఏదో కొంత ఉంది. ఏమైనా, ఎప్పటిలాగేనే అతనికి ఈ అనుభవంవల్ల కొంత లాభం కనిపించింది. అది తరుచుగా పాడే 'బాఖ్‌కోరల్స్' మీద కొత్త అభిలాష కలగటం, మంచి సంగీతాన్ని ప్రశంసించగల శక్తి పెరగటం, మంచి సంగీతమంటే అభిరుచి ఏర్పడటం.

స్కాచ్ వారైనప్పటికీ అతని తల్లిదండ్రులు ఆలోచనారీతిలో ఉదారత ఉన్నవాళ్ళని చలికాలంలో ఒక శనివారంనాడు అలిఘునీనది గట్టిగానురుపుగా గడ్డకట్టినపుడు నిరూపితమైంది. ఆదివారంనాడు ఆటపాటలంటే స్కాచ్ వారు ఎంతపట్టుదల వహిస్తారో జ్ఞప్తివుండి కూడా స్కేటింగ్ అంటే అతిప్రీతిగల ఆండీ ఆనాటి సాయంత్రం కొంత అనుమానిస్తూనే తల్లిదండ్రులతో "రేపటి ఉదయం చర్చికి వెళ్ళబోయేముందు కొద్దిసేపు నేను స్కేటింగ్ చేయవచ్చునా" అన్నాడు.

విశాల హృదయంగల తల్లి అన్నది. "నీ కెంతసేపు ఇష్టమైతే అంతసేపు స్కేట్ చేయవచ్చు."

"అంతసేపు నేను ఒప్పుకోను" అని ఆమె అభిప్రాయానికి తండ్రి ఒకసవరణ చేశాడు. తండ్రి "ఆండ్రీ! ఉదయం కొంతసేపు స్కేటింగు చెయ్యటంలో నాకేమీ అభ్యంతరం లేదు. కాని, నీవు నాతో కలిసి చర్చికి పోవటానికి సకాలంలో ఇంటికి తిరిగి వచ్చేయాలి.

అందువల్ల ఆండీ పెందలకడనే లేచాడు. గడ్డకట్టిన నదిమీద కొన్ని గొప్ప మహిమగల గంటలను గడిపాడు.

# నిశ్రేణికా రోహణం

## 4

వార్తాహారి బాలుడుగా ఆండ్రీ వుద్యోగం సంవత్సరం మీద మరికొద్దికాలం గడిచింది. మొదటినుంచి అతడు తంతి సాధనాలంటే విశేషమైన ఆసక్తిని చూపిస్తుండేవాడు. అవకాశం దొరికినప్పుడల్లా ఆపరేటర్లు వార్తలను ఎలా పంపిస్తారో చూస్తూ, ఎలా స్వీకరిస్తారో వింటూ వుండేవాడు. ఉదయం కార్యాలయాన్ని చిమ్మి పరిశుభ్రంచేయటానికి వచ్చిన సమయాలల్లో అతడు మోర్స్ అక్షరమాలను నేర్చుకున్నాడు. చుక్కలకుగాను, వేగంగాను, తీక్షణంగాను నొక్కటము, డాష్‌లకోసం దీర్ఘమైన కటక్కుమనే ధ్వనులు చేయుటము సాధనచేశాడు. కార్యాలయంలోని ముచ్చట్లవల్ల అతడు పదకొండు పంతొమ్మిది సంవత్సరాల మధ్యవయస్సు కుర్రవాళ్ళే ఇతరచోట్ల వార్తలను పంపించటం, పుచ్చుకోటం చేస్తుంటారని గ్రహించి ప్రక్కస్టేషన్లను పిలవటానికికూడా సాహసించాడు. అక్కడ వుండే పిల్లలతో తాను నేర్చుకుం

టున్న వాడినని చెప్పి వాళ్ళకు కొన్నిమాటలను అందించి, వాళ్ళజవాబు మాటలను అందుకుంటుండేవాడు. ఒకరోజు ఉదయం అతడు ఒంటరిగా వున్నప్పుడు పిట్స్‌బర్గుకు ఒక వార్తను అందుకుంటూరా అని తీవ్రంగా అడగటం జరిగింది. అలా అడగటం ఫిలడల్ఫియానుంచి.

"మరణాన్ని తెలియజేసే అతి జరూరైన వార్తను మీరు అందుకుంటారా ?" అని ఫిలడల్ఫియానుంచిఅడిగింది.

"అందుకుంటాము" అని ఆండీ సమాధానం చెప్పాడు.

వార్తలను అందుకునే సాధనాలు ఆ రోజుల్లో చుక్కలను, డాషులను చిన్న కాగితపు ముక్కలమీద ముద్రిస్తుండేవి ఆండీ ఆ వార్తకు మేలుపతి వ్రాసుకొని అందిచటం కోసం పరుగెత్తాడు. తాను చేసిన సాహసాన్ని గురించి మిస్టర్ బ్రూక్స్ ఏమని భావిస్తాడో అని అతడు కొంత ఆందోళన చెందాడు. "అది చాలా జరూరయినది కావటంవల్ల తాను అందుకున్నా" నని క్షమాపణ చెప్పుకున్నాడు.

"మంచిపని చేశావు. ఇక్కడ నీవు ఒంటరిగా వుంటున్నప్పుడు అలా చెయ్యవచ్చు" అని మిస్టర్ బ్రూక్స్ ఆర్ద్రంగా అన్నాడు. అయితే, కడు జాగ్రత్తగా వుండాలి. తప్పులు రావటానికి వీల్లేదు సుమా !" అని హెచ్చరించాడు.

ఈ సంఘటన జరిగిన కొద్దికాలంనుంచి ఆపరేటర్లు మాధ్యాహ్న భోజనానికి బయటికి వెళ్ళినప్పుడు ఆండేను ఒంటరిగా కార్యాలయంలో వుంచి పోతుండేవాళ్లు. అతడు బల్ల

దగ్గరవుండి వార్తలను పుచ్చుకోవటమే కాకుండా పంపిస్తుండే వాడుకూడా. ఇప్పుడు అతని జీతం పెరిగి వారానికి నాలుగు డాలర్లు అయింది. టేపుమీద ఉబ్బెత్తుగా ముద్రింపబడే చుక్కలను, డాషులను చూడకుండానే యంత్రాలుచేసే ధ్వనులనుబట్టి వస్తున్నవార్తలను తెలుసుకోవచ్చునని అతడు త్వరలోనే గమనించాడు. కేవలం చెవితో వినటంతోనే వార్తలను గ్రహించి కెంటకీలో ఆపరేటరుగా పనిచేస్తున్న ఒకకుర్రవాడు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాడని చెప్పుకొంటున్నవార్తలు నిజమని చులకనగా విశ్వసించాడు.

హ్యాన్ అనే వృద్ధుడు టేపునుంచి వార్తలనుచదివి, వ్రాసి యిస్తూ కార్యాలయంలో వ్రాయసగాడుగా పనిచేస్తున్నాడు. అతడు ఆండీ వార్తలను పంపిస్తు అందుకొంటూ వున్నప్పుడు గుణవటం ప్రారంభించాడు. ఒక బాల వార్తాహారికి అందిచే వార్తలను తనను ప్రతి వ్రాయమంటున్నందుకు అతడు తన అసంతృప్తిని వెల్లడిస్తున్నాడు. అందువల్ల ఆండీ అతనికి తెలియచెప్పటంకోసం వార్తలు వస్తున్నపుడు టేపుచుట్టును ఆపివేసి కేవలం అవి చేస్తున్న ధ్వనులను వినటం మూలంగానే వాటిని అందుకోటం ప్రారంభించాడు.

హ్యాన్ కు నింద వచ్చింది. "నీ విలా చేయటానికి వీల్లేదు" అని అతడు అడ్డుపెట్టాడు. "యిది పద్ధతి కా" దన్నాడు.

"జట్టాం [illegible] పనిచేస్తున్న"

దని ఒకవంక వార్తనువింటూ, మరొకవంకదాన్ని వ్రాస్తూ ఆండీఎదుకు చెప్పాడు.

"ఇలా అయితే గందరగోళం జరుగుతుంది." అని ఆ వృద్ధుడు గట్టిపట్టుపట్టాడు. "ఇందుకు నీవు అనుభవించవలసి వస్తుంది"

అయితే, అత డన్నదానికి బదులుగా ఆండీ చేసిన అద్భుతచర్య అతనికి వుద్యోగంలో ప్రమోషన్ తెచ్చి పెట్టింది. కార్యాలయ వ్యాపారం వేగంగా వృద్ధిపొందుతు న్నది. మరొక ఆపరేటరు కావలసివచ్చాడు. ఆండీ ఆ వుద్యోగాన్ని సంపాదించుకున్నాడు. జీతం నెలకు ఇరవైఅయిదు డాలర్లు.

తరువాత కొద్దికాలానికే మిష్టర్ బ్రూక్స్ ఆండీని బల్లదగ్గరికి పిలిచి అన్నాడు: "గ్రీన్స్‌బర్గు ఎక్కడుందో నీకు తెలుసా?"

"తెలుసు. ఇక్కడికి తూర్పున వుంది"- అన్నాడు గౌరవపూర్వకంగా.

"అక్కడి ఆపరేటరు మిష్టర్ పైలర్ రెండువారాలు సెలవు తీసుకోదలచాడు! అతనికి బదులుగా అక్కడ ఒక మనిషికావాలి. నీవు ఆపని చేయగలవా?"

"చేయగలను" అన్నాడు ఏమాత్రం అనుమానించ కుండా.

"మంచిది. నిన్ను అక్కడికి పరీక్షక్రింద పంపిస్తున్నాము.

ఆండీ ఈ వార్తను తీసుకువచ్చినప్పుడు ఇంట్లో ఆనందోద్వేగం అతిశయించింది. తల్లి వెంటనే అతని దుస్తుల విషయం ఆలోచించింది. తల్లి "అతనికి క్రొత్తవద్దుకావా" లన్నది, తండ్రి ఈ సంఘటనకు నిర్విణ్ణరపోయాడు.

"బాధ్యత ఎంతో తెలిసిందా !" అన్నాడు కేక పెట్టి నట్లు. "నవంబరు వస్తేగాని అతడికి పదిహేడేళ్ళు రావు. ఆండీ ! ఈ పనిని నిర్వహించగల శక్తి నీ కున్నట్లు భావిస్తున్నావా?"

"అవును. నిర్వహింపగలననే భావిస్తున్నాను!" అని ఆత్మవిశ్వాసపూర్వకమైన సమాధానం వచ్చింది.

"నీవు యోగ్యుడవనిపించుకొనటానికి ఇది తగిన గౌరవమని నా నమ్మకం!" అన్నాడు తండ్రి.

స్టేజికోచ్ మీద ముప్ఫదిమైళ్లు ప్రయాణం చెయ్యటమనేది ఎప్పుడోగాని తటస్థపడని పండుగ. ప్రధానంగా ఫిలడెల్ఫియానుంచి పిట్స్‌బర్గువరకూ తన రైలుమార్గాన్ని విస్తృతం చేస్తున్న రైలురోడ్డు వారికోసం దారిపొడుగునా లోతుగా గుంటలు తీసి కట్టలు పోసేందుకు మూగుతున్న నిరంతర శ్రామిక జనదర్శన నయనోత్సవం అతనికి కలిగింది. అనతికాలంలోనే ఆ సాహసిక చర్యతో తనకు సంబంధం కలగబోతున్న దన్న సంగతిని చిన్ని ఆండీ అణుమాత్రమైనా కల గనలేదు

ఆండీ తొలిసారిగా ఒక పబ్లిజా భోజనశాలలో భుజించింది గీన్స్‌బర్గ్ హోటల్లోనే. అతడు అక్కడి భోజనం

బాగున్న దనుకున్నాడు నిగనిగలాడే మోముతో, ఎర్రవారే బుగ్గలతో, పీచువలె రేగిన జుట్టుతో లోపలికి ప్రవేశించి తనకు బదులుగా వచ్చాననని చెప్పినప్పుడు ఆపరేటరయిన రైలర్ తన అబ్బురపాటును దాచుకో లేకపోయాడు. కానీ అతడూ యువకుడయిన కార్నెగీతో కలిసి కొన్ని వార్తలను ప్రసారం చేసినప్పుడు అతని శక్తినిగురించి తెలుసుకొన్నాడు. ఒక్క పిలుపునుకూడా విడిచిపెట్టకుండా అందుకోటంకోసం సాయంకాలం పొద్దుపోయేదాకా కార్యాలయంలో వుండి ఎంతో పనిచేద్దామని అతడు ఆదుర్దాగా వున్నాడు. ఒక తుఫాను రోజున సాయంత్రం తన తంత్రి యంత్రంముందు కూర్చున్నప్పుడు-ఏదో పుస్తకం చదువుతూ, మెరిసిన సమయంలో అతడు 'కీ'ని ముట్టుకోటానికి సాహసించాడు. ఏదో పెద్దభూతం పెనుగదతో తన్ను మోదినట్లు తోచింది అతడు, అతడు కూర్చున్న బల్లా నేలమీద పడిపోవటం జరిగింది. నరాలు ఝల్లుమన్నవి. అప్పటినుంచీ ఈ ఉలికిపాటు వల్ల పాఠంనేర్చుకొనడంచేత తుఫానువేళల్లో అతడు ఎంతో జాగరూకుడయి మెలగుతుండేవాడు.

గ్రీన్స్‌బర్గులో ఆండీ ప్రసిద్ధుడైనాడు. ఇతడు కేవలం చెవులతోటే వార్తలను గ్రహించే ప్రజ్ఞగలవాడని విని జనం అతణ్ని చూడటంకోసం కార్యాలయానికి వస్తుండేవారు. అతడు తాత్కాలికంగా తనకు ఒప్పచెప్పిన పనులను ఎంతో సమగ్రంగా నిర్వహించాడు. పిట్స్‌బర్గుకు తిరిగివచ్చిన తరువాత ఈష్టరన్ టెలిగ్రాఫిక్ కంపెనీ మేనేజరు చేసిన పనిని మెచ్చుకొంటున్నందుకు చిహ్నంగా అందమైన బైండుగల బరన్స్

కవి కావ్యసంపుటాన్ని అతనికి బహూకరించాడు. మరొకటి ఏదయినా అతనికి ఎక్కువ సంతోషాన్ని కలిగించేది కాదు.

ప్రాచ్యవైదేశిక వార్తలను తీసుకురావటం కోసం పిట్స్‌బర్గులోని వార్తాపత్రికలు విడివిడిగా తమ విలేఖరులను తంతి వార్తాకార్యాలయానికి పంపిస్తుండేవి. ఇప్పుడు అవి అన్నీ కలిసి ఏకంగా ఒక విలేఖరుని మాత్రమే పంపటానికి నిర్ణయించుకొన్నవి. ఆ విలేఖరుని సూచన మీద ఆండ్రీ వార్తలను అయిదు ప్రతులను తయారుచేసి ఇస్తుండేవాడు. ఈ పని చేసినందుకు అతనికి వారానికి కొకడాలరు వస్తుండేది. అంతా చేరి ఇప్పుడు అతనికి నెలఒకటికి దాదాపుగా ముప్పది డాలర్ల రాబడి అయింది.

కార్నెగీ కుటుంబం అద్దె యివ్వటం మానివేసి స్వంత యిల్లు కొనుక్కొనేందుకు తగ్గ ఆర్థికస్తోమతు తమకు లభించినట్లు భావిస్తున్నది. రెండు సంవత్సరాల్లో తీర్చేటట్లు అంకుల్ ఆండ్రీ హోగన్ కాటేజి, రెబెకాల పీఠలో వారి నివేశన స్థలం వాళ్ళు 5 0 డాలర్లకు కొనుక్కున్నారు.

వసంత సమయంలో ఓహైయోనది గాంగ స్టూయిబెన్‌విల్లీ వీలింగుల మధ్య తూర్పుకు మధ్య పశ్చిమానికి మధ్య వార్తా తంతులను తెగ్గొంది వేసి, ఇరవైమైళ్ళ పొడుగు తంతి తీగను దూరంగా కొట్టిపారేసిన నాటికి ఆండ్రీ వయస్సు పది హేడున్నర సంవత్సరాలు. తీగలను తిరిగి ముడివేసేటంత వరకూ స్టేషన్లమధ్య సంబంధాన్ని నిలవబెట్టటం కోసం ఆండ్రీని స్టూయిబెన్ విల్లీకి పంపించారు. తూర్పునుంచి వార్త

అనుగ్రహించి ఒక గంటో లేక మరికొంతసేపో ఆలస్యంతో చిన్న పడవలమీద అతడు హీలింగ్‌కు పంపించేవాడు. తిరిగి వస్తూ పడవలు కొలంబస్, సిన్సినాటి, టాయివిల్లీ నుంచీ సెయింట్ టాయీ ఇంకా ఇతరప్రదేశాలనుంచీ కొల్లకొల్లలుగా వార్తలను తీసుకొవచ్చాయి. వార్తాప్రసరణ ఒకవారానికి మించి నిలిచిపోని రీతిగా ఆండ్రీ ఈ వార్తల నన్నింటినీ ప్రసారం చేశాడు.

అతడు అక్కడ వున్న సమయంలోనే సిన్సినాటి, హ్వీలింగులలో అమ్ముదామనే ఉద్దేశంతో కొన్ని బల్లగుడ్డలను తీసుకొని నదిమీదుగా తాను వస్తున్నట్లు తండ్రిదగ్గిర నుంచి ఆండీకి ఒక ఉత్తరం వచ్చింది. ఆండీ పడవవచ్చే సమయానికి రేవుదగ్గిరికి వచ్చాడు. తండ్రికోసం కొద్దిసేపు వెతుక్కొని, కనిపించిన తరువాత వొడ్డుకు రమ్మని సైగచేశాడు. విలియం కింద డెక్కుమీద సామానులను ఎక్కించే వొక మూలకు దారితీశాడు.

"దొంగభయంవల్ల మూటలదగ్గిర నుంచీ ఎక్కువ దూరం వెళ్ళటం నాకిష్టం లే"దని అతడు అందుకు కారణం చెప్పాడు.

"నీ కొక గది అంటూ లేదా"అని కొడుకు జంకుతూ అడిగాడు.

"లేదు ఖర్చు తగ్గించవలెనని ఉద్దేశించాను. అందువల్ల నేను డెక్కుమీదనే ప్రయాణం చేస్తున్నా" నన్నాడు.

ఆ మాటలు వినటంతోటే "అలాగా నాన్నా !" అంటున్నప్పుడు ఆండీ గొంతుక గాద్గద్యం వహించింది.

"అదేమీ చెడ్డపనికాదు" అని తండ్రి అతని అభిప్రాయాన్ని సమర్థించాడు "ఇమకో నాకు నా దుప్పటి వుంది. చాలా బాగా నిద్ర పోగలను అమ్మకం అంత చులకనగా లేదు బాబూ, అందువల్ల నేను జాగ్రత్తగా మెలగాలి."

"కాని నాన్నా ! నీవు అమ్మ స్వంత బండిలో ప్రయాణం చెయ్యటానికి యింకా ఎంతో కాలం వేచిఉండవలసిన అవసరం లేదు" అన్నాడు ఆండీ ఉత్సాహంతో.

తండ్రి నిశ్శబ్దంగా ఆతనిచేయి పట్టుకున్నాడు. ఆయన కళ్లు చెమ్మగిల్లాయి. తరువాత ఒక పావుగంటలో పడువ బయలుదేర బోతున్నప్పుడు విలియం కుర్రవాడి చేతిని ఉల్లాసంతో నొక్కి అన్నాడు: "ఆండీ ! నిన్ను చూచుకొని నేను గర్విస్తున్నాను."

ఈ సమయంలో థామస్ ఎ. స్కాట్ అన్న వొక విశిష్టవ్యక్తి పెన్సిల్వేనియా రైలు రోడ్డువారి పిట్స్‌బర్గు డివిజనుకు సూపరింటెండెంటుగా వున్నాడు. అల్టూనాలో ఉన్న తన పై వాడయిన లోంబయర్టుతో తంతిద్వారా వుత్తర ప్రత్యుత్తరాలు చేయటానికి అతడప్పుడప్పుడూ తంతి కార్యాలయానికి వస్తుండేవాడు యిలా వస్తున్న సందర్భాలల్లో యువకుడయిన ఆపరేటరుమీద దృష్టి నిలిపి అతనితో మాట్లాడటం కోసం కొంతసేపు ఆగుతుండేవాడు.

ఒక తంతివార్తను తీసుకొని మిస్టర్ స్కాట్ అసిస్టెంట్లలో ఒకడు ఆండ్రీ కార్యాలయానికి వచ్చాడు "మిస్టర్ స్కాట్ ఈనాటి ఉదయం నిన్ను గురించి మాట్లాడాడు."

"అలాగా ! ఏమన్నాడు ?" అని ఆండీ వెంటనే సర్దుకున్నాడు.

"తనకు నిన్ను గుమాస్తాగాను, ఆపరేటర్‌గాను తీసుకురాగలవా ?" అని నన్నడిగాడు. రోడ్డువారు స్వంత తంతి కార్యాలయాన్ని పెట్టబోతున్నారు, నీకు తెలుసా ? అది చాలా అసాధ్యమైన పని నీవు ప్రస్తుతోద్యోగంలో చాలా సంతృప్తిగా వున్నావని నేనుఅతనితో చెప్పాను"

"ఆగు ! అంత త్వరపడకు" అని చేయి మెత్తి ఆండీ అతణ్ణి ఆపాడు.

"ఆయనకు కావాలంటే నన్ను పెట్టుకోవచ్చు. వెళ్ళి ఇలాగని చెప్పు"

దీని పరిణామంగా ఫిబ్రవరి 1 - 1858 న ఆండీ నెల ఒకటికి ముప్పదైదు డాలర్ల జీతంతో స్కాట్ దగ్గిర పని చేయటానికి కుదిరాడు అతడికి కొంత భయపడేటంత వేగముగా ప్రమోషన్లు వచ్చాయి.

అతని తల్లి ఇప్పుడు చెప్పులు కుట్టటం మానేసింది. త్వరలోనే అతడు డేవిడ్ మెకార్గో, రాబర్టు పిట్కైరన్లకు రైల్ రోడ్ సంస్థలో ఉద్యోగాలిప్పించగలిగాడు. ఆల్టూనాలోని జనరల్ సూపరింటెండెంట్ అయిన లోంబర్ట్‌కు అతడు అసిస్టెంటు కాగలిగాడు. అప్పుడు ఆల్టూనా ఒక చిన్న గ్రామం. అయినా పెన్సిల్వేనియా రైలు మార్గాలకు అది కూడలి.

పిట్స్‌బర్గు జీతాల పట్టిక ననుసరించి జరిగే బట్వాడా కోసం డబ్బు తీసుకురావటానికని ఆండీ ఆల్టూనాకు వెళ్ళే

వాడు. రెండోమారు వెళ్ళినప్పుడు కఠినుడు, మితభాషి అయిన జనరల్ సూపరింటెండెంటు మిస్టర్ లోంబయర్డు అతణ్ని తేనీటి విందుకు ఇంటికి పిలిచి ఆశ్చర్యాన్ని కల్గించాడు. మిస్టర్ లోంబయర్డు వచ్చిన అతిథిని ద్వారం దగ్గరనే మిసెస్ లోంబయర్డుకు "ఇతడే మిస్టర్ స్కాట్స్ ఆండీ" అని పరిచయం చేశాడు అతడు కార్యాలయంలో కనిపించేటంతటి శీతలంగా ఇంటిదగ్గర కనిపించలేదు తన్ను గురించి చేసే పై రీతి పరిచయాన్ని విన్న తరువాత అందరూ తన్ను అలా చెప్పుకొంటుంటే తృప్తి పొందేటట్లు ఆండీకి స్కాట్ మీద గౌరవం కలిగింది ఒకనాడు రైల్‌రోడ్ అధ్యక్షుడు ఎడ్గర్ థామ్సన్ యువకుడయిన అసిస్టెంటు గదిలోకి తల దూర్చి చూచి "స్కాట్స్ ఆండీవి నీవేనా?" అని ప్రశ్నించాడు. ఇది అతనికి సర్వసాధారణమైన పేరైపోయింది.

ఒకరోజున ఆండీ కార్యాలయానికి వెళ్ళేటప్పటికి తూర్పు డివిజన్‌లో ఒక ప్రమాదం సంభవించటం వల్ల పశ్చిమానికి వెళ్ళవలసిన ఎక్స్‌ప్రెస్ ఆలస్యమైందనీ, తూర్పుకు వెళ్ళే పాసింజర్లు వంక వంక దగ్గిరా ఒక ఫ్లాగ్ మానును ముందు పంపిస్తూ నెమ్మదిగా ప్రాకుతున్నట్లు నడుస్తున్నాయనీ, రెండువైపులకు వెళ్ళవలసిన సామాను బండ్లు సైడ్ పట్టాల మీద నిలిచిపోయినవని తెలుసుకున్నాడు. ఒకేదారి వున్న రైలు మార్గాల పద్ధతిలో బండ్లు నడపటం ఇంకా మొరటో అనాగరిక స్థితిలో వుంది.

మిస్టర్ స్కాట్ ఎక్కడ వుందీ ఎవరికీ తెలియదు బహుశః అతణ్ని ఏదో పనిమీద పిలిచి వుంటారు... సర్వద్ర

పరిస్థితికి ఆండీ కళవళ పడుతున్నాడు ఎంతో పనిచేసి చాలా అలిసిపోయిన చోదకులకు విశ్రాంతి నిచ్చి పరిస్థితిని కొంత చక్క దిద్దాలనే కుతూహలాన్ని అతడు ఆపుకోలేకపోయినాడు ఇటువంటి ఆత్యాయిక పరిస్థితులను పూర్వం ఇతడు మిష్టర్ స్కాట్ సూచనతో అతడు సరిదిద్దాడు. అందువల్ల అతడు తన బాధ్యతమీదనే బండ్లను నడిపించటం, అవి కలుసుకునే ప్రదేశాలను నిర్ణయించటం జరిగించాడు చివరికి పై అధికారి వచ్చేటప్పటికల్లా సర్వం సుగమంగా సాగిపోతున్నది.

ఆండీ బల్లదగ్గరికి అతివేగంగా చొచ్చుకోవచ్చి మంచిది. పరిస్థితులు ఎలా వున్న"వన్నాడు.

"మిష్టర్ స్కాట్, నాకు మీరు ఎక్కడా కనిపించలేదు మీ పేరుమీదనే ఉదయం ఆర్డర్లు నిచ్చాను" అని సమాధానం చెబుతున్నప్పుడు ఆండీకి గొంతు బాగా పెకిలి రాలేదు.

అతడు ఇచ్చిన ఆర్డర్ల కాపీ లన్నింటినీ చూపించాడు లైనుమీద వున్న బండ్లన్నీ- సామాను బండ్లు, పాసింజరు బండ్లు- ప్రస్తుతం ఏ స్థితిలో ఎక్కడెక్కడ వున్నదీ తెలియ జెప్పాడు చెప్పటం ముగించగానే సూపరింటెండెంటుఆశ్చర్య పడుతూ ఆండీ ముఖంలోకి చూశాడు. బాలుడు సాహసించి చేసిన పనిని తానెలా స్వీకరించాడో తెలియజేయకుండానే అతణ్ని ఇంకా అనుమానపడే స్థితిలోనే వుంచి తన గదిలోకి వెళ్ళిపోయాడు. మరుసటి రోజు ఫ్రయిట్ ఏజంటు మిష్టర్ ఫ్రాన్సిస్ వచ్చినప్పుడు ఆతనితో నవ్వుతూ "నా చిన్న తెల్ల జుత్తు స్కాచ్ భూతం ఏంచేశాడో నీకు తెలిసిందా?" అని

మిష్టర్ స్కాట్ అడిగినట్లు విన్నాంతవరకూ అతడి నరాల బిగువు సడలలేదు.

సూచనగానైనా అధికారాన్ని పొందకుండానే నా పేరు మీద డివిషన్‌లోని బండ్లను నడిపించి వుండకపోతే నేను దెబ్బతినేవాణ్ని.

"మరి అతడు సక్రమంగా చేశాడా ?"

"అవును- చేశాడు." అది అలా ముగిసింది.

తరువాత మిష్టర్ స్కాట్ ఆండీకి మరింత బాధ్యతను ఒప్పజెబుతుండేవాడు. ఒకప్పుడు అతడు పది రోజుల కార్యాలయానికి రాలేదు. అప్పుడు మిష్టర్ లోంబయర్డు అంగీకారంతో అతడు డివిజన్‌కు సంబంధించిన మొత్తం బాధ్యతను యువకుడయిన తన గుమాస్తామీద పెట్టి వెళ్లాడు. ఇరవైయేళ్ళ వయసులో వున్న యువకుడిమీద ఇంత బాధ్యతను వుంచటం ఎంతో విశిష్టమైన విషయం అతడు ఈ బాధ్యతను వహిస్తున్న సమయంలో నిర్మాణానికి సంబంధించిన ఒక బండి బద్దలైంది. ఎవరి అజాగరూకత వల్ల అది జరిగిందో వారి విషయంలో ఆండీ అతి తీక్షణంగా వ్యవహరించాడు ముఖ్య దోషిని ఉద్యోగంలోనుంచి పంపించివేశాడు. మరి ఇద్దరిని సస్పెండు చేశాడు. మిస్టర్ స్కాట్ తిరిగివచ్చిన తరువాత అతనివల్ల తాను వాళ్ళ విషయంలో అతి కఠినంగా ప్రవర్తించినట్లు తెలుసుకొన్నాడు. అందుకు అతడు ఎంతో చింతించాడు. తాను తీవ్రంగా శిక్షించిన వారికి యేదో తగ్గ ప్రతిచర్య చేయుటానికి యత్నించాడు.

1855 శరత్తులో తాము గొన్న ఇంటికి డబ్బు

పూర్తిగా చెల్లించక పూర్వమే విలియం కార్నెగీ కొద్దిగా జబ్బుచేసి తన ఏభై యేయేట మరణించాడు. "తగిన విశ్రాంతినీ, సౌఖ్యాన్నీ మేము ఇవ్వగల శక్తిని సంపాదిస్తున్న సమయంలో ఆయన మృతినొందా"డన్నాడు ఆండీ. సాధుశీలుడు, నిరాడంబరుడు అయిన తండ్రి మరణించినందుకు కుటుంబమంతా చింతలో మునిగింది. పెద్దకుమారుడు ఎప్పుడూ అతణ్ణిగురించి అత్యుదాత్తుడు, ప్రేమార్హుడు అయిన అటువంటి వ్యక్తిని తాను మరొకణ్ణి ఎరగనంటుండేవాడు

తండ్రి వ్యాధి, మృతి ఆండ్రూమీద, అతని తల్లిమీద మోయలేనంత ఆర్థిక భారాన్ని పడవేసినవి. తల్లి తిరిగి పాదరక్షలను కుట్టటం ప్రారంభించింది. ఈ పరిస్థితిలోనే ఒకనాడు మిస్టర్ స్కాట్ "ఆండీ! నీదగ్గిర అయిదు వందల డాలర్లున్నాయా" అని ప్రశ్నించాడు

ఆండీ జీతం ఇప్పుడు నెలకు ముప్ఫై డాలర్లకు పెంచబడింది. కానీ జీతాలు బట్వాడా చేస్తుండేవాడు గనుక అతని కంటికి ప్రపంచంలో అత్యుత్తమ లలిత కళాఖండాలుగా కనిపించే రెండు పక్షిజంటలున్న బంగారు నాణాల రూపంలో అతడు దాన్ని పుచ్చుకునేవాడు. అయితే అనుకోకుండా వచ్చిపడే యిబ్బందులవల్ల వాటిని వెంటనే కరిగిస్తుండేవాడు. పై అధికారి ప్రశ్నించినప్పుడు అతనిదగ్గిర అయిదు వందలసెంట్లుకూడా లేవు.

అతను సమాధానం చెప్పేలోగానే, తన యువకు [illegible]

కుండానే, ఒక్కమాటు రెప్పలల్లార్చి మిస్టర్ స్కాట్ ఎందుకయినా మంచిదని ఇలా అన్నాడు. "ఎందుకంటే, అది వుంటే నీకోసం ఒక పెట్టుబడి నిలిచివుంది-ఆ షమ్స్ ఎక్స్‌ప్రెస్ కంపెనీలోని పదిషేర్లు. ఈనాడు విపణిలో ఉన్న వాటిలోకల్లా ఇవి ఉత్తమమయినవి. బహుశః గిల్ట్‌ఎడ్జిడ్ కూడా అయివుంటవి. ఇవి షేరు ఒకటికి ఒక డాలరు నెలకు డివిడెండుగా యిస్తున్నవి నాకు తెలిసిన వొక వ్యక్తికి వెంటనే డబ్బు కావలసివచ్చి ఈ స్టాకును అమ్మేస్తున్నాడు. నీవు మరి ఆ డబ్బు తీసుకురాగలవా!"

ఈ సమస్త జగత్తులో అయిదువందల డాలర్లు తనకెంతో లభ్యమౌతాయో కాని ఊహిస్తున్నప్పుడు ఆతని తలలో మోతకొట్టటం మొదలుపెట్టింది. నమ్మగల తనపై అధికారి ముఖ్యంగా ఈ సదవకాశాన్ని తానే కబళించకుండా తనకిప్పించటమనే త్యాగం చేస్తున్నాడు. ఇట్టి స్థితిలో ఈ అవకాశాన్ని పోగొట్టుకోకూడదు.

"ఎలాగో చేకూర్చుకోగల"నని సమాధానమిచ్చాడు

రెబెక్కా పేరలోని ఇంటికి అయిదువందలు చెల్లించటం జరిగింది. మొత్తమంతటికోసం దాన్ని తాకట్టుపెడితే సరిపోతుందని ఆండీ ఆశించాడు. సాహసించి ఆవిధంగా తాకట్టు పెట్టించుకొనే వ్యక్తి ఒక్కడే వున్నాడు. మిష్టర్ స్కాట్ నిర్ణయంమీద పరిపూర్ణమయిన విశ్వాసంగల ఆండీ తల్లి "నేను బజర్ విలియంను ఈ డబ్బిమ్మని అడుగుతా"నన్నది. నా పెళ్లి ఆపిరి-పడవలో ఓహాయో నదిమీద తరువాత ప్రయాణంచేసి ఆమె చూస్తు అపర్ పూల్ చేరు

కున్నది. ఇక్కడ విలియం మారిసన్ కొంత ఆర్జించుకున్న వ్యక్తి. జస్టిస్ ఆఫ్ పీస్. పరిసరాలల్లోని రైతులకు ఇన్వెస్ట్మెంటు బ్రోకరు ఇంటిమీద రెండో తాకట్టు పెట్టించుకొని డబ్బు ఇచ్చాడు. అతని సోదరి పిట్స్‌బర్గుకు విజయంతో తిరిగి వచ్చింది.

ఆండీ మిస్టర్ స్కాట్‌కు డబ్బు ఇచ్చేటప్పటికి చాలా రోజులు గడిచాయి. అందువల్ల "ఆవ్యక్తి, రైనాల్డ్సు స్టాకుకు ధరపెంచాడు. అతనికి ఇప్పుడు ఆరువందలు కావాలిట" అన్న ఊహించని మాటలను డబ్బు నిచ్చేటప్పుడు అతడు వినవలసి వచ్చింది.

ఆండ్రూ క్షణకాలం నిశ్చేష్టుడయినాడు. అయితే మిస్టర్ స్కాట్ "మిగిలిన వంద నీకోసం తాత్కాలికంగా నేను చూస్తాను. నీవు వీలయినప్పుడు వీలయినట్లుగా ఇవ్వ వచ్చు" అన్నాడు.

కొన్నిరోజులు గడిచాయి. ఒకనాటి ఉదయం, మూలన ఆడమ్స్ ఎక్స్ప్రెస్ ముద్ర వున్న బరువయిన తెల్లని కాగితపు కవరు బల్లమీద వుంది. విసరినట్లుగా దానిమీద "ఆండ్రూ కార్నెగీ ఎస్క్వైర్" అన్న చిరునామా కనిపించింది. దాని లోపల పదిడాలర్లకు గోల్డ్ ఎక్చేంజి బ్యాంక్ ఆఫ్ న్యూయార్క్‌మీద ఇచ్చిన చెక్కు వకటుంది. ఇది అతని మొదటినెల డివిడెండు. ఆ చెక్కుమీద పెద్దదిగా విస్ఫూర్తితో కనిపించిన కాషియర్ జె. సి. బాబ్‌కాక్ సంతకాన్ని తాను శ్రమించకుండా, స్వహస్తాలతో, చెమ

టోడ్చకుండా పెట్టిన పెట్టుబడు మీద తొలి ఆదాయాన్ని పొంది నప్పటి ఆనందాస్పందనాన్ని జీవితాంతం వరకూ అతడు ఎన్నడూ మరచి పోలేదు. తనలో తాను 'యురేకా! [గొప్పది కనిపెట్టాను.] ఇది బంగారు గ్రుడ్లను పెట్టేబాతు' అని నెమ్మదిగా అనుకున్నాడు.

చెక్కును మార్చకుండా వారం చివరదాకా వుంచి తన ప్రియమిత్రులైన టామ్ మిల్లర్, జాన్ ఫిప్స్, జిమ్మీ విల్సన్, విల్లీ కౌల్స్‌లకు నలుగురికీ తమ వనవిహార సమయంలో చూపించాడు. వాళ్ళు "ఎస్క్వైర్" అని అతని పేరుకు చివర తగిల్చిన పదంమీద చతురక్రీడలాడారు. కానీ వాళ్ళకీ డివిడేండు చెక్కు ఎంతో నచ్చికను కలిగించింది.

"అభ్యుదయానికి ఇదే మార్గ" మన్నాడు ఫిప్స్.

"జాన్, ఇటువంటి అవకాశాలు వస్తాయోమో నేనూ కనిపెడుతుంటాను;" అని ఏకీభవించాడు జిమ్మీ!

"ఈపని మన మందరం చేద్దాం. ఒకరికొకరం చెప్పుకుంటుందాం." అంటూ వుత్సాహాన్ని ప్రదర్శించాడు టామ్ మిల్లర్.

"ఒక్కడికి మించిన పెట్టుబడిని గురించి వింటే వీలును బట్టి అందరం ఒకపై అందులో ప్రవేశిద్దాం మన్నాడు ఆండ్రూ.

"చాలా దొడ్డఅభిప్రాయం" అని ఒప్పుకున్నాడు టామ్ అందువల్ల వీలు కలిగినప్పుడల్లా తరువాత కొన్ని

సంవత్సరాల వరకూ వాళ్ళు అలా చేస్తూ వచ్చారు.

ఫిప్స్ పాదరక్షా కార్యాలయంలో అతడికోసం వచ్చిన వాళ్ళందరు తిరిగి వెళ్ళిపోయిన తరువాత సాయం సమయాల్లో ఈ 'పంచకం' వర్తమాన సమస్యలను గురించి నిత్యం ఉల్లాసకరమైన చర్చలు సాగిస్తుండే వాళ్ళు అండీ విశేషంగా శ్రామికజనతత్వాం కలవాడు. ప్రతిసమస్యను ప్రజల్లోకి తీసుకోపోవాలని వుల్లాసపడుతుంటాడు. ఒకప్పుడితడు గంటన్నరకు తక్కువగాని గంభీరోపన్యాసం చేశాడు. తరువాత మిల్లర్ న్యాయాధిపతులను 'జనవాక్యాన్ని' అనుసరించి నిర్దేశించాలని వాదించాడు. అయితే ఇది ఆచరణయోగ్యమైనది. కాదని అతడు తరువాత కాలంలో గుర్తించాడు. యింతలో ఒక వార్తావాహి ఊపిరిసలుపుకో లేకుండా వచ్చి "కార్నెగీ నిన్ను రమ్మంటున్నారు. డేర్రీదగ్గర ఒక 'విచ్ఛిత్తి' జరిగిందట" అని చెప్పకపోయి నట్లయితే అతడు ఇంకా ఆవిషయాన్ని గురించి ఎంతసేపు మాట్లాడి ఉండేవాడో చెప్పటం కష్టం-పిలుపును గురించి విన్నవెంటనే హాట్, కోటు అందుకొని "మీలో ఎవరైనా నేను ఎక్కడికి వెళ్లుతున్నానో మా యింట్లో తెలియజేయండి" అని చెప్పి పరుగు పెడుతూ అదృశ్యుడైనాడు.

అవసరం వచ్చినప్పుడు ఆ అయిదుగురు వెబ్స్టర్ సాహిత్య సంఘం సభ్యులుగా చేరారు. ఇది నగరంలోని ఈ జాతిక్లబ్ లన్నింటిలో శ్రేష్ఠమైంది. ఇందులోని సభ్యత్వానికి యోగ్యులుగా పరిగణింపబడినవారు ఎంతో గర్విస్తారు,

యువకుడుగా ఉన్నప్పుడు ఆంద్రూకు పత్రికా రచన మీాద ఎన్నో ఆశలుండేవి. ముఖ్యంగా సంపాదకుడుగా పని చేయటంమీాద అతని ప్రీతి. తరువాత కొద్ది సంవత్సరాలకు ఇతడు 'న్యూయార్క్ ట్రిబ్యూన్' పత్రికకు ఒక ప్రజాహిత విషయంమీాద లేఖ వ్రాశాడు. పెన్సిల్వేనియా రైల్‌రోడ్ విషయంలో నగరపౌరులు ఎంతటి అనాథేయ ప్రవర్తనను ప్రకటిస్తున్నారో విమర్శిస్తూ యిప్పుడితడు 'పిట్స్‌బర్గ్ డిస్పాచ్' పత్రికకి ఒక లేఖ వ్రాశాడు. ఈ వుత్తరం 'నామ రహితంగా' ప్రచురితమైంది. కాని, రైల్ రోడ్ కంపెనీకి ముఖ్య సంచాలకుడైన మిస్టర్ స్టోక్స్ లేఖకుని పేరు చెప్ప వలసిందని గట్టిగా కోరాడు. దీని ఫలితంగా రచయితను అతడు గ్రీన్స్‌బర్గ్‌లోని తన యింటికి వారాంతంలో సెలవు దినం గడపటానికి రమ్మని ఆహ్వానించాడు, మిస్టర్ స్టోక్స్ వంటి తేజోవంతుడు, విద్యావేత్తతో తృప్తికరంగానే నేం మాట్లాడగలను, వుల్లాసకరంగా ఏం చెయ్యగలనని సంశయి స్తూనే ఆహ్వానాన్ని అందుకున్నాడు ఆండ్రూ. కాని అతడు తాను సంశయించిన విషయంలో పొరబడ్డాడు.

ఇక్కడే అతడు తనకు పరిచితముగాని ఇంట్లో ఒకరికి తా నతిథియైన మొదటిరాత్రి గడిపాడు. స్టోక్స్ నివేశనాతిశ యంవల్ల అతడు ఎంతగానో ప్రభావితుడయినాడు. ముఖ్యంగా ఆ గృహంలోని గ్రంథాలయంలో వున్న ఒక పాలరాతి గూడు అతణ్ణి ఆకర్షించింది. ఆ అర్ధచంద్రాకృతిగల గూట్లో మధ్యన ఒక తెరచిన పుస్తకాకార ప్రతికృతి అమర్చబడి వుంది. దానిమీాద–

"ఎవడు హేతువాదం చెయ్యడో వాడు బుద్ధిహీనుడు
ఎవడు చేయటానికి ఇష్టపడడో వాడు దురభిమాని;
ఎవడు చేయటానికి సాహసించడో వాడు బానిస"

అన్న లేఖనం కనిపించింది. ఆండ్రూ ఆ అందమైన నిర్మాణాన్ని నివ్వెరపడి చూస్తుండగా సూటిగా చెప్పబడ్డ పై వాక్యాల ప్రభావంవల్ల అతని ఆత్మ సంచలించింది. అతడు లోగడ తను చెప్పుకున్నాడు. "ఎప్పుడో ఒకప్పుడు నా గ్రంథాలయాన్ని నేను ఏర్పాటుచేసుకొంటాను. అందులోని గూట్లో ఈ మాటలనే చెక్కిస్తాను." కొంతకాలం గడచిన తరువాత వాటిని న్యూయార్క్ స్కాట్లండులో కార్నెగీ గృహాలల్లో రెండు గూళ్ళల్లో చెక్కించటం జరిగింది.

అతడు ఇప్పుడు అధికారికంగా అతిథిగా ఆహ్వానింపబడుతున్నాడు అందువల్ల అత్యవసరమైన ఆనాటి క్రమమైన సాంఘికాచారాల గురించిన పాఠాలను ప్రత్యక్షంగా నేర్చుకుంటున్నాడు జనరల్ ఫ్రయిట్ మేనేజరు భార్య మిసెస్ ఫ్రాన్సిస్ అతని యెడ ఎంతో వాత్సల్యాన్ని ప్రదర్శిస్తుండేది. అతడు సిగ్గరి కావటంవల్ల ఆమెకు తమ యింట్లో భోజనము చెయ్యమని బలవంతం చేయటానికి బహుకాలము పట్టింది.

లాంబాయర్డు తరువాత 1856 లో మిస్టర్ స్కాట్ జనరల్ సూపరింటెండెంటు పదవిని స్వీకరించి తన కార్యాలయాన్ని ఆల్టూనాకు మారుస్తూ ఆండ్రూను తనవెంట తీసుకు

వెళ్ళాడు. అల్టూనాలో సుఖమైన ఒక కాటేజిని అద్దెకు తీసుకోగల పరిస్థితి ఏర్పడగానే మిసెస్ కార్నెగీ చెప్పులు కుట్టటాన్ని మళ్ళీ మానివేసింది. ఆండ్రూ ఆమెకు ఒక పరిచారిక అవసరమని నిర్ణయించాడు.

"నీవు జీవితమంతా చాలా శ్రమపడ్డావు. యిప్పుడు సుఖపడటం కొత్తగా ప్రారంభించాలి" అన్నాడు ఆండ్రూ తల్లితో.

ఇందువల్ల అతడు ఊహించనంతటి ప్రేలుడు ధ్వని వినిపించింది. ఆమె ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ అన్నది :

"ఏమిటి ! నా యింట్లో మరొక క్రొత్తమనిషి ప్రవేశించి అన్ని వ్యవహారాల్లో స్వేచ్ఛగా సంచరించటమా ! అందుకు నేను అంగీకరించను ఇన్నాళ్ళుగా నా పిల్లలకోసం నేనే ఇల్లు దిద్దుకున్నాను. మీకోసం వంట చేశాను. మీ దుస్తులను ఉతికి బాగు చేశాను. నీవు ఇప్పుడు నన్ను చేతులు ముడుచుకొని కూర్చోమంటున్నావు నీవు నన్ను షెల్ఫ్‌లో పెట్టదలిచావు. మరొక స్త్రీని నేను సహించలేను బాలురైన మీకు ఇష్టమైన ఆహారపదార్థాలను ఎలా వండాలో ఇతర స్త్రీ ఎవతెకూ తెలియదు-"

ప్రక్కవాటుగా వచ్చిన మాటను పుచ్చుకొని ఆండీ "అమ్మా ! నీవు నాకు, టామ్‌కు సమస్తం చేశావు. నీవే సమస్తమైనావు. మరి, మమ్మల్ని నీకోసం కొంత చేయనీ. మనం భాగస్వాములమై ఒకరి కొరకరం ఎవరికేది మంచిదో అది చేద్దాం. నీవు విందుల్లో యజమానురాలివై వ్యవహ

రించవలసిన సమయం వచ్చింది. కొద్ది దినాల్లో నీవు బండిలో సంచరించబోతున్నావు. ఈ మధ్యకాలంలో నీకు సహాయం చేస్తుంది. ఆ పిల్లని యింట్లోకి రానీ. ఇలా చెయ్యటం టామ్‌కు, నాకు ఎంతో ఇష్టం!

చాలా సేపు గొణిగినా చివరకు ఒప్పుకున్నది. సేవకురాలు వచ్చిన తరువాత ఆమె ఆల్బూనాలో లభ్యమయినంత ఉన్నత సంఘంలోకి వెళ్ళింది. ఆమె స్వయంగా విద్య నేర్చుకొన్నది. సుళువు బలువులను ఎరిగి వుండటంవల్ల సమత సంపాదించుకున్నది ఎటువంటి పరిస్థితులయినా చక్కదిద్దుకో గల సౌజన్యం ఆమెకున్నది. ఉద్యానకృషి, పుష్పాలతో ఆమె తన జీవితానికిచ్చిన నూతన దశను అనుభవించట మారంభించింది.

కొద్ది కాలం క్రితం భార్య చనిపోవటంవల్ల మిస్టర్ స్కాట్ తన గృహ పర్యవేక్షణకోసం తన మేనగోడలు మిస్ రెబెక్కా స్టీవార్డును తీసుకువచ్చాడు. ఆమె సొగసైన యువతి; ఆండ్రూకంటే వయసున కొన్నియేళ్ళు పెద్దది. అతడికి అవసరమయిన కొన్ని సాంఘిక ఆచారాలను గురించి చెప్పేది నెమ్మదిగా కొన్ని సలహాలిస్తూ ఆమె ఆండ్రూకు శ్రేష్ఠభగినీ పాత్రను వహిస్తున్నది. కొండలమధ్య యెంతో దూరం వాళ్లు వాహ్యాళికి వెళ్లుతుండేవాళ్లు. అప్పుడప్పుడు ఆమె ఆండ్రూను మధ్యాహ్నభోజనం కోసం ఇంటికి ఆహ్వానిస్తుండేది. అటువంటి ఒక సందర్భంలో రైల్‌రోడ్డు వ్యక్తిగా పైకి వస్తున్న టాయ్ మిల్లర్ కూడా అతిథి కావటం తటస్థిం

చింది. మిస్టర్ స్కాట్ ఊళ్ళో లేడు. వాళ్ళు భుజించటం కోసం బల్లముందు కూర్చున్న సమయంలో, రెబెక్కా స్త్రీవార్డు ఆమె సేవిక అయిన కన్య క్షణకాలం భోజన కక్ష్యలోనుంచి బయటికి వెళ్ళగానే, అప్పుడు తాను అనుభవిస్తున్న జీవితం లోని అద్భుతానికి యింకా అలవాటు పడని ఆంమూ్రి సగార వంగా అచటి నవనీత పాత్రను పైకెత్తి గొణిగినట్లుగా "ఇది నిజమయిన వెండి. టాయ్" అన్నాడు.



# దౌర్జన్యానికి ముందు

## 5

రైల్‌రోడ్ కంపెనీ మీదికి అభియోగ మొకటి తీసుకొరాబడింది. సమన్లు పంపించి యిందులో సాక్ష్యం చెప్పటంకోసం ఆండ్రూను పిలిపిస్తారని మిష్టర్ స్టోర్స్ అనుమానించాడు. అందుకు సిద్ధపడటం కోసం కొంత కాల వ్యవధి అతడు విచారణకు వాయిదా కోరాడు. అతని యువకుడైన అసిస్టెంటును కొంతకాలంపాటు రాష్ట్రం బయటికి ఎక్కడికైనా తరిమి వెయ్యమని మిష్టర్ స్టోర్స మేనేజర్ సాకెట్‌ను అర్థించాడు. ఈ కారణంగా ఆండ్రూ క్రిష్టలైను ఓహైయో పోలకు వెళ్ళి టామ్ మిల్లర్, జిమ్మీ విల్సన్లతో [వీళ్ళిద్దరూ అక్కడ రైల్ రోడ్‌లో పనిచేసేవాళ్ళు] చాలా రోజులు గడిపాడు. వారందరూ కొద్దికాలం క్రితమే గుర్రంమీది నుంచి పడటంవల్ల మరణించిన జాన్ ఫిప్స్ కోసం దుఃఖించారు. యిది ఆ యువకబృందానికి కలిగిన మొదటి విచ్ఛిత్తి. ఈ మహాఘోరమైన ప్రమాదాన్ని స్వీకరించటానికి వాళ్ళు ఏమాత్రం సంసిద్ధులైన వాళ్లుకాదు. జాన్

చిన్న తమ్ముడు హెన్రీ ఆండీకి ఎంతో ప్రీతిపాత్రుడై అతని బహు వ్యాపారాల్లో భాగస్థుడైనాడు.

బండి యెక్కి ఓహైయో గుండా క్రెస్టులైనుకు వెళ్ళు తున్నప్పుడు ఆండీ పచ్చని సంచీని మోసుకుపోతున్న ఒక మనిషిని చూశాడు. బిడియంగా కనిపించే అతడు అన్నాడు. మీరు పెన్సిల్వేనియా రైల్‌రోడ్‌కు సంబంధించిన వారట, బ్రేక్‌మాన్ నాతో చెప్పాడు."

"అవును. నిజమే!" అని సమాధాన మిచ్చాడు ఆండీ.

ఆ అపరిచితుడు "నా పేరు థియొడోర్ వూడ్రఫ్ నా దగ్గిర రాత్రి ప్రయాణాలకు పనికి వచ్చే ఒక కారునమూనా వుంది దాన్ని నేనే కనిపెట్టాను. మీకు చూపించనా!" అన్నాడు.

"తప్పకుండా"

మిస్టర్ వూడ్రఫ్ తన నమూనాను సంచిలోనుంచి బయటికి తీశాడు. అది నిద్రపోవటానికి వీలైన ఒక కారు భాగం. రెండు వైపులా దానికి జంటలుగా కూర్చోటానికి సీట్లు వున్నాయి. ఈ సీట్లు ఒకదాని కొకటి ఎదురుమళ్ళుగా వున్నవి రాత్రివేళ రెంటినీ కలిపే ఏటుబడితే అటు వంచ డానికి అనువైన దిండు, పరుపుల మూలంగా మొత్తాన్ని ఒక శయ్యగా మార్చివేయవచ్చు. కిటికీపైన మరొక ప్రక్కగా వుంది. పగటివేళ దీన్ని తెలివిగా లోపల దాచిపెట్టే ఏర్పాటువుంది గొలుసుల ఆధారంతో రాత్రిళ్లు దీనిని క్రిందికి దించవచ్చు.

పడుకొనేందుకు ఉపయోగించనప్పుడు దీనిని పరుపు, ప్రక్క గుడ్డలను పెట్టుకోటానికి గిడ్డంగిగా వినియోగించుకోవచ్చు. సంగ్రహంగా చెప్పవలసివస్తే ఇది 1810 నుంచి ఈనాటి వరకూ మనకు తెలిసివున్న పుల్మన్ స్లీపింగ్ కార్.

స్లీపింగ్ కార్లని పిలువబడే ఇటువంటివి రైల్‌రోడ్లు మీద ఇప్పటికి దరిదాపుగా ఇరవై సంవత్సరాలనుంచీ వుంటూనే వున్నవి. అయితే ఆత్మగౌరవమున్నవాళ్లు అందు మీద నిద్రపోవటానికి అసహ్యించుకొన్నారు. స్త్రీలు ఆ పని ఎన్నడూ చెయ్యలేదు. ఇవి ఇరువైపులా రెండుమూడు అంతస్తులున్న బాక్స్ కార్లకంటే కొంచెం బాగున్నవి కొందరు ప్రయాణీకులు వాటిమీద గుడ్డలు పరుచుకొని, మరి కొందరు బూట్లు విప్పుకొని ఈ షెల్ఫ్‌లమీద వెన్ను వాల్చేవారు.

ఈ సూచింపబడ్డ వూడ్రఫ్ కారు ఎంతో భిన్నమైంది. నమూనాను పరిశీలించగానే ఆండ్రూకు ఉద్దేశం ఎక్కువైంది ప్రయాణరీతినే పూర్తిగా మార్చివేయగల దేదో యిందులో ఉందని అతడు తనలో తాననుకున్నాడు ఎన్నో ప్రశ్నలడిగాడు.

వూడ్రఫ్ అన్నాడు: "ఇది మీతో చెప్పటం ఎంతో సముచితం. చాలా అననుకూలమైన పరిస్థితులైనప్పటికీ న్యూయార్క్ సెంట్రల్ వారు నా భావానికి రూపకల్పన చేసే ప్రయత్నం అర్థహృదయంతోనే చేశారు. దానికి సక్రమమైన అవకాశం లభించ లేదు."

ఆండ్రూ అడిగాడు: "నీకోసం కబురుచేస్తే అల్బూనాకు వస్తావా?"

"తప్పక వస్తాను"

"సరే. నేను తిరిగివెళ్ళిన తరువాత ఈ విషయాన్ని మిస్టర్ స్కాట్‌కు తెలియజేస్తాను. నీ చిరునామా నా కివ్వు"

ఓహైయోలో ఉన్నంతకాలం అతణ్ని స్లీపింగ్ కార్ వెన్నాడుతూనే వుంది. తిరిగి అల్బూనాకు వెళ్ళగానే అతను వేగంగా స్కాట్ కార్యాలయంలోకి చొచ్చుకోపోయి దావాను గురించి కూడా అడగకుండా "మిస్టర్ స్కాట్ నేనొక భావాన్ని సంపాదించాను. అది రాత్రిళ్లు పడుకొని నిద్రపోవటానికి వీలున్న కారు" అన్నాడు.

మేనేజరు మోముమీద సగంనవ్వుతో వింటూ వెనక్కు వాలాడు. అతడు కుర్రవాని ఉద్రేకాలకు బాగా అలవాటు పడ్డవాడు అయినా, అందులో కొంత గట్టి ఆధారం వుంటుందని అతనికి తెలుసు. "ఏమోయ్, యువకుడా! దీన్ని నీవు గట్టిగా విశ్వసించావా?" అన్నా డతడు. "సరే! మీ మిత్రునితో నమూనాను తీసుకోరమ్మను. దాన్ని నేను చూస్తాను."

తంతి మూలంగా తెలియజేసిన వెంటనే వుడ్రఫ్ అల్బూనాకు వచ్చాడు. స్కాట్‌కు అతని నమూనా గట్టిగా నచ్చింది.

"అయితే నీ మాట యేమిటి?" అతడడిగాడు.

"మీ కంపెనీ ఈ కార్లను తయారుచేసి, ప్రవేశపెట్టి నాకు రాయల్టీ ఇవ్వాలని" అన్నాడు ఆ వస్తుసృష్ట.

దానికి సంబంధించిన వివరాలను చర్చించటం అయిపోయింది. వెంటనే రెండు కార్లను నిర్మించాలని మిస్టర్ స్కాట్ నిశ్చయించాడు మిస్టర్ ఫ్రాడ్రిఫ్‌తో బాటు ఆండ్రీ) బయటికి వచ్చాడు. కార్యాలయ బహిరంగణంలో ఆ వస్తు సృష్ట అతనివంకకు తిరిగి "మిస్టర్ కార్నెగీ, ఈ వ్యాపారంలో నీవు నాతో కలిసి వస్తావా?" అని అడిగినప్పుడు అత డాశ్చ పడ్డాడు

క్షణకాలం ఆండ్రీ మూకత వహించాడు. అతని దగ్గర ఉన్నదేమిటి ? కొద్ది డబ్బు కాదు సిద్ధంగా లేకపోవటం. అయితే ఆడమ్స్ ఎక్స్ ప్రెస్ స్టాక్ లాగా తనవంకకు డివిడెండ్లను ప్రవహింపజేసే అవకాశాలల్లో ఒకటి సిద్ధంగా వుంది. జారవిడవటానికి వీల్లేదు.

"బహుశః, కలిసి వస్తాను" అన్నాడు. "నీ అభిప్రాయ మేమిటి ?" అని అడిగాడు.

"నేను వెంటనే ఆరంభింపబోతున్న సంస్థలో ఎనిమిదో వంతు భాగాన్ని నీకు కొనుక్కోని ఇద్దామని ఉద్దేశిస్తున్నా"

అతడు పెట్టుబడి మొత్తం ఎంతెంతుందో అంకెల్లో చెప్పాడు. వెంటనే చెల్లించటానికి తన దగ్గర డబ్బు లేదని ఆండ్రీ ఒప్పుకున్నాడు. కొంత సంభాషణ సాగిన తరువాత ఫ్రాడ్రిఫ్ అది అంచెలవారీగా చెల్లించవచ్చునన్నాడు. మొదటి

సారిగా చెల్లించవలసిన మొత్తం 217.50 డాలర్లు అప్పు పుచ్చుకోవటంవల్ల తప్ప మరొక విధంగా దీన్ని పొందే అవకాశం ఆంగ్రడికి లేదు. అతడు మిస్టర్ లాయిడ్ అనే స్థానికుడైన వడ్డీ వ్యాపారస్థుడి దగ్గరికి వెళ్లాడు. పెట్టుబడి పెట్టే నిమిత్తంగా డబ్బును అప్పుగా ఇవ్వటానికి అతనికి అవకాశం ఉంటుందేమో అని అడిగాడు. అతడు చాలా పొడగరి. ఆరు అడుగుల మనిషి. సాయిలా పాయిలావాడు. ఆండ్రీని యెరుగును. అతడంటే ప్రీతి కూడాను.

"అది మంచి పెట్టుబడి అని నీకు నిశ్చయంగా తెలుసునా!" బరువైన తన హస్తాన్ని ఆ యువ మిత్రుని భుజాల మీద అడ్డంగా వుంచి ఆ వడ్డీ వ్యాపారి ప్రశ్నించాడు.

"తెలుసును. అది స్లీపింగ్ కార్ కంపెనీకి పెట్టుబడి. మా రైల్‌రోడ్ సంస్థ రాయల్టీ పద్ధతిమీద అటువంటి కార్లను రెంటిని నిర్మించబోతున్నది.

"తప్పక నీ కిప్పిస్తాను, ఆండీ!" అన్నాడు మిస్టర్ లాయిడ్.

"సాహసించి ఏనా ఇవ్వదగ్గవాడివి నీవు."

ఆంగ్రడూ తన జీవితంలో ఒకగ్రామిసరీనోటుగ్రవాసి ఇవ్వడం ఇదే మొదటిసారి. ఈ సంఘటనే తన అదృష్టానికి ఆరంభమని తరువాత కాలంలో అతడు నిత్యం భావిస్తుండేవాడు. దఫాలువారిగా అతడు చెల్లించవలసిన పెట్టుబడి మొత్తాలను అతడికి వచ్చే డివిడెండ్ల మూలంగా వచ్చే డబ్బుతో చెల్లించ

గలుగుతుండేవాడు. పెన్సిల్వేనియా సంస్థ ఇంకా ఇతర జాతి ప్రణల్లను నిర్మిస్తున్నది ఈ పనికి ఇతర కంపెనీలు, తామూ పూనుకొన్నవి. అతడికి ఇరవయ్యెయిదేళ్ళ వయసు వచ్చేట ప్పటికి స్లీపింగ్ కార్ల పెట్టుబడిమీద వస్తున్న సంవత్సరా దాయం 5000 డాలర్లు. "సాంకోపాంజా పలికిన ధోరణిలో అంటున్నాను, నిద్రను కనిపెట్టినవా డెవడోగాని అతడికి శ్రేయమగు గాక !" అన్నాడు అత డొకమాటు.

కార్నెగీలు అల్హూనాలో మూడేలున్న తరువాత 1859 నాటి గ్రీష్మంలో, మిస్టర్ స్కాట్ తన అసిస్టెంటుతో అన్నాడు: "ఆండ్రీ ! వాళ్లు నన్ను ఫిలడల్ఫియా సంస్థకు ఉపాధ్యక్షుణ్ని చేయదలచుకొన్నారు. ఈవిషయాన్ని మిస్టర్ థామస్‌తో చర్చించేటందుకు నేను వచ్చేవారంలో ఫిలడల్ఫి యాకు వెళ్లుతున్నాను."

ఈ వార్త విని ఆండ్రూ క్రుంగిపోయాడు. ఫిలడ ల్ఫియా, అతడు విశేషంగా గౌరవిస్తూ, దరిదాపు అతని కాదర్శమూర్తి అని భావించే పెద్దను ఆకర్షించి వేస్తున్నది. దీని ఫలితం అతని మీద ఎలా వుంటుంది ! స్కాట్‌కు అను బంధంగా వుండటం తప్ప ఇంతవరకూ అతని కొక విశిష్టత అంటూ ఏమీ లేదు తన అధికారి తనకోసం ఫిలడల్ఫియా లోనే ఏదయినా ఉద్యోగ మిప్పిస్తాడా ?అలాగే జరుగుతుందని అతడు తీవ్రోద్వేగంతో ఆశించాడు. మరొకరి క్రింద పని చేయటమన్న భావం కలిగినప్పుడు అమితంగా భయపడ్డాను.

మేనేజరు ప్రయాణంచేసి తిరిగి వచ్చాడు. ఆండీని తన కార్యాలయానికి రమ్మని పిలిచాడు.

"ఆ నిర్ణయం జరిగింది" అన్నాడు అతడు. "ఉపాధ్యక్షుణ్ని కనుక నన్ను ఫిలడల్ఫియాకు మారుస్తారు."

"నా తరువాత వచ్చే జనరల్ మేనేజరు మిస్టర్ లూయిూ."

అతడు మాట్లాడుతున్నంతసేపు ఆండ్రూ నరాలు బిగుసుకు పోతున్నవి

"ఇక నీ విషయాం పిట్సుబర్గు డివిషనుకు సూపరింటెండెంటు అయిన మిస్టర్ పాట్సను ఫిలడల్ఫియాలోని ట్రాన్స్పోర్టేషను శాఖకు పరిమోాలు చేస్తున్నారు. ఆ స్థానాన్ని నీ కివ్వవలసిందని నేను ప్రెసిడెంటుకు రికమెండు చేశాను. పశ్చిమ శాఖను నీవు నడపగలవా ?" అన్నాడు ఓట్టచివరకు అతని పై అధికారి.

ఆంద్రీకి క్షణకాలం తలతిరిగిపోయింది. విజయం, అభివృద్ధి అన్న రెండూ, దరిదాపుగా నిశ్చితమన్నంత వరకూ, ఆత్మవిశ్వాసాన్ని కల్పించాయతనికి. అతనికి ఇరవై నాలుగో జన్మదినం ఇంకా కొద్దిరోజులకుగాని రాదు. తాను కేవలం రాజకీయజ్ఞుడు, అనుభవరహితుడు అయినప్పటికీ తీసుకోమంటే మర్యాడేచానల్ ఫ్లీట్ మీాద ఆధిపత్యాన్ని పుచ్చుకొంటాడని లార్డు జాన్ రస్సెల్‌ను గురించి చెప్పుకొనే విషయాన్ని స్మృతికి తెచ్చుకున్నాడు. బ్రూస్ గాని వాలెస్ లుగాని ఇలాగే ప్రవర్తించేవాళ్లు...

"నడపగలను" అని "నడపగలనని బాగా ఎరుగుదు" నన్న అభిప్రాయాన్ని నిగూఢంగా అనుసంధించి సమాధానం చెప్పాడు.

"సరే, మంచిది. నీ కొక అవకాశమిచ్చి చూడటానికి పుష్టర్ థామ్సన్ అంగీకరించాడు." జీత మెంతకావాలని నీ అభిప్రాయం ?"

"జీతమా !" అని ఆశ్చర్యపడ్డట్లున్నాడు- ఆ కొత్త సూపరింటెండెంటు జీతంసంగతి అతని మనసులో ప్రవేశించనే లేదు "నేను ఆసక్తిపడేది జీతాన్నిగురించికా"దన్నాడు ఉదారంగా. "నేను కోరేది ఆ పదవి. మీరు వుండి పూర్వం పనిచేసిన ఆ స్థానాన్ని పొందటమే నాకు గొప్ప. అదిచాలు. జీతాన్ని మీ ఇష్టంవచ్చినట్లుగా నిర్ణయించండి. మీ కిష్టమయితే ఇప్పుడిస్తున్నదే ఇవ్వండి.

[అది నెలకు అరవై అయిదు డాలర్లు]

మిష్టర్ స్కాట్ అతని సాధుత్వాన్ని గమనించి వస్తున్న నవ్వును ఆపుకొన్నాడు. "ఆ వుద్యోగాన్ని నేను నిర్వహిస్తున్నప్పుడు సంవత్సరానికి పదిహేనువందలు పుచ్చుకొన్నాను. మిష్టర్ పాట్‌కు పద్దెనిమిదివందలు వస్తున్నాయి. నిన్ను పదిహేనువందలమీద నియమించటం ఉచితం. నీ వీ తొలి పరీక్షలో విజయవంతుడవయితె జీతం పద్దెనిమిదివందల దాకా పెరుగుతుంది. అది నీకు సంతృప్తికరమేనా ?"

ఒక్క మాట తలనూచి చేతిని ఆడించటంతో అది అతనికి అప్రధాన విషయమని ఆ కొత్త వున్నతోద్యోగి తెలియజేశాడు.

తన కబ్బిన శుభాన్ని గురించి తెలియజేసే ఆతురతో అతడు మరోమారు వేగంగా ఇంటికి చేరాడు. అప లతడు లగత్తి వెళ్ళ దలచాడు. కానీ అది పిన్సిల్వేనియా రైల్‌రోడ్

వారి పిట్స్‌బర్గు డివిషను సూపరింటెండెంటు గారవాని! భయంకరమైన పనైపోయింది. అతని తల్లి ఈ వార్తవిని సంక్షేపంగా సంతోషించింది. ఆండ్రూవంటి కుర్రవాడివల్ల ఆశించేది ఇటువంటివి కావటమే ఇందుకు కారణం. ఆమె తిరిగి పిట్స్‌బర్గుకు వెళ్ళటమనే సమస్యను ఎదుర్కోవలసి వచ్చింది ఆమె "పూర్వ మిత్రుల మధ్యకు, బంధువుల మధ్యకు వెళ్ళటమంటే సంతోషకరమైన విషయమే గాని అక్కడి పొగమసికి భయమేస్తున్న" దన్నది.

పదహారేళ్ళ వయసుగల టామ్‌తో అన్నాడు: నాకు కార్యదర్శివిగా వుండటం నీ కిష్టమేనా ?"

"ఎంతో బాగుం" దని ఆశ్చర్యాన్ని వెలిబుచ్చాడు టామ్. అతడు ఇప్పుడు అద్భుతమైన టెలిగ్రాఫ్ రైనాడు. డివిషన్ సూపరింటెండెంటుకు తంతిద్వారా అనేకమైన వార్తలను పంపించటం. అందుకోటం వుంటుంది

సూపరింటెండెంటు బల్లమీద కూర్చొని ఉత్తరువులిచ్చేటప్పుడు ఆండ్రీ 'అబ్బా!' అని అనిపించుకోకుండా వుండటానికి యత్నించాడు. ఉన్నతస్థాయి వుద్యోగానికి అమాంతంగా ప్రాకి పైకొచ్చిన చిన్నవాడయిన తన్నుగురించి వయోవృద్ధులైన ఇతరోద్యోగస్థులు తమలో తాము గుసగుసలాడుకుంటారని అతడు అనుమానించాడు. అందువల్ల తన చిన్నరూపం సంగతి ఎలా వున్నా, తాను పొందిన ఆ వుద్యోగస్థానానికి తాను తగ్గవాడనని నిరూపించటంకోసం అతడు మరింత నిశ్చయం చేసుకోవటం జరిగింది. తన గుణవిశేషాలను నిరూపించుకోటానికి అతనికి ఆ సంవత్స

రపు చలికాలంలో చాలా అవకాశాలు లభించాయి. ప్రమాదం సంభవించినప్పుడు డివిషన్ సూపరింటెండెంటు రాతింబవళ్ళూ పనిచేయాలని ఉద్దేశింపబడుతుంది. రాత్రివేళ ఏదైనా ఒక హఠాత్సంభవము జరిగితే అతనికి ఆ రాత్రికి రాత్రే తెలియజేస్తుండేవారు ఆ ప్రదేశానికివెళ్ళిఅతడుదాన్ని చక్కబెట్టి వస్తుండేవాడు.

అంతేకాదు. అది ఎంత గడ్డుచలికాలం ! ఆ రోజుల్లో పట్టాలను అడ్డుకమ్మీలమీద బిగించేటప్పుడు పట్టుపట్టటం కోసం పోతయినుము "ఛైర్స్" ఉపయోగించేవాళ్ళు. గట్టిచలి గాలికి అవి తట్టుకోలేక పగుళ్లు చూపి విచ్చిపోతుండేవి. బండ్లు ఆగిపోవటాలు, పట్టాలుతప్పటాలు ఆ చలికాలంలో పరంప రగా ఉంటుండేది. ఒక చిక్కని చలిరాత్రి. ఎక్కడో ఒక చోట, ఇక్కడో అక్కడో, ఆ ఛైర్లు నలభైయేడింటిదాకా బద్దలైనాయి. అలా చలి విజృంభించే ఆ రోజుల్లో క్రొత్త సూపరింటెండెంటు ఇల్లువిడచి ఎనిమిది దినాలపాటు తిరిగి భంగాలు కలిగినచోట్ల, బండ్లు పట్టాలు తప్పినచోట్లు చూచాడు.

తనకు అలుపులేదు కనుక తాను ఇతరుల కష్టసుఖా లను ఎరగని కఠినుడైన అధికారివలెఆ రోజుల్లో ప్రవర్తించా నేమో అన్నభావం అతనికి తరువాత కాలంలో కలిగింది తనిచుట్టూ ఎంతోరొద వున్నా లెక్కచెయ్యకుండా బాక్స్ కార్ నేలమీద గాని లేదా మరెక్కడయినా గాని వెన్ను వాల్చి వెంటనే నిద్రపోగలశక్తి అతనికుంది. ఎంత చిన్న

కునికిపాటయినా చాలు శ్రమతీరి మహోల్లాసంతో నిద్రలేచే వాడు. దీనికి తోడుగా అతనికి హృదయపూర్వకంగా పని చేయాలన్న గుణ ముంది. క్రొత్తది బాధ్యతాయుతమైంది. ఐన వుద్యోగాన్ని శక్తితో నిర్వహించిచూపించే ఆశయంగల యువకుడు అతడు.

పిట్స్‌బర్గులోని పొగ, పొగదుమ్ము, తిరిగి వచ్చినపుడు వాళ్ళను ఆశ్చర్యచకితులను చేశాయి. "ఇది వెనుకటి కంటె చాలా అసహ్యకరమయినది" అని వాళ్లు ఒకరితో ఒకరు చెప్పుకున్నారు — కాని నిజానికి ఇప్పటికంటె వెనకే ఎక్కువ అసహ్యకరంగా వుండే దనికూడా చెప్పవచ్చు. ఏ వస్తువునూ పరిశుభ్రంగా వుంచటం సాధ్యంకానిపని అని మార్గరెట్ కార్నెగీ గృహిణీ హృదయం నిరుత్సాహంతో తల్లడిల్లింది.

కార్యాలయంలో ఒకనాడు "మాకు గ్రామ సీమల్లో వుండాలని వుం" దన్నాడు.

"మంచిది. ఎందుకుండ కూడదు"అన్నాడు మిస్టర్ స్కాట్ మేనల్లుడు రైల్‌రోడ్ సంస్థకు జనరల్ ఫ్రయిట్ ఏజంటు డి.ఎ.స్టువార్టు. "హోమ్‌వుడ్‌కువచ్చెయ్యండి వెంటనే కొనవచ్చు మాకు ప్రక్కనే ఒక స్థల ముంది. దాని వునికి ఎంతో బాగుంది. ఏమంతదూరానకూడా లేదు ఆ పరిసరాలల్లో ఒక డజనుకుమించి కుటుంబాలు లేవు. అవి అన్నీ వున్నతస్థాయిలోవే. మీరు కావాలంటే వచ్చి చూచేటంత

వరకూ అట్టిపెట్టమని ఆ ఆస్తిగలవాళ్ళతో చెప్పి ఉంచు తాను."

ఆండ్రీ, తల్లి ఆ ప్రదేశాన్ని పరిశీలించటానికి వెళ్లారు దాన్ని చూడటంతోటే వారికి ఎంతో ఉల్లాసం కలిగింది. అది మంచి విశాలమయిన మైదానాలు, చెట్లగుంపులు. పొదలు, కోనలు – వీటిమధ్య ఉన్న రెండంతస్థుల కాటేజి, నగరంలోని కార్నెగీల యిల్లు చిన్నజాతిలోది. అయినా కుటుంబానికి చాలినంతగా స్థలముంది. మార్గరెట్ మిత్ర బృందాన్ని పెంపొందించుకొని, అల్టూనాలో కంటే అధిక విస్తృతిగల పుష్పోద్యానాన్ని పెంచుకొని తన జీవితంలోని ఆనందకరమైన అనేక సంవత్సరాలను ఇందులోగడిపింది.

ఏదైనా ప్రమాదం జరిగినప్పుడు రాత్రి ఏగంటలో నైనా ఆదివారమైనా యువకుడైన ఆ ఉన్నతోద్యోగి పిలుపును అందుకొనే టందుకు వీలుగా ఇంటిలోకి టెలిగ్రాఫు తీగ అమర్చబడింది.

ఇరుగుపొరుగు వారైన స్టువార్టులుకూడా నెమ్మదిగా వారికి ప్రీతి పాత్రులైనారు. ఆండ్రూ ఇక్కడ యువకుడైన ఇరుగు పొరుగు జాన్ వాన్డి వోర్డును కలుసుకున్నాడు. ఇతడిలాగనే మిస్టర్ స్టీవర్ట్ కాలంగడిచిన తరువాత కార్నెగీ యినుము-ఉక్కు-వ్యాపారంలో భాగస్థుడైనాడు. ప్రియమైన "వాన్డీ" ఆండ్రూ చివరచివరగా చేసిన కొన్ని విదేశ ప్రయాణ కాలల్లో అతనికి సహచరుడుగా వుండేవాడు. కార్నెగీలు

హామ్‌వుడ్‌కు వలస వచ్చిన తరువాత అక్కడికి ఇంకో వాసి తుణ్ని తీసుకోవచ్చారు. అతడు థామస్ ఎన్, మిల్లర్ - యితడు పరీక్షకాగిన నిజమైన మిత్రుడు. సంగీతం, గ్రంథాలు దేశయాత్ర అన్న విషయాలల్లో ఆండ్రూతో అన్యోన్యత గలవాడు. ఆండ్రూ కార్నెగీలో ఉన్న మనోహరమైన లక్ష ణాలల్లో ఒకటి మైత్రి నార్జించటంలోగల సామర్థ్యం. మిత్రులయెడ ఆతనికుండే ఆసక్తి అతి తీవ్రమైంది. నిత్య మైంది. మిత్రులను అతడెన్నడూ మరిచిపోయేవాడుకాడు. వృద్ధాప్యం వృద్ధిపొందుతున్న సంవత్సరాలల్లో అతనికి అత్యానందప్రదాలైన దినాలు బహుకాల వియోగానంతరం యౌవనం నాటి మిత్రులను కలుసుకొన్న రోజులే.

హామ్‌వుడ్‌లోని విజ్ఞానవంతులు, సాంస్కృతికులతో గూడిన సమాజం హృదయ పూర్వకంగా ఆండ్రూని తమలో ఒక సభ్యుడ్ని చేసుకొన్నవి. ఆ ప్రాంతంలోకల్లా పెద్ద న్యాయమూర్తి విలియం జోన్సు. మంచి విద్వాంసుడు. వుద్యోగ విరమణకాలంలో విశ్రాంతి తీసుకొంటున్నాడు, కొన్నాళ్ళు సెనటర్‌గా వ్యవహరించాడు. కొన్నాళ్ళు యుద్ధ కార్యదర్శి, రక్షామంత్రి అతని భార్య రాజనీతి కోవిదులు, దాతృ తంత్రి నిర్వాహకులు జన్మించిన కుటుంబంలో పుట్టింది. ఈమె బైరన్‌కవికి దూరపు బంధువుకూడాను. వీళ్ళతో కొంతగా భీతిని కలిగించే పరిచయము, దీనికితోడు మిసెస్ ఎడిసన్, ఆమె కుమార్తెల పరిచయం ఆండ్రీ ఆత్మ తృప్తికి ఒక కుదుపును కల్పించింది.

"తనబోటివారిని ఉన్నత విద్యావంతులనుంచి వేరు చేసే వర్ణనాతీతము, గణనాతీతము అయిన అఘాతాన్ని అర్థం చేసుకొన్నాను" అని అతను తరువాత జీవితంలో అంగీకరించాడు. న్యాయమూర్తి విల్కిన్ పరవకత్న్యలోని చలిపొయ్యి చుట్టూ జరిగే సంభాషణలు డార్విన్, హెర్బర్టు స్పెన్సర్, జాన్ స్టువార్టుమిల్ మొదలయిన ప్రముఖుల రచనలను చదవమని ప్రేరేపించాయి. మిసెస్ ఎడిసన్‌తో కలిగిన పరిచయాలు అతని సంభాషణలోను, ప్రవర్తనలోను కోసులు కోసులుగా మిగిలిపోయిన అంచులను నునుపు చేశాయి. పిట్స్‌బర్గు, దాని పరిసరప్రాంతం ఇంతవరకూ ఎందులో చేరి వున్నట్లు భావింపబడుతున్నదో ఆ పశ్చిమప్రాంతంలో నివసించేయువకులు వదులైన కాలర్లు,బండబూట్లమీాద ప్రీతితో మొరటుతనాన్ని వెలిబుచ్చే అజాగరూకతను ప్రదర్శిస్తున్నారు ఆ రోజుల్లో 'పిచ్చి సొగసు' (Foppish) అన్న ముద్రను వెయ్యగల ప్రతిదీ అసహ్యించుకోబడేది. కొన్ని సమయాలల్లో 'కిడ్ గ్లో'లను ధరించే రైల్‌రోడ్ వారి సాధారణోద్యోగి పరిహాసపాత్రుడౌతూండేవాడు. యువకుడైన కార్నెగీలో వున్న అటువంటి అభిప్రాయాల నన్నింటినీ మిసెస్ ఎడిసన్ మృదువుగా తొలగించివేసింది. కొన్ని వేళల్లో ప్రమాదకరంగా పరిణమిస్తున్న అతని మంకుపట్టును కొంతగా ఆమె అణచి పెట్టవలసి వచ్చింది. అయితే అతడు ఎప్పుడూ నైజాన్ని ప్రదర్శించే వాడు కాడు. తన ఆరంభదశలో క్షుద్రమైన స్థితిగతులను గురించి ఎన్నడూ సిగ్గుపడేవాడు కాడు. 'వింత

ఏమంటే— అతడు తనకు కొంత మెరుగు, వృద్ధి అవసరమ గుర్తించాడు. ఎంత ఆత్మవిశ్వాస మున్నప్పటికీ అతనిలో సత్యసంధత, నిష్కాపట్యము, సాధుత్వము అతణ్ణి ప్రీ పాత్రుణ్ణి, జనానురాగపాత్రుణ్ణి చేశాయి.

విలియం కోల్‌మన్ ఆండ్రూకు మరో పొరుగువాడు. ఇతడు పిట్స్‌బర్గులోని ధనికుల్లో ఒకడు. ఇనుము పరిశ్రమ అధిపతి, కళాపోషకుడు. పిట్స్‌బర్గు ఆపేరా గృహానికి చిర కాలం యజమాని. పిట్స్‌బర్గ్, హోమ్‌వుడ్‌లలోని యువకుల దృష్టిలో ఇతనికున్న గొప్ప సంపద ఇతని అంద మైన అయిదుగురు కుమార్తెలు. వీళ్ళల్లో ఇరువురు థామస్ మిల్లరెకు ఒకతె, థామస్ యం. కార్నెగీకి ఒకతె భార్య లైనారు.

1859 లో పెన్సిల్వేనియాలో నూనెను కనుగోటం జరిగిన తరువాత మిస్టర్ కోల్‌మన్ ఆండ్రూలు ఇరువురూ అలిఘనీ వరకు పరిశీలన యాత్ర చేశారు. వాళ్లు వీలు చిక్కి నప్పుడు నిద్రిస్తూ, అందినచోట భోజనం చేస్తూ అనేకదినాలు మిట్టపల్లాలతో గూడిన నీలారణ్యదేశంలో సంచారంచేశారు. మిస్టర్ కోల్‌మన్ ఆండ్రూలు కొద్ది బేరం సాగిన తరువాత నూనె ఉన్నట్లు నిరూపితమైన భూమికి సన్నిహితంగా వున్న ఒక క్షేత్రాన్ని ఎంతైనా సరే పెట్టి జూడమాడ దగ్గదాన్ని అన్ని హక్కులతో నలభై వేల డాలర్లకి కొనగలిగారు. తరు వాత కాలంలో, అంటే నూనె లాభాలు విశేషంగా ఉన్న ప్పుడు, కనిపించినట్లు లాభాపేక్ష గలవారు. అప్పుడు ఆట్టే

వ్యామోహాన్ని ప్రకటించకపోవడం, ఆలోచనలుగాని, కార్యాచరణలుగాని తక్కువ సంఖ్యలో ఉండటం ఈ చౌక బేరానికి కారణాలు.

అందూ కార్నెగీ స్కాచ్‌వాడైనా కొత్త కొత్త సాహసచర్యల్లో పల్గొనటానికి జంకే స్వభావం కలవాడు కాడు. ఆత్మశక్తిమీద అతనికున్న విశ్వాసం, విజయమార్గంలో క్రియమైన ఆరోహణము కనిపించటం అన్నవి రెండూ అతని అదృష్టంమీద అతనికి ఎరుకపడని ఏదో నమ్మకాన్ని కలిగించాయి ఇంకా ఎన్నో అవకాశాలను స్వీకరించటానికి అతడు సాహసించేటందుకు తోడ్పడ్డాయి.

అప్పుడా క్షేత్రాన్ని విక్రయించిన వ్యక్తి ఆలానా దేవిని గురించి బహుశ ఎంతో సంతృప్తి పొందివుంటాడు. అందులోని సాహసాన్నంతటినీ కొనేవాళ్లు భరించారు. తన తదనంతర జీవితాన్నంతటినీ సుఖంగా గడిపేటందుకు చాలినంత ధనాన్ని వారిచ్చారు: అయితే, మూడు నాలుగేళ్ళకు ఎంతో విలువైన బ్లాక్ పెన్సిల్వేనియా పెట్రోలియంను ఇచ్చి డజనో లేక అంతకంటే కొంచె మెక్కువో బావులు పడ్డ తరువాత ఆ ఆస్థి విలువను రమారమి అయిదు మిలియన్ల డాలర్లని ఆభూస్వామికి హృదయంలో తీవ్రమైన మంటలు చెలరేగి వుండవచ్చు.

కోల్‌మన్ [యితనికి భూమిలో ఎక్కువభాగం తప్పదుగదా!] కార్నెగీ. వాన్డివోర్ట్, టామ్ మిల్లర్ ఇంకా యితరులు హోమ్‌వుడ్ బృందంలోవారు. ఆ క్షేత్రానికి

యజమానులుగా కొలంబియా ఆయిల్ కంపెనీని స్థాపించారు. కార్నెగీ యిరవై యేళ్ళయినా నిండని తన తమ్ముడు టామ్ కార్నెగీ కోసం కొంతడబ్బును ముందు తానె పెట్టుబడిపెట్టి భాగమిచ్చి కంపెనీలో చేర్చాడు. శక్తి, నిశితమైన బుద్ధి వున్నవాళ్ళకు అది నిజంగా అవకాశ స్వర్ణయుగం. ఆ తరువాత ఎన్నడూ కార్నెగీకి క్రొత్తపెట్టుబడులకు డబ్బు లేక పోవటమంటూ లేదు. అతడు మరిన్ని ఆడమ్స్ ఎక్స్ప్రెస్ వూడ్రఫ్ పెట్టుబడులను కొన్నాడు. వెస్టరన్ యూనియన్ టెలిగ్రాఫు సంస్థలోనుంచి కొనట మారంభించాడు అతని సంపద దార్లిపొయ్యే మంచుముద్దలా పెద్దదౌతున్న కొద్దీ దాని చుట్టూ మరికొంత పేరుకొంటున్నది.

# బల్ రన్ - డన్ఫర్మ్లైన్

## 6

కొంతకాలునుంచి నిరంతరం అతిసూక్ష్మంగా జాతీయ స ఘటనలమీద, సమస్యలమీద ఆసక్తి వహించి అతి నిశిత దృష్టితో పరిశీలిస్తున్న యువకార్నెగీ బానిసత్వం. రాష్ట్రాల హక్కులు అన్న వివాదగ్రస్త రెండంశాల వల్ల వుత్తర దక్షిణాలమధ్య క్రమంగా వృద్ధిపొందుతున్న తగాదాను గురించి తీవ్రమైన ఆందోళన చెందటం ప్రారంభించాడు. ఈ రాజకీయాలనే మహాశిలవు మీద తనకు ప్రియమైన జాతీయ నౌక భగ్నం కాబోతున్నదని అతడు నమ్మలేక పోయినాడు. అతడు నిశ్చయంగా ఆక్లిష్ట పరిస్థితికి సంచరించి తరువాతి కాలంలో అధ్యక్షుడు క్లీవ్‌లాండ్ అతడ్ని గురించి "అఫెన్సివ్ పార్టిజాన్" అని అన్నదానికి తగ్గట్లు రూపొందాడు. లింకన్ అధ్యక్షుడుగా ఎన్నికోబడ్డ ఫలితంగా 1861 నాటి సంవత్సరారంభంలో దక్షిణ రాష్ట్రాలు విడివడి పోవటం ప్రారంభించాయి ఆ సమయంలో అతడు ఒక ఆదివారం నాడు గ్రీన్స్‌బర్గ్‌లో తన వుత్తమ మిత్రుడైన మిస్టర్ స్టోల్స్ యింట్లో అతిథిగా వున్నాడు. అప్పుడతని ఆతిథేయ విడివడి పోతున్న రాష్ట్రాలను ఆపటానికి బలప్రయోగం చేసేందుకు ఫెడరల్ ప్రభుత్వానికి ఎటువంటి హక్కు లేదన్నప్పుడు విని ఆశ్చర్యపడ్డాడు.

"మిస్టర్ స్టాల్స్, మేము నీబోటి వ్యక్తులను ఆరు వారాలల్లో పురితీయబోతున్నాము." అని ఆండ్రూ విరుచుకు పడ్డాడు.

మిస్టర్ స్టోల్స ఈ పరాభవానికి ఏమీ చెయ్యలేక పెద్దపెట్టున నవ్వాడు. 'నాన్సీ' అని పక్కగదిలో వున్న భార్యను పిలిచాడు "నాన్సీ, ఈ యువస్కాచ్ పిశాచం ఏమంటున్నాడో విను. నాబోటి వాళ్ళను వీరు ఆరువారాల ల్లోగానే పురితీయబోతున్నారట."

కానీ ఆరువారాల్లోనే మిస్టర్ స్టోక్స ఫెడరల్ సైన్యములో మేనేజరైనాడు. అతడు విడివడిపోయే రాష్ట్రాలమీద సైన్యాన్ని ప్రయోగించరాదనటం రిపబ్లికన్ ప్రభుత్వంమీద ఒక ప్రగాఢమైన డెమాక్రాట్ చేసే విమర్శ మాత్రమే పోర్టు సమ్టర్‌లో జరిగిన కాల్పులనేసంఘటన అతనికళ్ళు తెరిచేటంత వరకూఅది యుద్ధమని అతడికి అవగతం కాలేదు. రాజకీయ పక్షాలకు సంబంధించిన చిన్ని సంఘర్షణ మాత్రమేఅనిఅతడు అంతవరకూ భావించాడు. ఇరుపక్షాల మధ్య ఏర్పడ్డ విచ్ఛిత్తి ఎంత తీవ్రమయిందో అర్థంచేసుకోలేకపోయిన అతనివంటి వ్యక్తులు మొదట్లో చాలామంది ఉండేవారు.

యుద్ధసేవ చేయవలసిన అవసరం పెన్సిల్వేనియా రైల్‌రోడ్ కంపెనీలో పనిచేసేవారికి అతివేగంగా వచ్చింది, మిస్టర్ స్కాట్‌ను ట్రాన్స్‌పోర్టేషను శాఖకు యుద్ధ సహకార్యదర్శిని చేశారు. అతడు వెంటనే తనకు విశ్వాసపాత్రుడయిన ఆండ్రూ కార్నెగీని రైల్వే మనుష్యులతో ఒక సైనిక

దళాన్ని కూర్చుకొని మిలిటరీ రైల్‌రోడ్, టెలిగ్రాఫ్‌ల పని చూచేటందుకు సహాయకుడవుగా రమ్మని పిలిపించాడు. మసాచ్యుసెట్స్‌నుంచి దక్షిణానికి చేరవలసిన సైన్యం బాల్టిమోర్ మీదుగా వెళ్లుతున్నప్పుడు ఒక మూక ఎదుర్కొన్నది. అనేక చోట్ల రైల్వేలైను పెగగొట్టి, వంతెనలను తగలేసి అదిమార్గాలన్నింటినీ పాడుచేసింది. ఏప్రియల్ 19 తరువాత ఒక వారానికి వాషింగ్‌టన్‌కు, ఉత్తరానికీ మధ్య వార్తాప్రసారం పూర్తిగా విచ్ఛిన్నమైపోయింది. ఇది చాలా విషమమైన పరిస్థితి.

ఆ మార్గాన్ని తిరిగి సరిచేయించటం కార్నెగీకి నిర్ణీతమైన ప్రథమ కర్తవ్యం. ప్రయాణం చేయవలసిన సైన్యంలోనుంచి ఎన్నుకొన్న మనుష్యులను, ఒక ఇంజనీరింగ్ దళాన్ని అతడు కనికరమన్నది ఎరగకుండా తరిమి పనిచేయించాడు.

వారాంతంలో బండ్లు తిరిగి నెమ్మదిగా దక్షిణానికి వెళ్ళటం ప్రారంభించాయి. కట్టెలను మధ్యమధ్య ధట్టించటానికి ఎంతో ఘనమయిన భారాలను మోయగలందుకు వాటిని బలకరం చెయ్యటానికి తన మనుష్యులను అక్కడ ఆపుదలచేసి నిండా సైనికులున్న రైలుబండి ఇంజన్‌ప్లేటులో కూర్చుని తాను బాగుచేయించిన రోడ్డుమీదుగా వాషింగ్టన్ వైపుకు ప్రయాణంచేశాడు. బండిమీద విద్రోహచర్య ఏదైనా జరుగుతుందేమో అన్న భయంతో వాళ్లు అతిజాగరూకులై వెడుతున్నారు. వాషింగ్టన్ ఇంకా చాలామైళ్ళ దూరానవుంది. వున్న ఒక్క తంతితీగను స్తంభాలనుంచి

వదులుచేసి నేలమీద మేకుతో గట్టిగా అంటబాతినట్లు ఆంద్రూ గమనించాడు.

"ఇక్కడ ఆపండి. నేను తంతితీగను విడుదలచేయాలి" అన్నాడు ఆంద్రూ ఇంజనీరుతో.

"దాన్ని తెగనరికారా ఏమిటి ?" అప్పటికి ఇంకా గాలి బ్రేక్ రాలేదు కనుక ఆవిరిని ఆపి వెనక్కు నడుపుతూ ప్రశ్నించాడు ఇంజనీరు.

"లేదు" అన్నాడు ఆంద్రీ సమాధానంగా." ఎందుకో మరి, మేకులతో నేలకు అంట పాతటం మాత్రమే జరిగింది. తోరణంలా వేలాడుతున్నా అది పని చేస్తుంది. అయితే ఇలా నేలకు బిగిస్తే పనిచెయ్యదు

పెట్టెలోనుంచి అతడు వేగంగా క్రిందికిదిగి, మేకు దగ్గరకు వెళ్ళి, రెండుచేతులతో బలంకొద్ది మేకును నేలనుంచి బయటికిలాగాడు బిగించినవైరును హఠాత్తుగా విడిపించటం వల్ల ఏం జరుగుతుందో అత డప్పు డూహించలేదు అతని మొగాన గట్టిదెబ్బకొట్టి పైకి ఎగిసిపడ్డది. అతడి చెక్కిలి మీద అడ్డంగా లోతుగ గీచుకుపోవటంవల్ల నెత్తురు విపరీతంగా కారింది. నెత్తురులో నిండిపోయిన చేతిగుడ్డను మొగాన అడ్డుపెట్టుకొని సైన్యంతో అతడు వాషింగ్టన్ ప్రవేశించాడు. అంతర్యుద్ధంలో యూనియన్ కోసం తొలిసారిగా నెత్తురునుబలి కించిన వాణ్ని నేనని అతడు తరువాతకాలంలో నవ్వుతూ అంటుండేవాడు.

వాషింటన్ చేరగానే యుద్ధశాఖలో తంత్రివార్తావాహులు తక్కువగా ఉన్నట్లు తెలుసుకొన్నాడు. యుద్ధసేవకోసం మరి నలుగురికి ఉత్తరువులు పంపించి పిలిపించవలసిందని అధికారులు అతణ్ణికోరారు. అతడు ఆ వుత్తరువును డేవిడ్ మెకాల్గోకు తంతిమూలంగా పంపించాడు. అతడు ప్రస్తుతం పిన్సిల్వేనియా రైల్‌రోడ్‌కు టెలిగ్రాఫ్‌సూపరింటెండెంటుగా పనిచేస్తున్నాడు. మెకాల్గో ఆ నలుగురు ఆపరేటర్ల పేర్లను వారు వాషింగ్‌టన్ చేరటానికి వెంటనే ఏ మార్గాన వస్తున్నది ఒక గంటలోపల తెలియజేశాడు. వారి వయస్సు పద్దెనిమిది, ఇరవైమూడు మధ్య వుంటుంది. వాళ్ళలో పెద్దవాడు స్ట్రోస్, తరువాత ప్రభుత్వతంతి సమాచారశాఖకు సూపరింటెండెంటు అయినాడు.

పోటొమాక్ నది మీదుగా వర్జీనియా రాష్ట్రంలోకి వెళ్ళే బాగా దెబ్బతినిపోయిన మార్గాన్ని పునర్నిర్మించటం అతనికి తరువాతి కర్తవ్యమైంది. ముఖ్యపట్టణ రక్షణార్థం ఆ ప్రాంతానికి ఫెడరల్ సైన్యం వెళ్ళటందుకు వీలు కలిగించాలంటే ఇది ఎంతైనా అవసరం. ఉన్నతోద్యోగితోసహా అందరూ గడియారం దగ్గర పెట్టుకొని పనిచేసి పోటొమాక్ నది మీది పొడుగాటి పాత వంతెనను తిరిగి కొయ్యతోటే నిర్మించడం జరిగింది. చెడగొట్టబడ్డ మొత్తంమార్గాలను, వంతెనలను, తంతి తీగలను సరిచేయిస్తూ, క్రొత్తవి నిర్మిస్తూ ఆ యువకుడయిన ఉన్నతోద్యోగి ఆరువారాలు గడిపాడు.

1861 వేసగిలో ఎన్నడూ ఎరగని ఎండలు కాశాయి. అమెరికాలోని నిదాఘతాపానికి అతడు తట్టుకోలేకపోయినాడు. ఎక్కువసేపు ఎండలో గడపకుండా ఉండటంకోసం అతడు ఎంతో శ్రద్ధ తీసుకోవలసివచ్చేది.

యూనియన్‌కు కనువిప్పును కలిగించిన బుల్ బరన్ యుద్ధం జులై 21న జరిగింది. ఆ రోజున కార్నెగీ సైన్యాలను ఆహారపదార్థాలను, ఆయుధసామగ్రిని రైలుమీద యుద్ధరంగానికి చేరుస్తూ వాషింగ్టన్‌కు ఇరవై మైళ్ళదూరంలోవున్న బర్కన్ స్టేషన్‌లో వున్నాడు. ముఖ్యనగరంలో శ్రుతిమించిన ఆత్మవిశ్వాసం రాజ్యమేలుతున్నది. అహంకారపూరితులైన దాక్షిణాత్యులను చులకనగా ఓడించవచ్చుననీ, ఆ చిన్ని తిరుగుబాటును అంతమొందించవచ్చునని ప్రభుత్వం అభిప్రాయపడుతున్నది.

బర్కన్ స్టేషన్‌లో రోజంతా తీవ్రంగా శ్రమపడవలసి వచ్చింది. అంబ్యూలెన్సు శకటాలు తీసుకోవస్తున్న క్షతగాత్రుల సంఖ్య క్షణక్షణం ఊరికే పెరిగిపోతున్నది. వాషింగ్టన్ నుంచి ఇంజన్‌లను, కార్లను తెప్పించి వారిని నగరంలోను, పరిసరాలలోను ఉన్న వైద్యశాలలకు చేర్చే ఏర్పాటు చేయించవలసివచ్చింది. యుద్ధభూమినుంచి వచ్చిన తొలి వార్తలు ఆశాజనకంగానే వున్నవి. మధ్యాహ్నమయ్యేటప్పటికల్లా పరిస్థితిలో మార్పు కన్పించింది. కొందరు దళాలుగాను, కొందరు ఒంటరి దిమ్మరులుగాను తిరోగమించివస్తున్న

సైనికుల గుంపు స్టేషన్ మీాద వెల్లువగా వచ్చి పడింది. ఒక ఘనవిజయానికి బదులుగా దారుణ విపత్తు రానున్నదని వెంటనే స్పష్టమయింది. బండి తరువాత బండిగా గాయపడ్డ వాళ్ళను పంపించటం కొనసాగుతూనేవుంది. వాగన్ మార్గాలు తిరిగివచ్చే సైనికుల బండ్లతోను, కొందరు కుటుంబాలతో, కొందరు ఒంటరిగా విజయాన్ని చూడటంకోసం వచ్చిన కాంగ్రెస్ సభ్యుల బండ్లతోను వుద్యోగుల బండ్లతోను క్రిక్కిరిసిపోతున్నవి. దారుణమయిన ఓటమి కలుగుతున్న సమయంలో చీకటి పడింది. కార్నెగీ వాషింగ్టన్ వెళ్ళటం కోసం బండి ఎక్కగానే కాల్పులచప్పుళ్లు మిక్కిలి సన్నిహితంగా వినిపించాయి. ఆ పిమ్మట అతడు చాలా వారాలు వాషింగ్టన్‌లోనే వున్నాడు. అతనికి ప్రభుత్వంలోను, సైన్యంలోను వున్న ప్రముఖులందరితో పరిచయం కలిగింది. వీళ్ళల్లో అధ్యక్షుడు లింకన్ ఒకడు. అతడు తనకు సహజమయిన నిష్కాపట్య సౌజన్యాలు గల వ్యక్తిత్వంతో కార్నెగీని గాఢంగా ప్రభావితుడ్ని చేశాడు

వాషింగ్టన్‌లోని ప్రభుత్వం యుద్ధాన్ని గురించి మొదట కొద్ది వారాల్లో ముగిసిపోయే చిన్న పొంగు మాత్రమే అని అనుకున్నది. అందువల్ల రైల్‌రోడ్‌కు సంబంధించిన స్కాట్, కార్నెగీల వంటి వారిని ఆత్యాయిక పరిస్థితిని సరిదిద్దటం కోసమే త్వరితగతిని పంపించటం జరిగింది. నిశ్చేష్టులను చేసేటట్లు బుల్‌రన్‌లో కలిగిన వ్యతిరేకఫలం

అధికారవర్గంవారి ఆలోచనారీతినే మార్చివేసింది. యుద్ధం ఒకటో, రెండో, మూడో సంవత్సరాలు సాగుతుందని గుర్తించటం జరిగింది. స్కాట్, కార్నెగీలు బహుకాలం వారి రైల్‌రోడ్ వుద్యోగాలను విడిచిపెట్టి వుండటానికి వీల్లేదు. అంతేకాక పెన్సిల్వేనియా వంటి ప్రముఖమైన రైల్‌రోడ్‌లు యుద్ధాన్ని కొనసాంచటానికి ముఖ్యంగా అవసరాలుగాకూడా ఉన్నవి స్కాట్, కార్నెగీలు వారి వుద్యోగాల్లోకి వెళ్ళిపోయారు. ప్రభుత్వం తన రైలు, తంతిపనులను చూడటం కోసం స్థిరంగా వుండిపోగల వుద్యోగులను నియమించుకున్నది

పిట్స్‌బర్గుకు తిరిగివచ్చి కార్నెగీ తనవుద్యోగపుతంతువులను అందుకొని, ఆనాటి ఆశాపరులయిన గొప్ప వుద్యోగస్థులందరూ చేస్తున్నట్లుగానే' బయట వ్యాపారాల్లోని పెట్టుబడులమీద దృష్టి నిలపటం కొనసాగిస్తూనే వున్నాడు. తరువాత వచ్చిన చలికాలపు చివరిభాగంలో చాలావారాలు అతను గట్టి జబ్బు పడ్డాడు. కార్యాలయానికి తిరిగి వచ్చినప్పుడు తన బలహీనతను తెలిసికొని స్వాస్థ్యాన్ని చేకూర్చుకోవటం కోసం సెలవడిగాడు. సెలవు మంజూరుచేయబడ్డది. సెలవు ఎక్కడ గడపటమా అన్న ప్రశ్న అతనికి కలగనేలేదు. మే మాసాంతంలో తాను, తల్లి డన్‌ఫర్మ్‌లైన్ మీదడానికి వస్తున్నామని వ్రాశాడు.

జూన్ 23న వారు లివర్‌పూల్‌కు ఓడప్రయాణం చేసేటప్పుడు ఎడబాటు ఎరుగని టామ్ మిల్లర్ వారి వెంట వున్నారు అతను బ్రిటన్ అంతా తిరగటంకోసం బయలుదే

రాడు. బండి లివర్‌పూల్‌నుంచి ఉత్తరంగా నడుస్తున్నప్పుడు ఛివియట్ కొండలను చుట్టి అది స్కాట్లండులో ప్రవేశించి నప్పుడు ఆండ్రూ, అతని తల్లిపొందిన ఆనందం పరాకాష్ఠ నందుకున్నది అలలుగా కదలాడే పచ్చనిపూల పరవులతో అక్కడి కొండప్రదేశమంతా కప్పబడివున్న దృశ్యాన్నిచూసి మార్గరెట్ కార్నెగీ "ఓహో! అక్కడే తంగెడుచెట్టు!తంగెడు చెట్టు" అన్నది నెమ్మదిగా. పొంగి పొరలే సంతోషభాష్పాలను ఆమె ఆపుకో లేకపోయింది. ఇక ఆమె కుమారుడు "పవిత్రమైన ఆనేలమీద పడి ముద్దెట్టుకుందా మని నాకనిపించింది" అన్నాడు తరువాత.

వారిని గౌరవించే విషయంలో మేము మేమని పోటీ పడ్డ అసంఖ్యాకులయిన బంధువులు వారికి స్వాగతంచెప్పారు. మిసెస్ కార్నెగీ తన కుటుంబంతో, మారిసన్‌లతో వుండి పోయింది. ఆండ్రీ సూటిగా అంకుల్ జార్జిలాండర్ షాపులో వున్న గదికి వెళ్ళాడు. అక్కడ యువకులయిన వారిరువురూ ఒకరియెడ ఒకరు వాళ్ళ బాల్యంలో వర్తించినట్లే 'డాడ్' 'నైగ్' లాగా ప్రవర్తించారు. వారు 'డగ్లస్' అనే 18వ శతాబ్దపు విషాదాంత నాటకంలోని ఒక దృశ్యాన్ని చిన్నతనంలో చూసినట్లే చూశారు. అక్షరం తప్పిపోకుండా దరిదాపుగా అందులోని పంక్తులన్నీ జ్ఞాపకమున్నట్లు వాళ్లు సరిచూచుకున్నారు.

ఆ బంధువుల్లోకెల్లా పెద్దదయిన ఆంట్ ఛార్లొటీకి ఆండ్రూ మరీ పసిబిడ్డగా వున్ననాటి విశేషాలు కొన్ని బాగా జ్ఞాపకమున్నాయి. ఆమె "నీవు చాలా ఆశాపరుడైన బిడ్డ"వని

అతనితో అన్నది. "నీకు రెండు చెంచాలతో పోయవలసి వచ్చేది. నోటిలోనుంచి ఒకటి తీసేటప్పటికే రెండోదాని కోసం గుక్క పెట్టేవాడివి ఆండ్రీ అభివృద్ధిని గురించి తెలుసు కోటం విషయంలో ఆమె ఎంతో వెనకపడింది. అతడు రావటం ఎంతో ముఖ్య విషయంగా భావించింది. "నీవు ఏనాటికయినా తిరిగి వచ్చి ఇక్కడ హైస్ట్రీట్‌లో షాపు పెట్టలేముసుమా" అన్నది. హైస్ట్రీట్‌లో ఆమె అల్లుడికి ఒక గ్రీన్‌గ్రోసర్ షాపుపుంది అతడు ఇతర వీధుల్లోషాపు లున్న వాళ్ళకంటె కొంత అధికుడుగా ఉండేవాడు. ఆమె దృష్టిలో మానవజీవితంలో సాధింపదగ్గ ఘనమైన విషయం ఆ హైస్ట్రీట్‌లో షాపు పెట్టటమే.

కార్నెగీ కుటుంబం అమెరికాకు వలసపోవటంకోసం ఇరవై పౌనులు అప్పిచ్చిన మిసెస్ హెన్డర్‌సన్ — అయ్‌లీ ఫార్గీ ఇంకా జీవించేవుంది. ఆమె, జానీలకు ఇప్పుడు బాగా లేకపోవటమనే స్థితే లేదు. ఇరవై పౌనులు తగ్గటంవల్ల మొదట కొంత తగ్గుదల వచ్చింది. అయితే డన్‌ఫర్మ్‌లైన్ ప్రమాణాలనుబట్టి చూస్తేవాళ్ళిప్పుడు ఆనందంగా వున్నారు. అప్పు డిచ్చిన అప్పుకుగాను మిసెస్ అన్డర్‌సన్‌కు కార్నెగీ ఇరవై పౌనులు 'ఇంటరెస్టు' [వడ్డీ. ప్రీతి అని శ్లేష] అన్న పేరుతో స్వార్థరహితమైన కృత్యానికి గాఢమైన కృతజ్ఞతగా కొన్ని సంవత్సరాలు పంపించటంతో వాళ్ళకు డబ్బు పెర గటం మొదలెట్టింది. ఇప్పు డతడు "నేను ఆ అప్పును ఇప్పుడు తీర్చివేయటం మంచిదని భావిస్తున్నా" నన్నాడు.

"ఆ అప్పు ఇదివరకే తీర్చావుగాదా" అన్నది సమాధానంగా

"ఇచ్చిన 'ఇంటరెస్టు'తో [ప్రీతి. వడ్డీ అని శ్లేష] నేను సంపూర్ణంగా తృప్తిచెందాను."

"వెనక వడ్డీమాత్రమే చెల్లించాను. ఇప్పుడు అసలు ఇచ్చివేయగల స్తోమత నాకు వచ్చింది" అన్నాడు అభ్యంతరం చెపుతూ.

"ఆండ్రా. అసలు సంగతి పెట్టుకోకు" అన్నది ఆ హాస్య సన్నివేశానికి అనుగుణంగా కళ్ళు మిలమిలలాడిస్తూ. "ఉన్న దున్నట్లుగానే అది చాలా మంచి పెట్టుబడి"

అందువల్ల "ఇంటరెస్టు" క్రింద [ప్రీతి, వడ్డీ అనిశ్లేష] చెల్లింపులు నడుస్తూనేవచ్చాయి.

ఇంటి విషయానికి వస్తే ఆ 1862 వేసగి ఫెడరల్ ప్రభుత్వానికి తృప్తికరంగా లేదు. యుద్ధభూమిలో దానికి చుక్కెదురుగా వుంది యుద్ధఫలితాన్ని గురించి తీవ్రమైన అనుమానాలు ప్రారంభమయినాయి. స్కాట్లండులో ముఖ్యంగా డన్ఫర్మ్‌లైన్‌లోకూడా అభిప్రాయం దక్షిణానికి అనుకూలంగా వుంది. అది విని కార్నెగీ విస్తుపోయాడు. యూనియన్ అనుసరిస్తున్నది సన్మార్గమని తెలియజెపుతున్న అంకుల్ లాడర్ ఆ ప్రాంతంలో ఒక్కడై నిలువవలసి వచ్చింది.

తిరిగి జబ్బుచేయటంవల్ల ఆండ్రూ అంకుల్ లాడర్ ఇంట్లో కొన్ని వారాలు గడపవలసివచ్చింది. వాళ్ళిరువురూ అమెరికన్ వ్యవహారాలను గురించి ఎన్నో చర్చలు చేశారు.

ఒకనాడు అంకుల్ అన్నాడు అతనితో "ఆండ్రూ ! నిన్ను శ్రమకరమైందిఅడుగుతున్నానని నాకు తెలుసు నేను దాచి పెట్టుకొన్నది తీసుకోపోయి నా కోసం అమెరికాలో పెట్టు బడిపెడితే నే నెంతో సంతోషిస్తాను" అన్నాడు.

ఈ విధంగా తనమీద భారాన్ని పడేసినందుకు ఆండ్రూ చకితుడైనాడు. "అంకుల్ డబ్బును ఏ రూపంలో పెట్టుబడి పెట్టమంటావు ?" అని అడిగాడు.

"అది నీకే బాగా తెలుసు" అని సమాధానం వచ్చినది. "అయితే దాన్ని యునైటెడ్ స్టేట్స్ బాండ్లకు వినియోగిస్తే నాకు మరికొంత ఎక్కువ సంతోషం ఎందువల్లనంటే ఇటువంటి ఘోరమైన ప్రమాద స్థితిలో ఉన్న సమయంలో కూడా ఇలా అనటం నే నా గణతంత్ర రాజ్యాంగము మీద ఎన్నడూ విశ్వాసాన్ని కోల్పోయిన వాడిని కాకపోవటం వల్లనే.

అంకుల్ కోరినట్లుగా కార్నెగీ కొంతడబ్బును ప్రభుత్వ బాండ్లలోను, మరికొంత తనతో సంబంధమున్న అనేక వ్యాపారాలలోనూ పెట్టుబడి పెట్టాడు చివరకు అంకుల్ లాడర్ పెట్టుబడికి మూడురెట్లు ప్రతిఫలం వచ్చింది.

జార్జి, జూనియర్ ఇతరులతో ఎంతో ముక్తసరిగా మాట్లాడే స్వభావం గల స్కాచ్ యువకుడు. మంచి సమర్థుడయిన మెకానికల్ ఇంజనీరు. కెల్విన్ దగ్గర చదువుకున్నాడు ఆండ్రూను అమెరికన్ వ్యాపారాన్ని గురించి, ఖనిజ సంపదను గురించి అతడు అనేక ప్రశ్నలడిగాడు. అమెరికాను

చూడాలనీ, అద్భుతమైన ఆ దేశంలో తన అదృష్టాన్ని పరీక్షించుకోవాలనీ అతడికి నిగూఢమయిన అభిలాష వున్నట్లు ఆండ్రి గమనించాడు.

"డాడ్, నీకున్న శిక్షతో, శక్తితో నీ వక్కడచాలా గొప్ప పనులు చేయవచ్చు !" అన్నాడతడు.

డాడ్ అప్పుడు ఇదమిత్థమని ఏదీ నిర్ణయించి చెప్ప లేదు. కానీ అతడు సకాలంలో కార్నెగీ ఉక్కు సామ్రాజ్యం లోని ఒక ప్రముఖ పాత్ర వహించటానికి మహాసముద్రాన్ని దాటాడు.

# భంగపడిన తీర్మానం

## 7

అల్టూనాలో వున్నప్పుడు కార్నెగీ ఒకరైల్ రోడ్ షాపులో తొలిసారిగా ఇనుపబ్రిడ్జిని చూశాడు. అది చిన్న పగుళ్ళమీదుగా పట్టాలను యివతలనుండి అవతలకి తీసుకో పోవటం కోసం తయారు చేసింది. దీని నమూనాను కంపెనీ వారి ఇంజనీరింగ్ శాఖలో పనిచేస్తున్న హెచ్. జె. అన్విల్ల షాపుల్లోని యాంత్రిక మేధావి జాన్ యల్ పైపర్ సాయంతో నిర్మించాడు. వాళ్లు యిరువురూ కలిసి దానికి పేటెంటు తీసుకొన్నారు. పైపర్‌ను షాపుల్లోను, ఆఫీసులోను అందరూ "పైప్" అని వ్యవహరిస్తుంటారు. ఇతడు రైల్ రోడ్ కంపెనీవారికీ వంతెనలను నిర్మించి యిస్తుంటాడు. ఇంత వరకూ ఇతడు తనపని తనంతటనే కొయ్యతోనే చేస్తుండే వాడు. బ్రిడ్జిలు ఆ దినాలలో కొయ్యది కావటంవల్ల తరచు కాలిపోతుండేవి. వాటికీ, కొట్టుకొని పోతున్న వాటికీ బదులుగా అతివేగంగా బ్రిడ్జిలను తయారుచేసి యివ్వడంలో యెంతో పేరెక్కినవాడు, "ఒక యింజనీరింగ్ దళాన్నంత

టిని వేసేదానికంటె కాలిపోయిన బ్రిడ్జిదగ్గరకు నేను 'పైపు'ను పంపుతాను "అని అధ్యక్షుడు థామ్సన్" ఇతడ్ని గురించి అన్నాడు.

ప్రస్తుతం 'పైప్' ఇనుప బ్రిడ్జిలు కావాలని పరవశుడై వాదిస్తుంటాడు, "అండీ; కొయ్యవంతెనలకాలంఅయిపోయిం"దని ఇతడు పదేపదే అంటుండేవాడు. "ఇకనుంచి ఇనుపది తప్ప మరేవీ ఉండవు. రాబొయ్యే ఇరవై సంవత్సరాల్లో మొదటి తరగతి రైల్ రోడ్డుమీద కొయ్య వంతెన అంటూ వుండదు. కాలిపోనివి ఏటి పొంగులకు కొట్టుకొనిపోనివీ అయిన యినుప బ్రిడ్జిలను గురించి యోచించు."

అతడు, రైల్‌రోడ్ కంపెనీ వారి బ్రిడ్జిల జనరల్ సూపర్వైజరు ఆరన్ ష్కిఫ్లర్ ఇద్దరూ 1862 లో కంపెనీ వుద్యోగాన్ని వదిలేసి తా మిరువురూ భాగస్వాములుగా వంతెనలను నిర్మించే ఒక కంపెనీని ప్రారంభించారు. అయితే వారికి వ్యాపారంలోని కిటుకులు తెలిసిన వాళ్లు పెట్టుబడి పెట్టగలవాళ్ళు కావాలి. లిన్విల్లి కార్నెగీలను కంపెనీలోకి తీసుకొన్నారు. వీరిలో కార్నెగీ అయిదుగురు భాగస్వాములతో కీస్టోన్ బ్రిడ్జి కంపెనీని స్థాపించాడు అయిదవ వాడు థామస్ యన్. స్కాట్. వీరు ప్రతివొక్కరు పన్నెండు వందలయాభై డాలర్లు పెట్టుబడి పెట్టారు. ఆరువేల ఆరువందల యాభై డాలర్ల పెట్టుబడితో వొక బ్రిడ్జిలను నిర్మించే కంపెనీని ఆరంభం చెయ్యటం ఈనాటి పారిశ్రామికుల బుద్ధికి పరిహాసాస్పదంగా కనిపించవచ్చు. అయితే అన్నిటి ఖరీదులు

కొద్దిలో వుండేవి. వ్యాపారం కొద్దియెత్తున జరుగుతుండేది. చాలా సంస్థలు ఈనాడు మనకు అతి స్వల్పమైన మొత్తంగా కనిపించే మూలధనంతో ఆరంభమయినవే. ఈ పెట్టుబడి దారులు అప్పుడప్పుడూ డబ్బు అప్పుపుచ్చుకోవలసి వస్తుండేది. కానీ వారు ఆ అప్పులను సకాలంలో తీర్చగలుగుతుండేవారు. ఎగుడు దిగుడుపని యేమాత్రం వుండకూడదనీ, నిర్మించే ప్రతి బ్రిడ్జిని చేతనయినంత కట్టుదిట్టంగా నిర్మించాలని వారిలో అందరూ స్థిరనిశ్చయులయినారు. వీరు సక్రమంగా నిర్మించిన బ్రిడ్జీలను గురించి మాటాడుకొంటుండేటప్పుడు థామస్ కార్లైల్ నుంచి గ్రహించిన "ఆనెస్టుబ్రిక్" [సమ్మకమయిన వంతెన] అన్న పదబంధాన్ని తరుచుగా ప్రయోగిస్తుండేవాళ్లు.

పెన్సిల్వేనియానుంచి పశ్చిమంగా తమ రైలు మార్గాన్ని విస్తృతం చేస్తున్నప్పుడు వొకరైల్‌రోడ్ కంపెనీ వీరిని "పిట్స్‌బర్గుకు పశ్చిమంగా వున్న స్ట్యూబెన్ విల్లి దగ్గర ఓహైయోనదిమీద వొక వొడ్డునుంచి మరొక వొడ్డుకు మూడువందల అడుగుల మధ్య దూరంతో ఒక బ్రిడ్జిని తయారు చేసి యిచ్చే పనికి పూనుకొంటారా" అని అడిగింది. ఇది ఈ కీస్టోన్‌సంస్థకు తొలిరోజుల్లో వచ్చిన "సవాలు"ల్లో ఒకటి. అప్పటికి ఉక్కు ఇంకా అమెరికాలో తయారు కావటంలేదు. అంత ఎక్కువ 'మధ్యస్థదూరం'తో పోతఇను మును ఉపయోగించి రైల్‌రోడ్డు బ్రిడ్జిని నిర్మించటమంటే ఎంతో గొప్ప సాహసిక చర్య. అయినా వారు ఆ పని

చేస్తామని అంగీకరించారు. రైల్‌రోడ్ కంపెనీవారి ఉన్నతో ద్యోగి నదిని దాటవలసిన ప్రదేశాన్ని పరిశీలించటానికనివచ్చి అక్కడ పడవేసి వున్న పోత యినుము దూలాలను చూసి ఆశ్చర్యంతో అన్నాడు. "ఇవి ఓహియో నదిమీాద వెళ్ళ వలసిన బండ్లను మోయటం ఎలా వున్నా తమ బరువును తాము మోసుకోగలవని నేను భావించటంలేదు."

కానీ అతడు పొరబడ్డాడు. దాన్ని తిరిగి కావలెనని తీసి వేసేటంతవరకూ ఆ వంతెన అనేక సంవత్సరాలు రైలు బండ్ల రాకపోకలకు తట్టుకున్నది. ఏమైనా బ్రిడ్జి కంపెనీ ఈ పని చేసిన కొద్దికాలం తరువాతనుంచి వంతెనలను నిర్మించ టానికి దుక్క ఇనుమునే ఉపయోగించింది. మొదట పై అర్ధచందాకారాలకు (Chords) తరువాత మిగిలిన మరి కొన్ని భాగాలకు ఈ దుక్క ఇనుమును ఉపయోగించారు.

పెట్టుబడిదారులు ఎంతో లాభం వస్తుందనుకున్నారు కానీ కరెన్సీకి ఉల్బణం రావటం వల్లను, యుద్ధ సమయం కనుకనూ ఖరీదులు విరివిగా పెరిగిపోయినవి. వారి ఆయవ్యయ పట్టికలో తుది పంక్తిని ఎర్ర సిరాతో వ్రాయవలసి వచ్చింది. అంటే ఏమీ మిగలలేదన్నమాట ! ఈ పరిస్థితిని గమనించి పెన్సిల్వేనియాలోని అధ్యక్షుడు ఎడ్గర్ థామ్సన్, తన స్వంత బాధ్యతమీాద, కీస్టోన్ కంపెనీకి నష్టం లేకుండా మరికొంత అదనంగా మంజూరు చేయించాడు. అతి తీక్షణమయిన కృత జతాదృష్టి గల కార్నెగీ ఈ కారణం వల్లనే తరువాత పది

సంవత్సరాలకు తాను ప్రారంభన మొదటి ఉక్కు కర్మాగారానికి మిస్టర్ థామ్సన్ పేరు పెట్టటం జరిగింది.

ఇరవై మో శతాబ్దపు పన్ను రేట్లతో పోల్చి చూచునుంటే దాని తరం చాలా తక్కువే అయినా అంతర్యుద్ధం తెచ్చి పెట్టిన రాబడి పన్నుపోను 1861 లో ఆండ్రూ కార్నెగీ ఆదాయపట్టిక 47,860,67 డాలర్లు అతని రాబడి అయినట్లు చూపించింది. ఈ మొత్తం ఆశ్చర్యకరమైంది. అందులో యిది ఇరవై యేడేళ్ళ యువకుడి ఆదాయం కావటం ఎంతో విశిష్టమైన విషయం. యిందులో అతనికి డివిజన్ సూపరింటెండెంటుగా వచ్చిన జీతం ఇరవై నాలుగు వందల డాలర్లు మాత్రమే. ఇందులో మరింత భాగాన్ని అతనికి నూనెమీంది పెట్టుబడి తెచ్చిపెట్టింది. అతని స్లీపింగు కార్, క్రీస్టోన్, ఆడమ్స్ ఎక్స్ప్రెస్ మొదలైన పెట్టుబడులు కూడా తగినంత రాబడిని ఇచ్చాయి మిగిలిన ఆదాయం అతనికి యితరమైన పెట్టుబడులవల్ల వచ్చింది. అతడు నిజంగా "రూపొందుతున్న స్కాచ్ వాడు" అయినాడు. ఆనాటి ఇతని తైలవర్ణ చిత్రం పదకొండు సంవత్సరాలకు పూర్వం తీసిన ఛాయా చిత్రపటంలోవలె అదే నిగనిగల కాంతమైన ముఖాన్ని ప్రదర్శిస్తున్నది. అతని జుట్టు కొంచెంగా నల్లబడ్డది. సొగసైన చిన్నిగడ్డం చేకూరింది.

అతని ఆదాయంలో మరొకపద్దు నలభై రెండువందల యాభై డాలర్లు "క్లోమన్"నుంచి వచ్చింది. ఇది కార్నెగీ ధనసంపత్తిని పెంపొందించిన మరొక వ్యాపారసంస్థ. ఈ

సంస్థలోనుంచి వచ్చిన ఆదాయం అతడు తమ్ముడికోసం పెట్టు బడి పెట్టిన దానిమీద వచ్చినది.

ఆండ్రూ క్లోమన్ శక్తిమంతుడు. కానీ సుస్థిరచిత్తం కలవాడు కొంచెం తగాదా మారి వాడు. మంచి జర్మన్ మెకానిక్. క్లోమన్‌కు అలిఘనీలో ఒక ఫౌండరీ వుంది, ఇతని ఇరుసులకు ఎంతో ప్రఖ్యాతివచ్చింది. యుద్ధం ప్రారంభం కావటంచేత ప్రభుత్వం ఇతడికి చాలా ఆర్డర్లిచ్చింది. అయితే యితడికి తన వ్యాపారాన్ని వృద్ధిచేసుకోవటందుకు తగిన వస్తు సంపత్తి, ధనసంపత్తి లేవు.

టామ్ మిల్లర్ యితనికి తోడయినాడు. ఇరువురూ కలిసి చిన్న కార్ఖానాను స్థాపించారు.

కార్నెగీతో "ఆండీ! నిన్ను కూడా ఇందులోకి తీసుకు రావాలని నా కోరిక కాని క్లోమన్ దీనిని భగ్నంచేశాడు. అతడికి నీవంటే భయం. నీవు ఇందులో చేరితే మొత్తం నీ పరం చేసుకొంటావనీ, లేదా నీపరం చేసుకోటానికి ప్రయత్నం చేస్తావనీ అతని అభిప్రాయం" అన్నాడు మిల్లర్.

ఆ పరిహాసాంశాన్ని గురించి వాళ్లు నవ్వుకున్నారు. అప్పుడు వాళ్ళిరువురూ ఎంత త్వరలో ఆండీ ఇనుము వ్యాపారంలో ప్రవేశించనున్నాడో అణుమాత్రమయినా ఊహించ లేదు.

యుద్ధశాఖ ఇరుసులకు, ఫిరంగి బండ్లకు విపరీతంగా ఆర్డర్లిస్తున్నది. వీటికే కాకుండా ఇతరమయిన వాటికికూడా

ఆర్డర్లు ఊరికే వచ్చిపడుతున్నవి. ఒకరోజున ఫిప్స్—జాన్‌కు చిన్నతమ్ముడు ఇతడు తరువాత కొద్దిసంవత్సరాలకు చని పోయాడు-మిల్లర్ ఆశపడుతూ "నాకు ఇనుము వ్యాపారంలో ప్రవేశించాలని వుంది. అయితే యెలా సాధ్యమౌతుందో బోధపడటంలేదు" అన్నాడు.

టామ్ సొగసుగా మీసాలనుగుంజుకుంటూ కొద్దిసేపు ఆలోచించాడు. అతనికి హెన్రీ, ఇంకా బాగా వయసు చేకూరనివాడు, ఒకరోజు "నాకు ఒక క్వార్టరు బదులు ఇస్తావా" అనిఅన్ననడిగి తెచ్చుకొనిస్వంతవ్యాపారాన్ని ఎలా ప్రారంభించుకొన్నాడో స్మృతికి వచ్చింది. అన్న ప్రశార్థకంగా తనను చూచినప్పుడు హెన్రి "ఇది అత్యవసరమయినది" అన్నాడు.

జాన్ ఆ క్వార్టరును సందేహించకుండా ఇచ్చాడు.

మర్నాడు 'డిస్పాచ్' పత్రికలో 'కావలెను' అన్న ప్రకటన కనిపించింది. "ఉత్సాహవంతుడయిన కుర్రవాడు ఏదైనా పనికోరుతున్నారు." ఏమాత్రం దాపరికంలేని ఈ చిన్న ప్రకటనకు ఒక వ్యాపారసంస్థ సమాధానమిచ్చింది.

అది అతనికి 'ఎర్రండ్ బాయ్'గా వుద్యోగమిచ్చింది. తలిదండ్రుల ఒప్పుదలతో అతడు బడి విడిచిపెట్టి ఆ పనిలో చేరాడు. ఆనాటినుంచి అతడు ఒక్క-రోజునుకూడా వృథాగా పోనివ్వలేదు. ప్రస్తుతం అతడు ఒక పౌడరు కంపెనీకి బుక్కీ-ప రుగా పనిచేస్తున్నాడు. ఒకమాటు "వయసు ఇరవయి సంవ త్సరాలు, నేను ఇంకా ఎందులోనూ ప్రవేశించలేదన్నాడు

జీవితమంతా భగ్నమయిన ఒక వృద్ధిడిలా ఆవరించిన నిరా
శతో.

టామ్ మిల్లర్ మళ్ళీ ఒకమాటు పరికించాడు. హెన్రీని
అతడు బాల్యంనుంచి చూస్తూనే వున్నాడు. మంచి తేజస్సు,
ప్రతిభ, న్యాయ తత్పరతగల యువకుడుగా తోచాడతనికి.
పైగా అతడు తనకు బహుకాల ప్రియమిత్రుడయిన జాక్ కు
సోదరుడు.

"పెట్టుబడికి నీదగ్గిర డబ్బేమయినా వుందా?" అని
అడిగాడతడు.

"లేదు" అన్నాడు హెన్రీ. "అప్పుడప్పుడు కొద్ది
కొద్దిగా జీతంలోనుంచి మిగుల్చుకొన్నాను. కానీ ఆ
మొత్తాన్నీ నా కుద్యోగమిచ్చిన వాడి వ్యాపారంలో పెట్టు
బడిపెట్టాను."

క్లామన్ అండ్ కంపెనీలో ప్రవేశించటం నీ కిష్ట
మేనా!

"నా చేతిలో విడిగా డబ్బున్నట్లయితే తప్పక ప్రవేశి
స్తాను. కానీ లేదని నిరాశతో చేయిచాచాడు.

"నేను నీకు కొద్దిగా అప్పిస్తాను" అన్నాడు మిల్లర్.
ఆ వ్యాపారం స్థితి ప్రస్తుత మిలావుంది. ఎనిమిదివేల డాలర్ల
మూలధనంతో మా సంస్థ స్థాపితమైంది. అయితే దాన్ని
అంతా చెల్లించలేదు. వ్యాపారపు టవసరాలు పెరుగుతున్న

కొద్ది దఫాలువారీగా చెల్లించవలెనని చార్టరులో వుంది. కంపెనీ కొత్త యంత్రాలకోసం కొంతఖర్చు పెట్టవలసివుంది. నా దగ్గిర డబ్బు విశేషంగా లేదు. కొద్ది వందలతో నిన్ను అందులో ప్రవేశపెట్టిస్తాను."

ఫారీ కృతజ్ఞతపూర్వకంగా ఈ మేలుకు అంగీకరించాడు వృద్ధిపొందుతూ. నిశ్చయంగా లాభాలొచ్చే వ్యాపారంలో తనకోసం పెట్టుబడి పెట్టుకోడానికి వినియోగించుకోకుండా దయాళువయిన టామ్ తన దగ్గరవున్న పదహారు వందల డాలర్లలో ఫిప్స్‌కు ఎనిమిదివందల డాలర్లు, విలియం అలెగ్జాండర్లకు ఎనిమిదివందల డాలర్లు అప్పిచ్చాడు. విలియం అలెగ్జాండరు ఇద్దరూ ఒకనాటి "బాటమ్ హూపియర్లు" బాల్యంనుంచి అంత సన్నిహితమయిన అనుంధం వుండి ఒకరియెడ మరొకరికి అంత శ్రద్ధాశక్తులుగల యువకవర్గాన్ని మరొకచోట చూడటం చాలాకష్టం.

గణకుడుగా వుండే యువ ఫిప్స్ క్లోమన్ అండ్ కంపెనీలో ప్రవేశించాడు. పౌడర్ కంపెనీలో పగలంతా పనిచేసిన తరువాత కొద్దిగా భోజనంచేసి క్లోమను కార్యాలయానికి పరిగెత్తి సాయంత్రం ప్రొద్దుపోయేదాకా పుస్తకాలలో గడిపేవాడు. అతడు ఆ ఆఫీసువెళ్ళేటప్పుడు,అతనితో సమవయస్కుడయిన టామ్ కార్నెగీ అతనివెంట నిత్యం తప్పనిసరిగా వెడుతుండేవారు. వారు డేవిడ్ జోనాథన్‌లలా అన్యోన్యం అతి సన్నిహితులు. కొన్నినెలలయినతరువాత క్లోమను కంపెనీకి మరికొంత డబ్బు కావలిసివస్తే తమ్ముడిపేరుతో ఆంద్రూ

కార్నెగీ ఆ డబ్బు నిచ్చాడు. అందువల్ల అతడు ఆ సంస్థలో భాగస్తుడైనాడు అతి శీఘ్రకోపి, అనుమానగ్రస్తుడు అయిన క్లోమన్ కలతలుపెట్టె ధోరణిలోనే ఉంటూవచ్చాడు. ఎవరో తన్ను మోసగించటానికి యత్నిస్తున్నారన్న భయంతో దీనికి తరువాత కొద్దికాలంలోనే అతడు అందరికీ చెందే ఒక తగాదాను పట్టుకొచ్చాడు. థామస్ యన్ మిల్లర్ తనఇనుము సంస్థలో భాగస్థుడు కాడని పత్రికల్లో ఒక ప్రకటనచేశాడు. దాంతో విసుకువచ్చి మిల్లర్ ఆ కంపెనీలోని తన షేర్లను అమ్మేశాడు

"టామ్, మనం స్వంతంగానే ఒక రోలింగ్ మిల్లును ఆరంభిద్దా" మన్నాడు ఆండ్రూ కార్నెగీ. "అది మన బ్రిడ్జి కంపెనీకి, ఇతర సంస్థలకు కావలసిన ఇనపసామాన్లను తయారుచేస్తుంది."

"అయితే మనం మీ తమ్ముడు టామ్ కంపెనీతో పోటీ చేయుటమౌతుందేమో" అని అభ్యంతరం చెప్పాడు మిల్లర్ ఇరువురికీ చాలినంత వ్యాపారముంది. వాళ్ళిప్పుడు యుద్ధపు కాంట్రాక్టుల పని చూస్తున్నారు. మనం విశేషంగా బ్రిడ్జీలకోసం కృషిచేద్దాం.

అందువల్ల 1864లో సైక్లోప్స్ ఐరన్ వర్క్స్ ఆరంభింపబడ్డవి. క్లోమనుకు నిజంగా తీవ్రకోపంవచ్చింది. అయితే ఆ కోపాన్ని దిగమ్రింగుకోవలసివచ్చింది. యుద్ధం చివరి దశకు వచ్చింది. సైన్యానికి సంబంధించినఆర్డర్లు సన్నగిల్లిపోవటమే కాకుండా చిన్నవైపోతున్నవి. కొద్దికాలం గడిచాక

అతని భాగస్థులు తమ కంపెనీ సైక్లొప్స్‌తో అంతర్లీనం చేద్దామని సూచించారు. మార్పులు, అభివృద్ధులు తలకెక్క టంత వేగంగా వచ్చేస్తున్నవి అందుచేత తన కిష్ట మున్నా లేకపోయినా యూనియన్ ఐరన్ వర్క్స్ అన్న క్రొత్త కంపెనీ డైరక్టర్ల బల్లముందు టామ్ మిల్లర్ ఆండ్రూ కార్నె గీలతోపాటు అతడు కూర్చోవలసి వచ్చింది

"టామ్, నీవు చింతించేటంతగా నీకు అపచారం జరి గింది. అయితే ఇప్పుడు నీవే విజేతవైనావు" అన్నాడు ఆండ్రు కార్నెగీ

కర్మాగారాలను రెంటిని కలిపివేయలేదు. రెండు విడి విడిగా కూతపెట్టి అతివేగంగా పనిచేస్తున్నవి

యుద్ధపు చివరదశలో అతని రైల్‌రోడ్ ఉద్యోగం పై అధికారులయిన థామ్సన్, స్కాట్‌ల అభిలాషకు భిన్నంగా అంతమొందింది. ఆండ్రూ మార్చి 28, 1865లో రాజీనామా లేఖను అందజేశాడు. ఎవరి మధ్య పనిచేసి తా నెవరి అనురాగాన్ని అనుభవించాడో ఆ పిట్స్‌బర్గు డివిషను లోని వ్యక్తులను ప్రశంసిస్తూ ఒక వీడ్కోలు లేఖ వ్రాశాడు. వారు వీడ్కోలువేళ అనురాగపూర్వకంగా ఒక అందమైన గడియారాన్ని బహుకరించారు. మరొక అలిఘనీ పూర్వ బాలురలలో వాడు బాబ్ పిట్కైరన్ అతని తరువాత ఆ స్థానానికి అధిపతిగా వచ్చాడు. ఏవో డజను ఇతరమైనపనులు తాము అలవోకగా చేసినట్లే కార్నెగీ మిల్లర్లు ఇద్దరూ కొద్ది

యెత్తున పిట్స్‌బర్గులో కొమొటివ్ వర్క్సును స్థాపించారు. అది వీలునుబట్టి మధ్య మధ్య ఒక ఇంజనును తయారు చేస్తున్నది. ఇంతకుపూర్వపు సంవత్సరం కార్నెగీ, అతని ఇరుగు పొరుగైన విలియం కోలిమన్ సరిహద్దుదాటి, ఓహైయోలో ప్రవేశించి మరికొంత నూనెభూమిని కొన్నారు. ఇది చాలా ఫలప్రదమైనది. దీనిమూలంగా క్రొత్త పెట్టుబడులకు ఎంతో ధనం చేకూరింది. తొలిసారిగా రెండు మహా సముద్రాలను రైలుమార్గాలద్వారా కలపివేయటానికి పచ్చికమైదానం, పర్వత శ్రేణిగుండా మార్గాన్ని వేస్తున్న పసిఫిక్ యూనియన్ రైల్‌రోడ్ కంపెనీలో స్టాక్‌నుకొన్నది. ఇందువల్ల లభ్యమైన ధనం వల్లనే 1867 ఆరంభంలో సెయింట్‌లూయీ వద్ద మిసిసిపీ నదిమీద మూడు ఆర్చీలుగల సుప్రసిద్ధమైనవంతెన పనిని కీస్టోన్ బ్రిడ్జి కంపెనీ ఆరంభంచేసింది. దానికి నమూనాను తయారుచేసింది కెప్టెన్ బి జేమ్స్ ఈడ్స్ అయినా కీస్టోన్ కంపెనీవారి మిస్టర్ లిన్విల్లీ పథకాల్లో కొన్ని మార్పులుచేశాడు. తరువాతి శతాబ్దంలో మూడుపాళ్లు గడిచిన తరువాతికూడా ఆ ఇనుపబ్రిడ్జి విస్తారంగా పెరిగిపోయిన రైలుబండ్ల రాకపోకల బరువును,వీథికి సంబంధించిన రాకపోకల భారాన్ని భరిస్తున్నది.

ఈ సమయంలో రచయిత బేయర్డ్ టైలర్ యూరప్‌లో కాలినడకన చేసిన ప్రయాణాలను అభివర్ణించే "వ్యూస్ ఎఫూట్" అన్న పుస్తకం హోమ్‌వుడ్‌లో ఎక్కువ ప్రీతిపాత్రమయి గ్రంథంగా ఉంటుండేది. కార్నెగీ తీవ్రంగా దేశాటనం

చేసినవాడు. ఎన్నో దృశ్యాలను దర్శించినవాడు. చరిత్ర, భూగోళ విజ్ఞానాలంటే ఆసక్తి గలవాడు టైలర్ వంటి అనుభవాలు తనకుకూడా లభించాలని కుతూహలపడ్డాడు. ఒక రోజున అతను జాన్ వాన్‌డివోర్టుతో అన్నాడు. "ఇప్పటి నుంచి నీవు మూడువందల డాలర్లను కూడబెట్టుకొని నాతోపాటు యూరప్‌లో పదయాత్ర చేయటానికి ఖర్చు చేస్తా ?"

"చేస్తావా !" అన్నాడు ఆండీ "బాతు ఈదుతుందా! ఐరిష్‌వాడు వుర్లగడ్డలు తింటాడా !

అనుక్షణం నూనెషేర్ల విలువ రాకెట్లలా పైకిపోతున్నది. జాన్ సలహామీద కార్నెగీ 'బ్లాక్ గోల్డు'లో పెట్టుబడిపెట్టాడు. అది అతివేగంగా ఎంతో డబ్బు నిచ్చింది. వీళ్లు ఇద్దరూ హారీఫిప్స్‌ను ఆహ్వానించారు. అతని కిప్పుడు వీళ్ళతో వెంట వచ్చేందుకు కావలసిన డబ్బున్నది. వసంతారంభంలో స్టీమరు రెక్కారు.

సంవత్సరాలు గడుస్తున్నకొద్ది కార్నెగీ మధ్య మధ్య దీర్ఘమైన సెలవలు పుచ్చుకుంటూ, ధనాన్ని సంపాదించుకుంటూ, పెద్ద పారిశ్రామిక సామ్రాజాన్ని నిర్మించుకుంటూ, న్నాడు పెట్టిన సెలవలను విశేషంగా దేశాటనతో గడిపివేస్తున్నాడు. అతను రచనల్లో, ప్రసంగాలలో, చేసేచేతల్లో తన జీవితానికే కాదు ఏ మానవుని జీవితానికైనా ప్రధాన లక్ష్యం ఇనుము, లేదా ఉక్కు, లేదా మరొకటి ఏదైనా

వృత్పత్తి చేయటం కాదు. సమగ్రమైన బుద్ధి వికాసాన్ని, వుత్తమ శీలాన్ని సంపాదించటం మానవజాతి సంక్షేమం కోసం తన సంపదను వినియోగించటము అని స్పష్టంచేశాడు.

దేశంలో వున్నప్పుడు కష్టపడి, సత్య సంధతతో పని చేశాడు అయితే అతడిక మరణపర్యంతం పనిచేయాలన్న ఉద్దేశ్యంలేదు. కొద్ది జీతంకోసం వారానికి ఆరు రోజులు, కొన్ని సందర్భాలల్లో ఏడురోజులు గంటలతరబడి తాను శ్రమపడటాన్ని అతడెన్నడూ మరచిపోలేదు. ఇప్పుడాతడు తన ఆత్మకు పుష్టిని చేకూర్చుకోటానికి పూనుకున్నాడు. వాళ్ళమీద విడిచిపెట్టి ఎక్కడకయినా తాను నెలల తరబడి వెళ్ళినా సామర్థ్యంతోను, సత్య సంధతతోను వ్యాపారాన్ని నడిపించగలనన్న వుద్యోగివర్గం అతనికుంది అట్టిది తనకు చేకూరిందని తన్ను గురించి తానెప్పుడు గర్విస్తుండేవాడు. తనకు సహచరులునుగా స్వీకరింపదగ్గ శక్తి విశ్వాసపాత్రతగల వ్యక్తులు చాలామంది తన బంధువర్గంలోను బాల్య స్నేహితులలోను వుండటమనేది నిజంగా అతని అదృష్టం. అతడు వ్యాపారధోరణులు భవిష్యత్తులో ఎలా వుండబోయేది. వర్తమానంలో ఎలా నడుస్తున్నదీ గమనించటం ఎన్నడు మానివేయలేదు.

ఫిప్సుకు బంధువయిన జాన్ ఫ్రాంక్స్ లివర్ పూల్ వద్ద ఈ మగ్గురు యాత్రికులను కలుసుకొని ఆ యాత్రికబృందంలో చేరుకున్నాడు. నిత్యమైన యువకోత్సాహంతో తరువాత ఈ యాత్రిక చతుష్టయం ఇంగ్లండు ఫ్రాన్స్, జర్మనీ,

హంగెరీ, స్విట్జర్‌లాండు, ఇటలీలలో పర్యటనచేశారు. ధరలు పెరిగిపోతుండటం, వెర్రిగా ఆర్డర్లు వచ్చి పడుతుండటం కర్మాగారాలు రెండు అంచలతో పనిచెయ్యటం మొదలయిన విషయాలతో స్వదేశంనుంచి, ఇంటిదగ్గరనుంచి అతనికి వచ్చే వార్తలు ఎల్లవేళల్లో మంచివిగా వుంటుండేవి. యుద్ధానంతరోల్బణం పరిపూర్ణంగా వుంది. ప్రాచీనము, అధునాతనము అయిన చరిత్రను నిర్మించిన ప్రదేశాలలో పర్యటించటం మంచి సంగీతాన్ని వినటం కళాత్మక వస్తు ప్రదర్శనశాలను మతవిషయక మహానిర్మాణాలను, దుర్గాలను సందర్శించటం ఆతడు సంతృప్తితో చేశాడు వెనిస్ నగరంలోని డోజస్ రాజసౌధం మధ్యయుగమందలి వెనిటియన్ ప్రజారాజ్యంలోని ప్రముఖన్యాయాధిపతులుఅతనిలో నిక్షిప్తమయి వున్న సాహిత్యశక్తిని మేల్కొల్పటం జరిగింది. పెద్ద అంతర్మందిరంలో వున్నప్పుడు అతడు తన సహచరులను ముగ్గురను పూర్వం పాలకవర్గ సభ్యులయిన మహాయోగ్యులు వాళ్ళను డోజస్ సింహాసనంలో ప్రాంక్సుఅనేవాళ్ళుకూర్చున్న మహాసనాల మీాద కూర్చుండబెట్టి వారి ముందు నిలవబడి

"Most Potent, grave and renvered signiors.
My very noble and approved goodmasters.

[అతి శక్తిమంతులు, గంభీరులు. గౌరవనీయులయిన ప్రముఖులారా! ఘనతవహించిన ఉదారులయిన, ఉదాత్తులయిన నా యజమానులారా! అంటూ ఆరంభించి ఒథెల్లో చేసిన నివేదనాత్మకోపన్యాసాన్ని]

ఉదాత్తమైన అభినయభంగిమతో వినిపించాడు. యూర వులో ఎక్కడికి వెళ్ళినా అతడు అక్కడి వ్యాపారాలను, పరిశ్రమలను, రవాణారీతులను, పరిశీలించడం మరచిపోలేదు. అందువల్ల ఈ యాత్ర అతనికి వ్యాపారాత్మక దృష్టితో చూసినా ప్రయోజనకారి అయింది. అతడు క్రమంగా పసిఫిక్ సముద్రతీరం వంకకు తోసుకొనివస్తున్న యూనియన్ పసిఫిక్ రైల్‌రోడ్డును గురించికూడా మరచిపోలేదు. అతడు స్కాట్‌కు వ్రాశాడు: "సెంట్రల్ ట్రాన్స్‌పోర్టేషన్ కంపెనీ- ది వ్రూడ్రఫ్ స్లీపర్ కంపెనీ- యూనియన్ పసిఫిక్ కంపెనీ దగ్గరనుంచి స్లీపింగ్ కార్ల కాంట్రాక్టును పొందకూడదా ?" అని రోము నుంచి వ్రాశాడు. "స్కాట్ సమాధానాన్నిస్తూ" యువకుడా నీవు సమయమేదో బహుచక్కగా ఊహిస్తావు (ప్రతిస్పర్థుల ఊహలను సమయానికి కని పెడతావు" అని ఆరంభంచేశాడు. వ్రూడఫ్‌ల కార్లను పోలిన స్లీపింగ్ కార్లకు జార్జి. ఎమ్ పుల్మన్ పేటెంటుపుచ్చుకున్నాడు. అటువంటి పేటెంటుహక్కు అతనికి ఎలా లభ్యమైందని ఎవరికైనా ఆశ్చర్యం కలుగు తుంది. అయితే పేటెంటు కార్యాలయంవారి వర్తన ఊహా తీతంగా వుంటుంది. పుల్మన్‌కూడా యూనియన్ పసిఫిక్ కాంట్రాక్టుల కోసం యత్నిస్తున్నాడు. కానీ రైల్‌రోడ్ కార్యవర్గంవారు మరి రెండు సంవత్సరాలవరకూ ఈ విష యాన్ని నిర్ణయించటం వాయిదా వేశారు.

తమ్ముడు టామ్ అయిదుగురు అందగత్తెలయిన సోదరీమణులలో ఒకతెను, లూసీ కోల్మన్‌ను, వివాహం

చేసుకోవలసి వుంది. "నీవు ఎక్కడ నివసించదలచుకున్నావో నిశ్చయించుకొన్నావా" అని యాత్రనుంచి తిరిగి వచ్చిన తరువాత అతడు తమ్ముణ్ని ప్రశ్నించాడు.

"లేదు" అన్నాడు టామ్.

"ఈ ఇంటిని నీవు పుచ్చుకోటంలో నీ అభిప్రాయ మేమిటి !"

అప్పుడు వాళ్ళు హోమ్వుడ్‌లోని ఇంట్లో ఉదయ భోజనం చేస్తూ భోజనశాలలో వున్నారు.

"ఈ అభిప్రాయం లూసీకి నచ్చితే ఈ ఇల్లు నా కెంతో బాగుంటుంది" అన్నాడు టామ్. "కానీ నీవు ఎక్కడికి వెళ్లుతావు ! న్యూయార్క్‌కు వెళ్లుదామన్న ఉద్దేశం ఇంకా నీలో ఊగిసలాడుతున్నదా!"

"ఔను అది చేయదగ్గ పని కడచిన కొన్ని సంవత్సరాలల్లో ఎన్నో పర్యాయాలు నేను అక్కడికి వెళ్ళిరావటం నీవు గమనించావు గదా ! గ్రేట్‌బ్రిటన్‌కు లండన్ ఎలా కేంద్రమో యునైటెట్ స్టేట్సుకు న్యూయార్క్ అలా సమస్తానికీ కేంద్రం కాబోతున్నది. అక్కడి బ్యాంకర్లు ముఖ్యంగా ఆంగ్లేయ కంపెనీలతో సెక్యూరిటీల విషయంలో దౌత్యాలు నడపమని తరుచుగా నన్ను అడుగుతున్నారు. అందుమూలంగా నాకు మంచి కమీషన్లు వస్తాయి. అమ్మా నేను ఇక్కడికి తరుచుగా వస్తూ పోతూ వుంటాము.

"అయితే, ఆమె కూడా నీతోపాటు వస్తుందన్న మాట" అన్నాడు టామ్.

"ఔను" అన్నది వాళ్ళ తల్లి. "ఇటువంటిది రానున్న దని నేను ఊహిస్తూనే ఉన్నానుగాని రాత్రే ఆండీ ఈవార్త నాకు చెప్పాడు" హోమ్ వుడ్‌ను విడిచిపెట్టి వెళ్ళటం నా కిష్టంలేదు. కానీ అతని క్షేమానికి వుపకరిస్తే విడిచిపెట్టి వెళ్ళ టం నా కిష్టమే."

"నీవు, టామ్, హారీ ఫిప్స్‌ల వంటి భాగస్థులు-మిస్టర్ కోల్‌మన్, పైప్, క్లోమన్‌లను గురించి చెప్పవలసిన పనిలేదు. వుండటంచేత ఇక్కడ ఇక నాతో అవసరంలేదు. అయినా ఇక్కడి విషయాలు యెలా నడుస్తుంటవో నేను కనిపెట్టే వుంటాను" అని అతడు సంభాషణను కొనసాగించాడు. ఇరవయ్యోపడిలోనే ఉన్నా ఆత్మశక్తితో సమర్థతతో కర్మాగారాలను నడిపించే నేర్పుగలిగి వ్యాపారమేధావి అని నిరూపించుకొన్నప్పటికీ టామ్ ఆ విషయాన్ని నవ్వివేశాడు.

లూసీకి టామ్‌కు వివాహమయింది. అది చాలా సంతోషప్రదమయిన వివాహంగా పరిణమించింది. వాళ్ళు హోమ్‌వుడ్ గృహాన్ని తీసుకొన్నారు. ఆండూ్రి, అతని తల్లి న్యూయార్కుకు వెళ్లారు.

న్యూయార్క్ మహానగరంలో కల్లా పెద్దది అందమైనది అయిన సెయింట్ నికొలాస్ హోటలులోఒక వరుస తీసుకొన్నారు. మార్గరేట్ కార్నెగీ నూతన జీవితరీతికి

యథాక్రమంగా అలవాటుపడ్డది. ఆరీతిమీాద పెద్ద పీతిని ప్రదర్శింపక పోయినా తృప్తితో ప్రకటానికి నిశ్చయించు కుంది విశ్రాంతి కోసం ఆమె మొదటి రాత్రి ఘనంగా అమర్చిన శయ్యమీాద వెన్ను వాలుస్తున్నప్పుడు ఇరవై సం వత్సరాలకు పూర్వం ఒక పేద నేతపనివాడు భార్యను, తన ఇద్దరు చిన్న కుర్రవాళ్ళను తీసుకొని అప్పుచేసిన డబ్బుతో అమెరికాకు వలసవచ్చి చుట్టూవున్న అద్భుతాలను వెర్రిగా చూస్తూ న్యూయార్క్ నగరవీధుల్లో వున్నదృశ్యం ఆమెకు తప్పక జ్ఞప్తికి వచ్చిఉంటుంది.

ఆండ్రూ కార్నెగీ వ్యాపారం తన దగ్గరకు వస్తుం దని తన న్యూయార్క్ కార్యాలయంలో కూర్చోలేదు. వెంటనే అతడు అక్కడిమిసిసిపీ నదిమీాదవంతెనలనునిర్మించే టందుకు కాంట్రాక్టులను సంపాదించటం కోసం కెయొకుక్, అమాహాలకు పరుగెత్తాడు. కీస్టోన్ బ్రిడ్జిలను నిర్మించటంలో పోత ఇనుముకు బదులుగా దుక్క-ఇనుమును వాడుకున్న దన్న వాదన చేసి డుబుక్యూ అనే ప్రదేశంలో ఆ మహానది మీాదనే జరుగుతున్న నిర్మాణానికి ఒక బ్రిడ్జిని అమ్మటం కోసం తరువాత సంవత్సరంలో అతడు మరొకమారు మిడ్వె స్టుకు వెళ్లాడు.

1868 ముగియబోతునప్పుడు తన రాబడిన కూడు కోటం కోసం కూర్చు సమయంలో అది 56,110 డాలర్లు అయినట్లు అతడు గమనించాడు. కుర్చీలో వెనక్కు వాలి: కలాన్ని త్రిప్పుతూ, దృష్టిని కొద్దిక్షణాలు గోడమీాద నిలిపి

మనస్సులో కొంతకాలంనుంచి క్రమక్రమంగాఘనీభవిస్తున్న ఒక తీర్మానాన్ని కాగితంమీద పెట్టటంకోసం నిర్ణయం చేశాడు. మళ్ళీ ముందుకు వ్రాలి ఒక విశిష్టమైన విజ్ఞాపిక నిలా వ్రాసుకొన్నాడు.

సెయింట్ నికలాస్ హోటల్, న్యూయార్క్.

డిసెంబర్, 1868.

ముప్పది మూడేళ్ళ వయసు! రాబడి సంవత్సరానికి 50,000 డాలర్లు!! రెండేళ్ళకు, సరిగా ఈ సమయానికి, సంవత్సరానికి 50,000 డాలర్లుకు తగ్గకుండా నా వ్యాపారాన్నంతటినీ చక్కదిద్దుకుంటాను. ఇంతకుమించి సంపాదన చెయ్యను ప్రతి సంవత్సరం అదనంగా వచ్చినదాని నంతటిని ధర్మకార్యాలకు వినియోగిస్తాను. ఇతరులకోసం తప్ప వ్యాపారాన్ని పూర్తిగా పరిత్యజిస్తాను

ఆక్స్‌ఫర్డ్‌లో నివాస మేర్పరచుకొని, ఉత్తమసాహిత్యకులలో పరిచయం కలిగించుకొని విద్యను పూర్ణంగా ఆర్జిస్తాను. ఇందుకు మూడు సంవత్సరాల తీవ్రకృషి అవసరం. ప్రజల యెదుట నిల్చి ఉపన్యాసాలిచ్చే విషయాన్ని గురించి ప్రత్యేక శ్రద్ధ వహిస్తాను. తరువాత లండన్ నగరంలో నివాస మేర్పరచుకొని ఒక వార్తాపత్రికనో, సమీక్షా పత్రికనో పెట్టుబడి పెట్టికొని, ప్రజా వ్యవహారాలల్లో ముఖ్యంగా దరిద్ర జన విద్యాభివృద్ధులకు సంబంధించిన వాటిల్లో పాల్గొంటూ, దాని జనరల్ మేనేజిమెంటుమీద శ్రద్ధ వహిస్తాను.

"మానవుడికి ఆదర్శం అంటూ ఒకటి వుండాలి ధన నిధులను ప్రోగుచేయటంకంటే నీచమైన ప్రతిమారాధనం మరొకటి లేదు. ధనపూజకంటే నైచ్యాన్ని కల్పించేఆరాధన మరొకటి లేదు. చేపట్టిన ప్రతి వ్యవహారంలోనూ నేను అతిఘనముగా చొచ్చుకుపోవాలి. తన వర్తనవల్ల ఉన్నతికి తీసుకుపొయ్యే జీవితాన్నే నేను ఎన్నుకోవాలి. అనతికాలంలోనే ఎక్కువ డబ్బును సంపాదించే మార్గాల నన్నింటిని అన్వేషించటంలోనే బుద్ధి నంతటినీ వినియోగిస్తూ మరింత కాలాన్ని వెచ్చించడ మనేది నిత్యంగా త్రిప్పుకోవటమంటూ లేని రీతిగా నన్ను పడవేసి తీరుతుంది. ముప్పది ఐదవ యేట వ్యాపారాన్ని పూర్తిగా విరమించేస్తాను. రానున్న రెండు సంవత్సరాలల్లో శిక్షణను పొందుతూ, క్రమపద్ధతిలో గ్రంథ పఠనం చేస్తాను.

రెండు సంవత్సరాలల్లో కాదుగదా జీవితంలో ఎప్పుడైనా సరే వ్యాపారిక సమ్మోహనాలనుంచి తప్పించుకోవటం ఎంత కష్టమో అతడు ఆ సమయంలో కొంచెమైనా వూహించలేదు. అతడు వ్యాపారానికి స్వస్తి చెప్పేందుకు ఇరవై ఏళ్లు పట్టింది. అయినా ధనసంపాదన కంటే సంస్కృతి మీదనే విశేషాభిమానాన్ని వెలిబుచ్చే ఈ ప్రకటన నిజానికి సంపద దాన్ని ఆర్జించిన ధనాధిపతిది కాదు, ప్రజా సంక్షేమం కోసం అతని పరంగా వున్న ట్రస్టు. అతడు తన ధనాన్ని గురించి అలాగే భావించాలి అన్న ధోరణితో అతడు తరువాత కాలంలో చేసిన బోధల్లో ఎంతటి మనః

పూర్వకత వుందో అంతటి మనఃపూర్వకతను ప్రదర్శిస్తున్నది. మనుష్యద్వేషులు కొందరిందులో ప్రకటితమైన తత్వాన్ని మోసకారి తనమని అపహాస్యం చేశారు. కార్నెగీ దీనినంతటినీ హృదయపూర్వకంగానే ఉద్దేశించాడు. తన సంపదను అంతటినీ దానం చెయ్యకపోయినా తరువాత కాలంలో చెప్పినదంతా కార్యరూపాన చేసి చూపించే సమయం వచ్చింది.

చదువుకోసం అతడు ఆక్స్‌ఫర్డ్ వెళ్ళలేదు. ఉపన్యాసాలివ్వటంలో, చరిత్ర, తత్వశాస్త్రము, సాహిత్యము, కళలు అన్న అంశాల్లో తనజ్ఞానాన్ని పెంపొందించుకోటానికి ఎంతో కృషిచేశాడు. వ్యాపారంతో బాటు ఆత్మసంస్కృతిని అభివృద్ధి చేసుకోటంకూడా ఒక ఉద్దేశంగా పెట్టుకొని అతడు ఇంగ్లండును ఇదితర దేశాలకు ఎన్నోమారులు యాత్రచేశాడు. అతడ్ని రెంతూ ఆకర్షించటం ప్రారంభించాయి. అంతరాత్మలో ఉన్నత విషయాలమీద ప్రగాఢమైన ప్రేమ వున్నప్పటికీ అతడు వ్యాపారంలో కలుగుతున్న విజయవ్యామోహాన్ని ఎదురోక లేక పోతున్నాడు వ్యాపారానికి స్వస్తి చెప్పటం కోసం కేటాయించుకున్న రెండు సంవత్సరాల్లో అతడు హృదయ పూర్వకమైన తీవ్రకృషి చేశాడు. అతడు, బాల్టిమోర్ ఓహైయో రైల్ రోడ్ పెట్టుబడిదారు, జాన్. డబ్లియు. గారెట్ దగ్గరికి వెళ్ళి హీలింగ్ పార్కర్స్‌బర్గు అన్న రెండు ప్రదేశాల్లో

ఓహాయో నదిమీద కట్టవలసిన రెండు బ్రిడ్జీలకు సంబంధించిన కాంట్రాక్టులను అతడికి అమ్మివేశాడు. చికాగోలో స్లీపింగ్ కార్లను ఉత్పత్తి చేస్తున్న జార్జి యం. పుల్మన్‌ను కలుసుకొన్నాడు. మనుష్యస్వభావం పరిశీలన విషయంలో కించిత్తయినా రోషం లేని తన సహజావబోధ శక్తితో అతనికున్న వ్యాపారిక మహత్తును గుర్తించాడు. కార్నెగీ సహచరులు అతనితో "మనం పుల్మన్ మీదస్వత్వోల్లంఘనం Infringement చేసినందుకు అభియోగం తీసుకురావా" అని తీవ్రధోరణిలో మాట్లాడారు.

"నా అభిప్రాయం అదికాదు. అభియోగాలు న్యాయస్థానంచుట్టూ ఎలా త్రిప్పుతాయో మీకు తెలుసు. డబ్బంతా న్యాయవాదుల పాలు కావటమే జరుగుతుంది. పుల్మన్‌కు చికాగో కార్యస్థానం కావటంవల్ల అతనికి మధ్య పశ్చిమ, దూర పశ్చిమ రైలుమార్గాలతో మనకంటే ఎక్కువ సాన్నిహిత్య మున్నది. అందువల్ల అతడికి మంచి అవకాశం, అంతే కాక ఆ యువకుడు పరిశ్రమ రంగంలో ఘనకార్యాల నెన్నింటినో నిర్వర్తింప నున్న అదృష్టశాలి. చేతనయితం మనం అతనితో చేతులు కలుపుదాం" అని కార్నెగీ వారి అభిప్రాయంతో వ్యతిరేకించాడు.

సెయింట్ నికొలస్ హోటల్ మెట్లముందు 1863లో ఒక వేసగి సాయంకాలం కార్నెగీ, జార్జి పుల్మన్ దరిదాపుగా ప్రక్క ప్రక్కన నడుస్తున్నప్పుడు అదృష్టదేవత చిరునవ్వు

నవ్వినట్లు తోచింది. యూనియన్ పసిఫిక్ డైరెక్టర్లు న్యూయార్క్‌లో కలుసుకొని స్లీపింగ్ కార్ల కాంట్రాక్టు ఇవ్వనున్నారు.

"సుసాయంతనం మిష్టర్ పుల్మన్" అన్నాడు కార్నెగీ ఉత్సాహంతో.

పుల్మన్ "సుసాయంతనం" అన్నాడు చేదుగా. కానీ కార్నెగీ కలవరపడలేదు.

"ఇక్కడ మనం కలుసుకోటం ఎంతో చిత్రంగా వుంది" అన్న గమనిక చేశాడు కార్నెగీ, కానీ అతడి దగ్గర నుంచి అందుకు సమాధానమైనా రాలేదు. క్షణకాలం కలవరపడి తెప్పరిల్లి కార్నెగీ పసివాడిలా నవ్వి "బాగుంది, మన మిద్దరం ఇక్కడే కలుసుకోటం. మన మిద్దరం మనకు మనమే బుద్ధిహీనులను చేసుకొంటున్నామన్న భావం నీకు కలగటంలేదా !" అన్నాడు.

ప్రతిద్వంది అయిన ఆ ఉత్పత్తిదారు ఆగి ఈవిధంగా తన్ను ఎదిరిస్తున్న వ్యక్తిని పరకాయించి చూచి ఐతే నీఉద్దేశ మేమిటి ?" అన్నాడు.

"యూనియన్ పసిఫిక్ వ్యాపార విషయం. దాన్ని గురించి రాగల అవకాశాల నన్నింటినీ పోగొట్టుకుంటూ మన మిరువురమూ ఒకళ్ళతో ఒకళ్ళు పోట్లాడుకోటంలో ప్రయోజన మేముంది !"

ఈ మాట పుల్మన్ బుద్ధి కెక్కింది. "అయితే దీన్ని గురించి నీవేమి చేద్దామంటావు" అని అడిగాడు.

"కలిసి పోదాం" అని కార్నెగీ కొంత బిగ్గరగా అన్నాడు. "నీ బృందము, నా బృందము కలిసి ఒక కంపెనీని స్థాపించి యూనియన్ పసిఫిక్ వారికి ఒక సమిష్టి సూచన నిద్దాము."

"దాని పేరేమిటి ?"

పేరు అతనికి ప్రధానమయిన ప్రశ్న ఔతుందని కార్నెగీకి తెలుసు, సమాధానం సంసిద్ధంగా వుంది. "ది పుల్మన్ పాలస్ కార్ కంపెనీ" అన్నాడు.

మంచులా గడ్డకట్టి వున్న మోము వెంటనే వికసించింది. "నా గదిలోకి రా, మాట్లాడుకుందా"మని ఆహ్వానించాడు.

ఇలా ఆ వ్యాపారాన్ని సాధించటం జరిగింది. సుస్వభావం గల థియోడోర్ వూడ్రఫ్, క్రొత్త కంపెనీకి పేరు పెట్టటాన్ని గురించి కొంచెం అనిష్టం వ్యక్తంచేసినా. ఇలా కలిసిపోవటంవల్ల కలిగేటందుకు వీలున్న ఆర్థిక ప్రయోజనాలను చూపించి చెప్పుకొన్నప్పుడు, ఆ పథకాన్ని అంగీకరించాడు.

కానీ చివరకు ఉక్కు కార్నెగీని తన పాశాలల్లో కట్టి పడేసింది. కొద్ది పరిమాణాలల్లో ఉక్కును తయారుచేయుటం పూర్వంనుంచీ జరుగుతూనే వుంది. రైలుపట్టాలు వంటెన

దూలాలు వంటి పెద్ద పెద్ద వస్తువులను తయారు చేసేటందు అనువుగా ఇంగ్లండులో హెన్రీ బెస్సిమర్ ఒక క్రొత్త విధానాన్ని కనిపెట్టేటంత వరకూ ఉక్కు వుత్పత్తి యెంతో నెమ్మదిగా జరుగుతుండేది, అప్పుడది యెంతో కష్టమయిన పని, నిజంగా ఒక కళ. యిప్పటికి ఆంధ్రా భవిష్య జీవితము నిశ్చింతగా రూపొందింది.

# ఉక్కు యుగం

౧

అంతర్యుద్ధ సమయం వరకూ అమెరికాలో రైలు బండ్లు ఇనుప పట్టాలమీదనే నడుస్తుండేవి. ఉక్కు పట్టాలు తొలిసారిగా 18౬౩లో ఇంగ్లాండునుంచి దిగుమతి అయినవి. అయితే యుద్ధం ముగిసిన తరువాత అమెరికాలో ఇనుమును ఉత్పత్తిచేసేవాళ్లు తమ దృష్టిని బెస్సిమర్ విధానం మీదికి మార్చారు. బాండ్ల అమ్మకంకోసం కార్నెగీ ఇంగ్లండుకి రాకపోకలు సాగిస్తున్నప్పుడు ఒక సందర్భంలో ఉక్కు-ఉత్పత్తిని స్వయంగా చూడటం తటస్థించింది. అంతవరకూ అతడికి ఉక్కు విషయంలో ఆసక్తి లేదు. చూడగానే అతడికి ఉద్రేకం కలిగింది. న్యూయార్కులో ఓడదిగి రేవునుంచే అమాంతంగా పిట్స్‌బర్గు చేరుకున్నాడు. తన సంస్థలోని భాగస్థులను మహోల్లాసంతో యిలా హెచ్చరించాడు.

"ఇనుముకు కాలం చెల్లిపోయింది. ఉక్కు! ఇకఉక్కే రాజు! మనం ఉక్కు పట్టాలను తయారుచేయటం మొదలు పెట్టాలి. వెంటనే మొదలుపెట్టండి!"

మందకొడి అయిన క్లోమన్ తన అభిప్రాయానికి అడ్డు చెబుతారు కార్నెగీ ముందే ఊహించాడు. కానీ తన ఇతర భాగస్థులు — తన సోదరుడు టామ్‌తో సహా -- తన్ను కాదంటారని అతడు అనుకోలేదు ఏమైనా వాళ్ళందరికీ ఇనుమంటే ఇష్టం. తమ అలవాట్లను, అభిప్రాయాలను అంత హఠాత్తుగా మార్చుకోలేరు. వాళ్ళు అప్పుడే ఒక క్రొత్త కొలిమిని నిర్మించారు. టామ్‌భార్య గౌరవార్థంగా దీనికి 'ది లూసీ' అని పేరు పెట్టారు దీని నిర్మాణానికి ఎంతో పెద్ద మొత్తం వ్యయమైంది. ఎంతకూ భాగస్థుల్లో — ముఖ్యంగా టామ్‌లో, చలనం కలుగలేదు. వాళ్ళందరూ ఎక్కువ తాపీ అయినవాళ్ళు. ఆండూ అకారణంగా ఉద్రిక్తు డవుతున్నా డన్న భావం వాళ్ళకు కలగక తప్పలేదు. ఆండ్రూ విజయానికి అతని ప్రతిభ, దృఢమైన కృషి ఎంతగా కారణాలలో అదృష్టంకూడా అంతగా హేతువని అతని సమకాలికుల్లో కొందరు నిరంతరం విశ్వసిస్తుండేవారు. సోదరుని నూతన భావాలను అనుసరించి వ్యవహరించటానికి తానుఅన్ని వేళలా సంసిద్ధుడు కాకపోయినప్పటికీ విషయమేమో టామ్ బాగా తెలుసుకున్నాడు.

“ఆండీ ! త్వరపడకు. ఉక్కును గురించిన ఉద్దేశం ప్రస్తుతం ఎంతో విశేషంగా వుంది. అది ప్రమాదకరం. ఇక ఇనుమా ! అన్ని అమెరికన్ పరిశ్రమలకూ అది పునాది. ఇంకా కొంతకాలం అది అలాగే వుండి తీరుతుంది. మన వ్యాపారమార్గంలోంచి కానివానికోసం మనం అధిక ధనాన్ని

క్రమ్మరించట మెందుకు ?" అని సుఖంగా కుర్చీలో వెనక్కు వ్రాలుతూ అతడు సలహా యిచ్చాడు

ఇతర భాగస్థులంతా టామ్‌తో ఏకీభవించారు. ప్రయోజనం లేక వాగన కొంత సాగించినవిమ్మట ఆండ్రూ అన్నాడు. "సరే, నన్ను మీరు అనుసరించలేకపోతే నేను క్రొత్త భాగస్థులతో ఒక బృందాన్ని కల్పించుకొని మరొక ప్రత్యేక సంస్థను ప్రారంభించవలసి వుంటుంది."

"అహాఁహా అది కాదు ఆండీ ! నేను నీ పథకంలో కొంత పెట్టుబడి పెట్టననటం లేదు. మిగిలిన మనవారు కూడా అందులో కొద్ది కొద్దిగా పెట్టుబడి పెడతారు. కాని మన ప్రస్తుతసంస్థ ఈ పనికి పూనుకోవడం నాకు ఇష్టం లేదు. అంతే" అన్నాడు వెంటనే అందుకొని టామ్.

"బహుశః నీ వన్నది సమంజసమైనదే కావచ్చు" నని ఆండ్రూ అంగీకరించాడు.

అందువల్ల అతడు మరొక క్రొత్త బృందాన్ని సమకూర్చుకున్నాడు. హోమ్‌వుడ్ ఇనుగు పోగు లైన్ కోల్మన్ స్టుసార్టుటు, రైలురోడ్డు కార్యకర్త అయిన థామ్సన్, స్కాట్‌లు ఆరబెట్టిన సరుకుల గుత్తవ్యాపారి మెకాండ్లెస్‌లు ఉన్నారు. వీరందరిలో మెకాండ్లెస్ ప్రధానభాగస్థుడు' కార్నెగీ కుటుంబం పూర్వం రెబెక్కా వీధిలో అతి దారిద్ర్యదశను అనుభవిస్తున్న దినాల్లో ఆంట్ ఐట్కిన్ ద్వారా మెకాండ్లెస్ వారికి అప్పు కావలసివస్తే ఇస్తానని మృదువుగా కబురు చేశాడు. అప్పుడు ఆ అప్పు అవసరం లేదని చెప్పటం జరిగింది. కానీ, ఆ సమయంలో మెకాండ్లెస్

చూపించిన అనుగ్రహాన్ని ఆండ్రూ ఎన్నడు మరచిపోలేదు.

కార్నెగీ కొత్తగా స్థాపించిన సంస్థలో ఆతని ఇనుము సంస్థలో ఉన్న భాగస్థులందరూ స్వల్పంగా పెట్టుబడులు పెట్టారు. ఈ కొత్త సంస్థకు సోదరుడు టామ్ స్థల నిర్దేశంచేశాడు. ఇది పిట్స్‌బర్గునుంచి మోనోన్గ్ హేలాకు పైన, పన్నెండుమైళ్ళదూరాన, బ్రాడ్డాక్ గ్రామందగ్గరవుంది. 177 లో ఫ్రెంచి - ఇండియన్ సైన్యం బ్రిటిష్ సైన్యాధికారి జనరల్ బ్రాడ్డాక్‌ను పరిపూర్ణ వినాశాన్ని పొందేటట్లు ఓడించి చంపివేసింది ఇక్కడే. ఈ ప్రదేశంలో వుండటంవల్ల ఉక్కు కర్మాగారానికి రెండు రైలుమార్గాలు, మోనోన్గ్ హేలా ద్వారా ఓహైయో నది అందుబాటులో వుంటవి.

కార్నెగీ దీనికి "రైల్‌రోడ్డుకాలంనాటి నా పూర్వ మిత్రుని గౌరవార్థం 'ఎడ్గర్ థామ్సన్ స్టీల్ వర్క్స్' అనిపేరు పెడతా" నన్నాడు. థామ్సన్ సంస్థలో పెద్దమొత్తం పెట్టుబడిపెట్టాడు. అయినా అతడు ఈ అభిప్రాయానికి సుముఖత చూపించలేదు. "ఆండీ! అమెరికన్ ఉక్కు పట్టాలతో నా పేరుకు సంబంధం వుండటానికి నేను ఎంతవరకూ ఇష్టపడుతానో నాకు బోధపడటంలేదు ఇంతవరకు తయారైనవి ఎవరికీ గౌరవ మిచ్చేటట్లు లేవు." అన్నాడతడు.

అందుకు అభ్యంతరం చెబుతూ కార్నెగీ "థామ్సన్! మనం మంచి పట్టాలను తయారుచేయబోతున్నాము. ప్రపంచంలోని ఇతర దేశాలల్లో ఉక్కును ఎంతబాగా తయారుచేయటానికి వీలుందో ఈ దేశంలోకూడా అంతగా అవకాశ

ముంది. కీస్టోన్ వంతెనలకు, క్లోమన్ ఇరుసులకూ వచ్చినంత కీర్తిని మన ఇనుప పట్టాలకుకూడా సంపాదించగలమని నా అభిప్రాయము" మన్నాడు

చివరకు థామ్సన్ తన పేరు పెట్టటానికి అంగీకరించాడు. 1873లో ఆర్థికమాంధ్య భయోత్పాతం దేశంమీద వచ్చి పడేనాటికి కర్మాగార నిర్మాణం అట్టే సాగలేదు. అనేకమంది విమర్శకులు "ఆహా! పొంగులువారిన ఆండ్రు కార్నెగీ అదృష్టం చివరకు అతనికే ఎదురుతిరిగింది. ఈ దెబ్బతో అతడు నాశనం కాకతప్పదు" అన్నారు. కార్నెగీ తన 2,50,000 డాలర్ల ధనాన్ని ఈ పథకంలో పెట్టుబడి పెట్టాడు ఇందులో అధికాంశం అతనికి బాండ్లు అమ్మకం వల్ల, కమీషన్లవల్ల చేకూరిన ధనం. విధి విలాసంకొద్దీ తన దాన ధర్మ కార్యక్రమాన్ని ఆరంభించటంకోసం అతను ఈ సంవత్సరాన్నే ఎన్నుకొన్నాడు. అతని స్వదేశంలోని డన్‌ఫర్మ్‌లైన్‌లో ఒక ప్రజా స్నాన గృహదానంతో ఈ కార్యక్రమం ప్రారంభమైంది. ధనంకోసం పుల్మన్ సంస్థలోని పెట్టుబడులను, ఇతర రక్షణ నిధులను అమ్మివేశాడు. కర్మాగార నిర్మాణ పరిపూర్తికి మరికొంత ఆలస్యమైంది. కానీ ఎక్కువ కాలం గడవలేదు అప్పటినుంచి అతడు ఉక్కు ఇనుముల మీదనే దృష్టిని కేంద్రీకరించటంకోసం ఇతరత్రా తనకున్న వాటాలను అన్నింటినీ ఒకదాని తరువాత ఒకదాన్ని అమ్మివేశాడు అతడు. "నా మంచి గుడ్లను అన్నింటినీ ఒక గంపలోకి చేర్చి ఆ గంపనే చూచుకొంటూ వుండటం వివేచనగల విధానమని నేను నిర్ణయం చేసుకొన్నాను" అన్నాడు.

కార్నెగీ ఇప్పటికే ఒక రైలు మార్గానికి సంబంధించిన పెట్టుబడి విషయంలో చిక్కుబడ్డాడు. అది కొంతగా అతనికి వ్యధ కలిగించింది. అతని పూర్వమిత్రుడైన స్కాట్ చేసిన నిర్బంధంవల్ల ఆతాడు రూపొందిస్తున్న టెక్సాస్ అండ్ పసిఫిక్ రైల్‌రోడ్ సంస్థలో 2,50,000 డాలర్లు పెట్టుబడి పెట్టాడు. ప్రస్తుతం ఆ సంస్థ దివాలా తీసే పరిస్థితిలో వుంది. పెద్దమొత్తం దానికి అప్పు తేలింది. న్యూ ఇంగ్లండులో పుట్టిన జూనియస్ యస్. మోర్గన్ లండన్‌లో బ్యాంకరగా వున్నాడు. అతనికే ఈ సంస్థ అప్పు తీర్చాలి. కార్నెగీకి అతనితో ఎన్నోలావాదేవీలు ఉంటుండేవి. అతనికి టెక్సాస్ అండ్ పసిఫిక్ రోడ్ సంస్థ బాకీపడ్డ మొత్తం పెద్దది. అతడు కార్నెగీ కనక హామీ ఇచ్చి సంతకం చేసేటట్లయితే ఋణపత్రాన్ని తిరిగి వ్రాయించుకొంటానన్నాడు. కానీ, కార్నెగీ అందుకు నిరాకరించాడు.

"ఆండీ! వాళ్ళకు అండగా వుండటానికి అంగీకరించక నీ పూర్వ మిత్రులందరికీ వినాశనాన్ని తెచ్చిపెడితావా" అని స్కాట్ కార్నెగీని నిందించాడు.

దీనికి ప్రతిగా సమాధానమిస్తూ "సరే, ఈ వినాశం నీ బృందానికి గాని, నా వ్యాపారానికిగాని, నా భాగస్థులకు గాని, వారి కుటుంబాలకుగాని సంబంధించింది అయితే యీ సమస్య విషయంలో నేను అనుకూలమైన నిర్ణయము చేసి తీరవలసిందే. స్కాట్! మిక్కిలి తక్కువ మూలధనంలో రైల్ రోడ్ నిర్మాణానికి దిగవద్దనీ, యతాత్కాలికంగా పుట్టిన అప్పులమీద ఆధారపడి

వేయిమైళ్ళ రైలు పట్టాలను వెయ్యనద్దనీ నీకు బోధించటా నికి నేను ఎంతో యత్నించాను. అయినా, నా మాటలు నీవు విన్నావు కావు. తరువాత నేను యూరప్‌నుంచి తిరిగి వచ్చిన వెనుక నాకోసం 2,50,000 డాలర్లు వాటాలు ప్రత్యే కంగా కేటాయించానని చెబితే ఏదో పూర్వమైత్రిని పురస్క రించుకొని సరేనని ఒప్పుకున్నాను ఇప్పటికీ టి. అండ్ పి. సంస్థ కాలక్రమేణ లాభసాటిగా పరిణమిస్తుందనే నా విశ్వా సం. అయినా, ఆ ఋణపత్రిమీద నేను సంతకం పెట్టలేను అలా జేస్తే మిల్లులలోని నా పెట్టుబడులకు, నా భాగస్థుల భద్రతకు ప్రమాదాన్ని కల్పించడమౌతుంది. కనుక ఆ పని నేను జేయకూడదు" అన్నాడు

నిస్సంశయంగా ఈ నిర్ణయాన్ని చేసేనప్పటికీ కార్నెగీ ఎదుర్కొనవలసి వచ్చిన ఏ ఆర్థిక సమస్యకూడా ఆతనికి దీని వల్ల కలిగినంతటి వ్యధను కల్పించలేదు. ఈ నిర్ణయం జరి గిన తరువాత స్కాట్‌తో మైత్రి పూర్వంవలె సాగకపోవ టమే ఇందుకు కారణం, ఆర్థికమాంద్య భయోత్పాతం దెబ్బతీస్తున్న ఆ సమయంలో కార్నెగీ ఆ రీతిగా వ్యవహరించ టం న్యాయమే టెక్సాస్ అండ్ పసిఫిక్ సంస్థలో స్కాట్‌తో కార్నెగీకి కూడా సంబంధం వున్న సంగతి అందరికీ విదిత మైన విషయం. కార్నెగీ టెక్సాస్ అండ్ పసిఫిక్ సంస్థకు సంబంధించిన ఋణపత్రాలమీద సంతకాలు చేస్తే అతడు దాని వినాశం లోపలికి ఆకర్షింపబడినవాడౌతాడు. అందు వల్ల పిట్స్‌బర్గులోని ఆతని సంస్థలన్నింటికీ ప్రమాద స్థితి కొనితెచ్చుకున్నవాడవుతాడు, అని ఊహించి కార్నెగీ

కంపెనీలకు ఆర్థిక నిలయమైన ఎక్స్చేంజి బ్యాంకి ఎంతగానో ఆందోళన పడ్డది. ఈ బ్యాంకి కార్నెగీ కంపెనీలకు సంబంధించిన పత్రాలను పెద్ద మొత్తాలకు తన దగ్గిర కుదువబెట్టుకున్నది. అందు చేత ఆ బ్యాంకి డైరెక్టర్లు వెంటనే కనిపించవలసిందని కార్నెగీని పిలిపించారు. తగ్గ సమాధానం చెప్పుకోటం కోసం అతడు అతివేగంగా న్యూయార్కు నుంచి బయలుదేరాడు.

గంభీరమైన ముఖ కవళికలతో కూర్చున్న ఆ డైరెక్టర్ల ముందు హాజరై కార్నెగీ అతి ప్రశాంతంగా యిలా అన్నాడు.

టెక్సాస్ అండ్ పసిఫిక్ కంపెనీలోని రెండు వందల యాభై వేల డాలర్ల వాటాలకు నేను యజమానినైన మాట సత్యం. దీని వంటాటినీ నేను స్వంత ధన మిచ్చి కొన్నాను. ఎక్కడా నేను వారి పత్రాలమీద సంతకాలు పెట్టలేదు.

వారు దీన్ని నమ్మలేకపోయినారు.

"ఒక డాలరు విలువజేసే వారి సాహసిక వ్యాపార పత్రంమీద కూడా నా సంతకం లే"దని గట్టిగా నొక్కి చెప్పి కార్నెగీ వాళ్ళతో ఇంకా ఇలా అన్నాడు. "వ్యాపార ప్రపంచానికి సాహసిక వ్యాపారం (Speculation) వంటి ఘనమైన అభిశాపం మరొకటి లేదని నా అభిప్రాయం. స్టాక్ ఎక్స్చేంజి ద్యూతగృహంకంటే ఇంచుక మంచిది లేదా దానితో తుల్యమైంది." ఈ అభిప్రాయమే అతనికి జీవితాంతము వరకూ నిశ్చలంగా వుంది. "మా సంస్థల సాధన సంప

త్తిని వృద్ధిపొందించుకోటం కోసం. మీ రిచ్చిన అప్పులకు తప్ప నేను ఈ కంపెనీతో సహా బాధ్యత వహించిన ఋణ పత్రాలు ఏమీ లేవు. నా సంస్థలనుంచి నాకు తిరిగి వచ్చే ప్రతి డాలరును, మీ బాకీలను తీర్చటానికి నా ఆస్తులు చాలునని చూపించటానికి హామీ ఇవ్వటానికి నేను సంసిద్ధుడనై వున్నాను.

"కార్నెగీ ! ఆ ఋణాలను గురించి మాకు అణుమాత్రమయినా ఆందోళన లేదు" అని బ్యాంకి అధ్యక్షుడు బయటపడ్డాడు. ఇదంతా టెక్సాస్ అండ్ పసిఫిక్ కంపెనీ గురించి, వాళ్ళ ఋణపత్రాలమీద నీవు అనుమతి సంతకాలు చేస్తున్నావని మేము విన్నాము" అన్నాడు.

అప్పుడు కార్నెగీ అన్నాడు : "సాహసిక వ్యాపారంతో జోక్యం పెట్టుకొన్న నను, మీకు ఎన్నడూ చూడలేదు. వాల్‌స్ట్రీట్‌లో నేను మీకు ఎప్పుడూ కనిపించను. ఇక ఋణపత్రాలమీద హామీ సంతకం పెట్టటం విషయమంటారా-ఋణా పత్రమెప్పుడు నేను తీర్చటానికి మార్గం స్పష్టంగా కనిపిస్తుంటేనేగాని లేదా చెల్లించలేని స్థితి వస్తే దానికి తగినంత ఆస్తి నాకు వుంటేనేగాని ఏ ఋణపత్రంమీదా సంతకం చెయ్యకూడదని నా దీక్ష. నా పాశ్చాత్య మిత్రుడొకడు అన్నట్లు నడవలేనంతటి లోతున్న నీళ్ళల్లోకి నేను ఎన్నడూ వెళ్ళను."

ఆర్థిక-వ్యాపారిక ప్రపంచంలో కొత్తగా లభ్యమయిన ప్రగాఢ గౌరవంతో కార్నెగీ ఈ సమావేశంనుంచి బయటికి

వచ్చాడు. ఆనాటి ఆర్థిక భయోత్పాతంనుంచి ధ్వంసం కాకుండా బయటపడ్డ ప్రముఖ పారిశ్రామికుడు అతడు ఒక్కడే. ఈ సమయంలోనే చిటికి డబ్బుకు అక్కరకలిగిన తన సంస్థలోని భాగస్థులు కొందరు తమ షేర్లను అమ్మజూపితే అతడు తన పేర వాటిని పుచ్చుకొన్నాడు కూడాను. ఇనుము ఉక్కు పరిశ్రమలు దరిదాపుగా స్తబ్ధస్థితిలో ఉన్న ఆ ఆర్థికమాంద్య సమయంలో కూడా బ్రాడ్డాక్ నిత్యం క్రమాభివృద్ధి పొందుతూనే వున్నది. వస్తుసామగ్రి ఆర్థికమాంద్య సమయంలో చౌకగా వుంటుంది. తిరిగి మంచిరోజులు వచ్చినప్పుడు వ్యాపారాన్ని విజృంభించి ఆరంభించటానికి అతిశయమైన అవకాశం వుంటుంది. మంచిదినాలకోసం ఆగినవాళ్లు వస్తుసామగ్రికోసం అధికధనం వెచ్చించవలసి వుంటుంది. అందువల్ల యంత్రాదికం ఖరీదు పెరిగిపోతుంది, వచ్చేలాభాలు తక్కువౌతవి. డబ్బు వుంటే సంస్థను వృద్ధిచేయటానికి ఆర్థికమాంద్య సమయమే తగిన కాలమన్న అంశాన్ని కార్నెగీ గమనించాడు. అందువల్లనే క్రమంగా ఆ మార్గాన్ని అనుసరించి వ్యవహరించాడు.

కార్నెగీ కుశాగ్ర బుద్ధివల్లనే 1875 లో పనిని తిరిగి విజృంభించి ప్రారంభించినప్పుడు ఎడ్గర్ థామ్సన్ కంపెనీ ఇతరమైన ఉత్పత్తిదారులందరికంటే తక్కువధరలకు పట్టాలను విక్రయించ గలిగింది. అందువల్ల అనేకర్మాగారాలు పని లేక మందకొడిగా నడుస్తున్న దినాల్లో ఈ కంపెనీ ఆర్డర్లను అసంఖ్యాకంగా పొందగలిగింది.

ఉక్కును ఉత్పత్తి చేయటంలో అమెరికాలోని అందరికంటే సమర్థుడైన వ్యక్తి కెప్టెన్ బిల్ జోన్స్. ఇతడు వెల్ష్

జాతివాడు. అంతర్యుద్ధ 'కురు వృద్ధ' ఎడ్గర్ థామ్సన్ కంపె నీతో స్పర్థవహించి పనిచేసే మరొక సంస్థనుంచి ఇతడు యజ మానులు తన సామర్థ్యాన్ని గుర్తించక పోవటంవల్ల విసుగు జెంది బయటికి వచ్చేశాడు. ఇటువంటి వ్యక్తిని కార్నెగీ తన ఉద్యోగిగా సంపాదించటంతో కంపెనీ విజయం మరింత నిశ్చితమయింది.

కార్నెగీ విజయ రహస్యాల్లో మరొకటి వ్యక్తులను గురించి అతనికి ఉన్న అపూర్వ వివేచనాశక్తి. ప్రసిద్ధిగన్న ఒక ఉత్పత్తిదారు అతణ్ని గురించి "ఒక స్థానంనుంచి ఒక వ్యక్తిని ఎన్నుకొని అతనివలన అత్యుత్తమ ప్రయోజనం కలిగే మరొక స్థానంలో అతణ్ని నిలిపే కౌశలం విషయాలో ఇతడు నే కెరిగిన వాళ్ళందరిలోను మేటి" అన్నాడు. "ఇత రులు యోగ్యతను కొద్దిగా గుర్తించటమో లేక అసలే గుర్తింపక పోవటమో జరిగిన వ్యక్తిని కార్నెగీ ఒక ప్రముఖ స్థానంలో నిలపటం నాకు తెలుసు అతడు నిల్పిన వ్యక్తి ఆ స్థానంలో ఏళ్ తాళపు డిప్పల్లాగా ఒదిగిపొయ్యాడు. వ్యక్తు లను ఎన్నుకోటంలో కార్నెగీకి సాటి ఐనవాడు ఉన్నాడని నేను అనుకోను" అని అత డన్నాడు.

"నూతన యంత్ర సష్టనుగా గాని, రాసాయనిక వేత్త నుగా గాని, పరిశోధకుడనుగా గాని, యంత్ర నిర్మాతనుగా గాని నా కొక స్థానమున్నదని అనటానికి నాకు అణు మాత్రమయినా యోగ్యత లేదు." అని కార్నెగీ విస్పష్టంగా చెప్పనే చెప్పాడు అతడికి తెలిసింది యోగ్యులైన వ్యక్తు లను గుర్తించటం, వారివల్ల అత్యుత్తమ సేవలను పొందటం

మాత్రమే. "పొందవలసిన సేవ కేవలం బుద్ధిసంబంధమైనదీ హస్తసంబంధమైనదీ మాత్రమే కాదు" అన్నాడతడు. గణనకు వచ్చేది హృదయసంబంధి ఐన సేవ. అతనిబుద్ధి అతిశయమైన కుశలతతో పనిచేయటానికి ముందే నీవు నీ ఉద్యోగిలోని వ్యక్తిగత నైజస్వభావాన్ని, హృదయాన్ని ఆకర్షించి అధీనం చేసుకోవాలి" అన్నది కార్నెగీ అభిప్రాయం.

ఇప్పటికే కార్నెగీ తన జ్ఞాతియైన డాడ్ హృదయపూర్వకసహకారాన్ని సంపాదించాడు. అతడు డాడ్‌ను 1870 లో సంస్థలోకి తీసుకువచ్చాడు.

డాడ్ ఈనాడు సంస్థతో అవినాభావ సంబంధం గల వ్యక్తి. ఇతరమైన ఇనుప కంపెనీలు, బ్రిడ్జి కంపెనీలు లాగానే కార్నెగీ ఉక్కు సంస్థకూడా తన ఉపయోగంకోసం బొగ్గుగనులను సంపాదించింది. తన కంపెనీ బొగ్గుగనుల్లో వృథాగా పోతున్న పదార్థాన్ని గురించి, చిల్లమును గురించుకోల్మన్ బహుకాలం ఆందోళన చెందాడు. ఒక సందర్భంలో అతడు ఇంగ్లండులో ఉన్నప్పుడు జార్జి లాడర్ అనే వ్యక్తి అతనికి పై విధం వ్యర్థమయ్యే పదార్థాన్ని అంతటినీ పరిశుభ్రంచేసి బొగ్గుకు బదులుగా వాడటం చెయ్యటంకోసం తాను కని పెట్టిన ఒక విధానాన్ని చూపించాడు. దాన్ని చూసి క్లోమన్ మహోత్సాహంతో ఇంటికి వచ్చాడు. "డాడ్! వెంటనే ఇక్కడికి వచ్చి ఆ విధానాన్ని మాకు చూపించాలి" అని కార్నెగీ అతడికి వ్రాశాడు. అతడు వచ్చి అమెరికాలో చిల్లపు బొగ్గును పరిశుద్ధిచేసే మొట్టమొదటి కర్మాగారాన్ని నిర్మించాడు. ఇందువల్ల కంపెనీలకు ఎన్నో నిలవలు చేకూ

రాయి. కంపెనీలోని భాగస్థులందరూ "మనం ఇతడ్ని తిరిగి ఇంటికి వెళ్ళనీయకూడదు" అని కూడబలుక్కొన్నారు. ఆ కారణం వల్ల లాడర్ అమెరికాలోనే నిలచిపోయినాడు. కార్నెగీ సంస్థలో భాగస్థుడయి చివరకు, మహాధనికుడుగా మరణించాడు.

ఉక్కు సైన్యంలో చేరటానికి డన్ ఫర్ మ్లైన్ ఎంతో మందిని చేకూర్చి యిచ్చింది. "మిష్టర్ కార్నెగీ, మీ బంధువొకడు ఇక్కడ పనిచేస్తున్నాడు. మీకు తెలుసునా?" అని ఒకనాడు కర్మాగారంలో నడుస్తున్నప్పుడు సూపరింటెండెంటు కార్నెగీని హెచ్చరించాడు.

"తెలియదే!" అని అతడు ఆశ్చర్యంతో సమాధానమిచ్చాడు.

"పైగా అతడు సిద్ధహస్తుడయిన మంచి యంత్రవేత్త కూడాను. అతడు మీకు జ్ఞాతి అని కొలదికాలం పూర్వం వరకూ నాకు కూడా తెలియదు."

"అతడితో నేను మాట్లాడవచ్చునా?"

"తప్పక" అని సూపరింటెండెంటు కార్నెగీని ఒక యంత్రం పనిచేస్తున్న యువకుడొకడి దగ్గిరికి తీసుకువెళ్ళాడు "ఇదిగో ఇతడే" అని అతడు "టామ్! వీరు మిష్టర్ కార్నెగీ అని పరిచయం చేశాడు.

"నీ పేరేమిటి?" అని యజమాని ప్రశ్నించాడు.

"థామస్ మారిసన్. మా తండ్రి రాబర్టు" అని యువకుడు సమాధానమిచ్చాడు.

"ఏమిటి ? నా జ్ఞాతి బాబ్ !"

"అవును."

"నీవు ఇక్కడికి రావటం ఎలా జరిగింది ?"

"ఇక్కడికి వస్తే మేము బాగుపడగలమని భావించాను."

'మేము' అన్న మాటను తిరిగి ఉచ్చరించి" "ఇంకా నీతో ఉన్నవా ళ్ళెవరు ?" అని కార్నెగీ ప్రశ్నించాడు.

"నా భార్య."

యజమాని అతణ్ని చిత్రంగా పరికించి చూచాడు. "నేను నీకు బంధువును గదా, మొదట నా దగ్గిర కెందుకు రాలేదు ?" అని ప్రశ్నించాడు.

"నీ కొక పరిచయ పత్రాన్ని వ్రాసియిచ్చి వుండే వాణ్ని. ఇంతకంటే మంచి పనిలో చేరే అవకాశం కల్పించి ఉండేవాణ్ని" అన్నాడు.

ఆ యువకుడు "అవకాశం లభించింది గదా అన్య సహాయం ఎందుకంటే ! అనుకున్నా"నని సూటిగా ఆ పెద్ద మనిషి కళ్ళల్లోకి చూస్తూ సమాధాన మిచ్చాడు. ఈ ఉదంతాన్ని వర్ణిస్తూ "ఔను. అదే నిజమైన మారిసస్ స్వభావం అని ఉల్లాసంతో కార్నెగీ పెద్దపెట్టున అన్నాడు "స్వశక్తి మీదనే ఆధారపడటం లూసిఫర్ లాగా స్వతంత్రుడుగా ఉండటం నేర్చుకొన్నా" డన్నాడు.

శక్తిమంతుడైన జ్ఞాతి సహాయం లేకుండానే థామస్ కొద్ది సంవత్సరాలకే డూక్వ్యాస్నిలోని క్రొత్త కర్మాగారా

నికి సూపరింటెండెంటు పదవిని అందుకొన్నాడు. భాగస్థుడై నాడు చివరకు ఇతనుకూడా కోటీశ్వరుడయినాడు.

స్కాట్లండులోని హైలాండ్సును స్మృతికి తెచ్చే పెన్సిల్వేనియాలోని క్రెస్సన్ దగ్గర, కేవలం ఎలిఘనీస్ శిఖరం మీద, కార్నెగీ ఒక కుటీరాన్ని కొన్నాడు. వసంతపు తొలి చిహ్నాలు కనిపించగానే అతడు, అతని తల్లి అతివేగంగా అక్కడికి వెళ్ళేవారు. న్యూయార్క్, పిట్స్బర్గులకు మధ్య మధ్య అతివేగ ప్రయాణాలు చేస్తూ మాసమో మరికొంత కాలమో అక్కడ గడిపిన తరువాత సెలవలకని వారు స్కాట్లండుకో, యూరప్‌కో పోతూ వుండేవాళ్లు. వేసగి చివరి దశలో తిరిగివచ్చిన ఆ సాంధుడు లేదా సాంధు లిరువురూ మళ్ళీ క్రెస్సన్‌కు వెళ్ళి అక్కడనే ఆకురాలు కాలం వరకూ వుండేవాళ్ళు.

క్రెస్సన్‌కు వెళ్ళి కార్నెగీ గోదాముతో ప్రవేశించబోతున్నప్పుడు పలుశా కట్టుకొన్న ఒక యువకుడు, పదునైదేళ్ల వాడు తనంతట తానే వచ్చి అతని గుర్రాన్ని పట్టుకొనేవాడు అశ్వారోహాము చేసి తిరిగి వెళ్ళిపోతూ ఆ 'ఉక్కు-అధిపతి' ఇచ్చిన పనిసెంట్లో పావు డాలరో పారితోషికాన్ని పుచ్చుకొని ఈల వేసుకొంటూ అతడు అక్కడనుంచి అంగలమీద వెళ్ళి పోతుండేవాడు. క్రెస్సన్‌కు అతని నివాసనగరమైన లొరెట్టోకు మధ్య ఉన్న కొండ మైళ్ళదూరం ఆ కుర్రవాడు అతివేగంగా పయనించివాడు. అయితే కార్నెగీకి అప్పుడు అతడి పే రేమిటోకూడా తెలియదు. కానీ తరువాత తెలుసుకొనే సమయం వచ్చింది.

# మరువరాని సంవత్సరం

## 9

1881 సంవత్సరమంతా ఆండ్రూ కార్నెగీ జీవితంలో ప్రత్యేకంగా గమనింపదగ్గ సన్నివేశాలతో నిండినది. ఐదు మిలియన్ల డాలర్లు పెట్టుబడి పెట్టి ఆ సంవత్స రారంభంలో కార్నెగీ బ్రదర్స్ అన్న మహాసంస్థను స్థాపించటంతో ఆండ్రూ బాల్యంలో తమ్ముడి కిచ్చిన వాగ్దానాన్ని చెల్లించాడు. ఈ సంస్థలో కార్నెగీ పెట్టుబడి సగానికి కొంచెం ఎక్కువ. ఇది సామాన్యమైన సంస్థల వంటిది కాదు. దీని యజమానులు షేరు హోల్డర్లు కాదు. సహ వ్యాపారస్థులు. ఆండ్రూ కార్నెగీ ఎవడయినా పైకివచ్చే లక్షణం గల యువకుణ్ని చేర్చుకోటానికి నిర్ణయించిన సందర్భాలలో తప్ప సామాన్యంగా ఈ బృందంలోవారు స్టాకును తమలో తమకు కాక ఇతరుల కెవ్వరికి అమ్మరాదు. అంటే ఈ సంస్థ స్టాకు ఆండ్రూ కార్నెగీ విశేషంగా అసహ్యించుకొనే స్టాక్ ఎక్స్ఛేంజిలోకి ఎన్నడు వెళ్ళదన్నమాట. ఈ నూతన మహా సంస్థలో ఎడ్గర్ థామ్సన్ స్టీల్ వర్క్స్, ది యూనియన్ ఐరన్ వర్క్స్. ఎన్నో కోల్ మైన్లు, కోల్ ఒవెన్లుగా ప్రస్తు

తంతో పరిణమించివున్న లూసీఫర్నేసెస్ అన్న సంస్థలు విలీనం చెయ్యబడ్డాయి కార్నెగీ స్టీలు గ్రామసీమలలో వేల కొద్ది మైళ్లు రైలురోడ్లను నిర్మించటానికి, బ్రిడ్జిలను నిర్మించటానికి, అప్పటి కాలంలో యుగాద్భుతంగా భావింపబడ్డ న్యూయార్క్‌లోని ఈస్టునది మీాది పెద్ద స్పానును నిర్మించటానికి తోడ్పడింది.

ఈ సంవత్సరమే తన తొలిదానంగా ఉచితజ్ఞుడై అతడు ఒక ప్రజాగ్రంథాలయాన్ని డన్ఫర్మ్‌లైన్‌కు ఇవ్వటం జరిగింది. ప్రపంచంలో మరే నగరమయినా సరే తన కానుకను ఇచ్చినందుకు అతణ్ని ఆ నగరం ప్రశంసించినట్లు ప్రశంసించి ఉండేదికాదు.

అతడు వాస్తు శిల్పి (Architect) తో ఆ భవన పథకాలను గురించి ఆలోచిస్తున్నప్పుడు అతడు "మిస్టర్ కార్నెగీ మీాకు శలాచనం (కోట్-ఆఫ్ ఆమ్) చిత్రమొకటి నాకు కావలె అది ఈ భవనంలో ఎక్కడో ఒకచోట అది వుండాలి." అన్నాడు. ధనసంపాదనం చేసిన అమెరికన్లు తమకు పారంపర్యంగా వచ్చిన ఆ ప్రాచీనకాలపు 'లాంఛనాలు' లేకపోతే వాటిని తయారుచేయుటంలో ప్రత్యేక నైపుణ్యమున్న వాళ్ళను పిలిపించుకొని కొత్తగా కల్పితమైన వాటిని చేయించుకుంటుండే వారు. కార్నెగీకూడా ఈ విధానాన్నే అనుసరించి, అటువంటి లాంచనమేదో చేయించుకొని ఉంటాడని ఆ గృహ నిర్మాత భావించి వుంటాడు. అయితే అలా జరుగలేదు.

"నీకు శుభ మగుగాక ! నాకు అటువంటి లాంచ నాడంబరా లేవీ లేవు" అని ఆ నిత్య ప్రజాస్వామికవాది వెల్లడించాడు. "నీకు ఏదో విధమైన డిజైను కావాలంటే ద్వారం మీద ఉదయకాల రవి తన కిరణాలను అన్ని దిక్కులకూ ప్రసరిస్తున్నట్లు చిత్రించి దానిక్రింద తేజస్సువ్యాప్తించు గాక !" అన్న వాక్యాన్ని ఎందుకు వ్రాయకూడదు" అని సూచన చేశాడు. చివరకు అలా చేయుటమే జరిగింది.

దక్షిణాన్నుంచి ఉత్తరానికి, ఇంగ్లండునుంచి స్కాట్లండుకు, ఆ గ్రంథాలయ భవనానికి కోణశిలను స్థాపించేటందుకు డన్ఫర్మలైన్ చేరుకొనేటట్లు కార్నెగీ ఒక కోచ్ ప్రయాణాన్ని ఏర్పాటు చేయించాడు. ఉల్లాస కరమైన ఆ ప్రయాణబృందంలో తాను తల్లితోసహా పదహారుమంది సభ్యు లున్నారు. మిగిలిన వారంతా తాత్కాలికంగా తమ పని కట్టిపెట్టి ఆఫీసు బల్లమీదినుంచి లేచి రావటానికి అవకాశం కలిగిన అతని సహచరులు, మిత్రులు. ఇందులో కొందరు భార్యలతోకూడ వస్తున్నారు. ఆ నాలుగు గుర్రాల కోచ్‌లో డ్రైవరు ప్రక్కన ఎత్తుగా కూర్చున్న డెబ్బది యేండ్ల మార్కెరేట కార్నెగీ బృంద మంతటిలోనూ ఎక్కువ వుల్లాసంగా కనిపించి వుంటుంది. అనేక పర్యాయాలు ఆమె సెలయేళ్లు దాటవలసి వచ్చినప్పుడు నీళ్ళలోకాళ్ళీడ్చుకుంటూ నడిచింది. ఒకమాటు ఆమె తన మర్టును పైకిమడచి పచ్చిగడ్డిమైదానంమీద కొండరువ్వులు(Highland Flings) నటించి చూపించింది. స్కాట్లండుకు ఇదే తన చివరిప్రయాణ

మని తెలుసుకోవటంవల్ల ఆమె అందరికంటె ఇందువల్ల అధిక ప్రయోజనాన్ని పొంద దలచింది.

అంకుల్ లాడర్ ఈ బృందాన్ని ఫిర్త్ ఆఫ్ ఫోర్తు దగ్గరకు వచ్చి కలుసుకున్నాడు. గ్రామసీమయావత్తు డన్ఫర్మ్ లైన్కు మూగుతున్న దని వీళ్లు తెలుసుకున్నారు. ఈబృందం పాత నగరాన్ని చేరేటప్పటికి గుర్రపు బాగా పెగిపోతు న్నవి. స్కాట్లండ్, ఇంగ్లండ్. యునైటెడ్ స్టేట్ల పతాకాలు ప్రాత రాజభవనం మీద ప్రక్క ప్రక్కగా ఎగురుతుండటం వీరి కంటబడ్డది. పెద్ద అందమైన తోరణం ఒకటి ఊరు బయట ఏర్పాటు చేయబడింది. ఇక్కడ ప్రోవోస్ట్, నగర కౌన్సిలు సభ్యులు, న్యాయాధికారులు వారి వారి ఔద్యోగిక మైన దుస్తులతో ఈ బృందం వారి రాకకోసం ఎదురుచూస్తు న్నారు స్వాగతం చెబుతూ ప్రసంగాలు చేశారు. ప్రధాన స్వాగతప్రసంగం చేసింది ఒక వుద్యోగి కాదు. ఔహిత్య శోభితంగా ఈ పనిని ఒక నేత పనివాడు నిర్వర్తించటం జరి గింది. ఇం దత డెంతో సమర్థతను ప్రదర్శించాడు. బ్యాండు వాయించేవారు, బాగ్ పైపర్లు, లాడ్జీలు, కార్మికులసంఘాలు- విళ్ళలో చాలామంది లినెన్ మిల్లులో పనిచేసే స్త్రీలు, బాలి కలు ఉన్నారు - వీళ్ళందరితోగూడిన వుత్సవం మైలు పొడు గున నడిచింది. ఇందులో పాల్గొన్నవారు బ్రిటిష్ అమెరికన్ జెండాలను, బానర్లను పట్టుకొని "కార్నెగీకి స్వాగతము" అని వ్రాసిన ఆర్చిల క్రిందుగా ఊరేగింపుగు నడిపించారు. ఈ వుత్సవం ఆండ్రూ జన్మించిన శిలాకుటి (Stone Cottage) దగ్గిర, అతని తల్లి పెట్టిన స్వీట్షాపు[మిఠాయిదుకాణం]

దగ్గిర రెండు చోట్ల ఆగింది. రెండో చోట ఆగినప్పుడు పెద్దపెద్ద నిశ్శబ్దంలో వినిపించిన ఆబ్బీ గంటల తీయనైన ధ్వనులకు "ఉక్కు-రాజు" కన్నులలో ఆనందభాష్పాలు పొంగిపొర లాయి.

తరువాత పేడు తిరిగింది ... పరిచితాలైన పూర్వ ప్రదేశాలను, ఇతర ముఖ్యస్థలాలను తిరిగి చూశారు శంకు స్థాపనోత్సవ సమయంలో ఎరల్ ఆఫ్ రోస్బరీ ప్రసంగిం చాడు. ధర్మకర్త లందరూ ఆ వుత్సవపు తంతును కార్నెగీ తానే నిర్వహిస్తున్నాడని వుద్దేశపడ్డారు. కానీ,అతడు ఆ గౌరవాన్ని తన తల్లి కివ్వ వలసిందని ప్రార్థించాడు. సంవత్సరం సంవ త్సరం ఆమె మీద అతని గౌరవం వృద్ధికావడమే యిందుకు కారణం. అతడు అప్పు డప్పుడు ఆమె నొసటిని వేలితో తాకి "టామ్కు, నాకు మేధాశక్తి నిచ్చిన తావు యిక్కడే వుంది" అనేవాడు. అతడు తలచినట్లె శితకేశ కిరీటంతో విసిల మైన సిల్కు వస్త్రాలలో విశిష్టమైన మూర్తిని వహించిన అతని తల్లి, ఆమలినమయిన ఆత్మశక్తిని అత్యుదాత్తతను ప్రకటిస్తూ తంతు నంతటినీ పూర్తి చేసింది. సున్నాన్ని వెండి తాపీతో పరచి, ఎత్తిన రాతిమీద ముమ్మారు మూడు దెబ్బలుకొట్టి అక్కడ సమావేశమయిన వారందరికీ వినిపించే టట్లు స్పష్టమయిన కంఠంతో "స్మృతి చిహ్నమయిన ఈ శిల సశాస్త్రీయంగానూ, సక్రమంగాను నిక్షిప్త మయినదని నేను ప్రకటిస్తున్నాను," పరమేశ్వరుడీ ప్రయత్నాన్ని ఆశీర్వదించుగాక!" అన్నది.

తానొక రచయిత ననే భావాన్ని ఎల్లప్పుడూ

వహించే ఆమె పుత్రుడు "అన్ అమెరికన్ ఫోర్-ఇన్-హాండ్ యిన్ బ్రిటన్" అన్న గ్రంథంలో ఈ కోచ్ ప్రయాణాన్ని వర్ణించాడు. ఈ గ్రంథం 1882లో ప్రకటితమైంది.

ఆ 1881 సంవత్సరంలోనే పిట్స్‌బర్గు పెట్టుబడి దారులు ప్రతిద్వంద్వంగా హోమ్‌స్టెడ్‌లో ఎడ్గర్ థామ్సన్ వర్క్సుకు కొంచెం క్రిందుగా మోనాంగహేలా నది ఆవలి ఒడ్డున మరొక ఉక్కు కర్మాగారాన్ని నిర్మించారు. కానీ కొత్త సంస్థకు కార్మిక సంబంధమైన ఇబ్బందులవల్ల దెబ్బ తగిలింది. కొంత వెనక్కు తగ్గి వచ్చిన ఆర్డర్లను తగ్గించుకో వలసివచ్చింది. దానిమీదట డైరెక్టర్లు వాళ్ళల్లో వాళ్ళు తగాదాలు పడ్డారు. చివరకు అందరూ వెళ్ళిపోవటానికి ఒప్పు కున్నారు. ఒక మధ్యవర్తి వచ్చి కార్నెగీని కలుసుకున్నాడు. ఈ పరిణామాలను మొదటినుంచి జాగ్రత్తగా పరిశీలిస్తున్న కార్నెగీ ఇటువంటి పరిస్థితి వస్తుందని ఊహిస్తూనే వున్నాడు. ఆ మధ్యవర్తి అతన్ని హోమ్‌స్టెడ్‌ను పుచ్చుకుంటారా అని అడిగాడు. అతడు తీసుకుంటానన్నాడు. తరువాత ఒక ప్రతినిధి సంఘం అతడెక్కడ తమను స్కాచ్ సంప్రదాయను గుణంగా పిండివేస్తాడో అన్న భయంతో అతని కార్యా లయానికి వచ్చారు.

"మీ షరతులేమి"ని వారు ప్రశ్నించారు

"కార్నెగీ కార్పొరేషన్‌లోని స్టాకుమూలంగా గాని విడిగా డబ్బురూపంలో గాని మీరెలా కోరితే అలా ఆ కర్మాగారంలో మీరు పెట్టిన ప్రతిడాలరు మీకూ తిరిగి ఇచ్చి వేస్తాం."

పడ్డ తబ్బిబ్బులోనుంచి గట్టుకొని ఊపిరి సలుపుకోవటానికి వాళ్ళకి కొన్ని క్షణాలు పట్టింది, వారు తమకు డబ్బే కావాలని గట్టిగా కోరారు. తిరిగి ఆలోచించుకోటానికి క్షణకాలమైనా ఇమ్మని అడగలేదు. వారిలో ఒక్కడికి తప్ప తక్కిన వారందరికీ వేరే ఉక్కు వ్యాపారాలున్నాయి ఆ ఒక్కడు మిస్టర్ సింగర్. ఇతడుమాత్రం ఆలోచించుకోటానికి ఇరవైనాలుగు గంటల కాలవ్యవధి నిమ్మనికోరాడు అతడు మర్నాటి ఉదయం తిరిగివచ్చి "నిన్న నీ వన్నది నిజంగా చెల్లించే మాటేనా?" నీవు నన్ను భాగస్థునిగా తీసుకొంటావా!

"తప్పక తీసుకుంటాను." నవ్వుతూ సమాధానమిచ్చి "ఏది, కరచాలనం చెయ్యి భాగస్వామీ!" అన్నాడు

తరువాత అతని పూర్వభాగస్థులు తమకు దూరదృష్టి లేకపోయినందుకు ఎంతో చింతించారు. అయితే మిస్టర్ సింగర్ మాత్రం తాను తీసుకొన్న నిర్ణయానికి ఎన్నడూ చింతపడలేదు. ఉక్కు అప్పుడప్పుడే తన స్థితికి తాను వస్తున్నది. రైలుపట్టాలు, కార్లు, వంతెనలు, యంత్రసామాగ్రులు బాయిలర్లు, పైపు, కేబిల్, బార్బుడువైరు, అన్నిటికీ మకుటాయమానంగా కొత్తగావచ్చి అందరినీ ఆశ్చర్యచకితులను చేస్తున్న స్కైస్క్రేపర్లకు చట్ట నిర్మాణం పూర్వపు పట్టాలకు తోడయినది. వీటన్నిటికీ ఉక్కు కావాలి.

1881 లో విశేష ప్రాముఖ్యాన్ని పొంది అందరి దృష్టినీ ఆకర్షించినవాడు పశ్చిమ పెన్సిల్వేనియా నుంచి

వచ్చిన ఒక యువకుడు హెన్రీ క్లే ఫ్రిక్. ఇతడు తెలివిగా కోక్‌ను నిర్మించటానికి పూనుకున్నాడు. 1881 వచ్చేటప్పటి కల్లా ప్రపంచ మంతటిలోనూ మంచి కోకింగ్ బొగ్గును తయారుచేసే కోనెల్స్ విల్లీలోని ఎన్నో ధనవంతుల వ్యాపారా న్నంతటినీ ఇతడు హస్తగతం చేసుకొన్నాడు, అయితే చాలా అప్పుల్లో పడ్డాడు. అంతేకాకుండా ఈ సంవత్సరం ఇతడు ఒక పిట్స్‌బర్గ్ కన్యను వివాహమాడ దలిచాడు. కొంతకాలంనుంచీ కార్నెగీ దృష్టి ఫిక్‌మీద పడ్డది. ఇతణ్ణి భాగస్వామిని చేసుకోవాలనుకుంటున్నాడు. స్వయం ఇతడు మీద విడిచిపెట్టి సంస్థకు బయట ఉండదగినంతటి సామర్థ్యం గలవాడితడు. వీళ్ళిరువురూ కలుసుకొని ఒక వ్యాపారపు లాడంబడిక చేసుకున్నారు. హనీమూన్‌కోసం ఫ్రిక్, అతని భార్య న్యూయార్క్‌కు వచ్చినప్పుడు కార్నెగీ వాళ్ళను విందు కాహ్వానించాడు. ఆ సమయంలో తల్లి తప్ప మరె వ్వరూ అతిథులు లేరు. భోజనం ముగియబోయేముందు అతి థేయి లేచి నిలిచి అతడు తన ఉత్తమ మిత్రులైన ఫ్రిక్ దంప తులకు శుభాకాంక్షలు చెప్పాడు. అందులో "మిస్టర్ ఫ్రిక్ నేను భాగస్వాములము కాబోతున్నామని చేర్చాడు.

ఇలా చేర్చి చెప్పటం ఈ రహస్యాన్ని ఇంతవరకూ ఎరగని తల్లి ఉపయోగం కోసమే ఉద్దేశింపబడ్డది.

"అండ్రా, ఇది ఫ్రిక్‌కు ఎంతో మంచి విషయం" అని ఆమె వెంటనే సంతోషించింది. "ఇందువల్ల మన కేమి వస్తుంది!" అన్నది.

కొద్దికాలానికే జనవరి, 1, 1982 న పదవ వంతు కార్నెగీ వర్గంవారి యాజమాన్యం గల స్టాకుతో హెచ్.సి. ఫ్రిక్ కోక్ కంపెనీ స్థాపితమైంది ఈ సంస్థలో ఇలా ప్రారంభమైన కార్నెగీల యజమాన్యం కాలక్రమేణ. ఫ్రిక్‌కంపెనీ విధానాన్నంతటినీ నిర్ణయించేవా డయినప్పటికీ, కాలక్రమేణ అది వారికి అత్యధిక ప్రతిపత్తి నిచ్చేటంతవరకూ పెరిగింది. ఈ మధ్యకాలంలో ఫ్రిక్ కార్నెగీ స్టీల్ కంపెనీలోని తన పెట్టుబడులను పెంచుకొన్నా

లండన్‌కు వచ్చి బ్రిటిష్ ఐరన్ అండ్ ...ల్ ఇన్స్టి ట్యూట్ ముందు అతని రచనను చదవవలసిందిగా ఆహ్వానింపబడేటంతటి ఖ్యాతి నార్జించుకున్న కెప్టెన్ బిల్‌జోన్స్ ఈనాడు ఉక్కు లోకంలో సు ప్రసిద్ధు డయినాడు. అతడిప్పుడు హోమ్ స్టెడ్‌లోని వ్యవహా రాలను చూస్తున్నాడు. తనకు ప్రియమయిన మార్గాన్ని ... నసరించి జోన్స్‌కోసం కొంత స్టాక్‌ను వేరుచేసి అతడు ...డెండ్ల ధనంతో దాని విలువను చెల్లించుకొనే పద్ధతిమీద అతణ్ని భాగస్వామిని చేద్దామనుకొన్నాడు. ఇందుకు అలా జరిగితే తాను కంపెనీతో ఒకడైపోవటంచేత తనకు కార్మికులకు మధ్య వుండే సంబంధం చెడిపోతుందని జోన్స్ అభ్యంతరం చెప్పాడు

అతడు "వారు నేను ఏవో పోకిళ్లు పోతున్నా" నను కొంటా రన్నాడు.

"అయితే ఇందుకు నీ సూచన ఏమిటన్నాడు ! కార్నెగీ.

చాలా పెద్ద మొత్తం మీరు జీతంగా నా కివ్వవచ్చు అని అతడు సమాధాన మిచ్చాడు.

"మంచిది. ఆ పని చెయ్యి" అని బల్లగుద్దాడు యజమాని.

"ఇప్పటినుంచి నువ్వు అమెరికా అధ్యక్షు డెంత జీతం తీసుకుంటాడో అంత తీసుకో. అది సంవత్సరానికి యాభై వేల డాలర్లు."

"అది కేవలం చెప్పుకోటం మాత్రమే ఆండీ" అన్నమాటే బిల్ ఇచ్చిన అంగీకారం

సౌమ్య స్వభావుడయినా ఎల్లవేళలా కార్నెగీ పొడిచి పని చేయిస్తుంటాడు, అభివృద్ధులను గురించి, ఇతర విషయాలను గురించి రిపోర్టులు అడుగుతుంటాడు "ఉక్కును ఉత్పత్తి చేయటంలో గడిచినవారం మనం పూర్వపు లెక్కలను అన్నింటినీ అధిగమించాము" అని తెలియజేస్తే అతను సమాధానమిస్తూ "శుభా కాంక్షలు. ప్రతి వారం మన మిలా ఎందుకు చెయ్యకూడదు" అని అడగడమో లేక విలువల పట్టికలను [Cost Sheets] పంపమనటమూ చేసేవాడు. "8 వ నెంబరుకొలిమి ఈ రోజున పూర్వపు రికార్డు నంతటినీ మించింది" అని తెలియజేస్తే "వెంటనే మిగిలినవి ఏంచేస్తున్న"వని ప్రశ్నించేవాడు. బిల్ జోన్స్ ఈ పోదిపోట్లతో కొన్ని సమయాలల్లో నలిగిపోతుండేవాడు. విపులమయిన రిపోర్టులు, మూల్య పట్టికలు తయారుచెయ్యటమంటే అతనికి అసహ్యం. అతను గొప్ప ఉక్కు నిర్మాత; కానీ గణాంక (Statistics) మంటే

అతనికి తలనొప్పి. తన వేసగి యాత్రలను గురించి చెపుతూ, ఒకమాటు కార్నెగీ అతనితో "నేను ఎంత అలసిపోయినా స్టీమరు రేక్కిన తరువాత అర్ధగంట గడిచి న్యూజర్సీ ఉన్నత భూములు నా వెనుక క్షితిజరేఖలోకి దిగజారినవంటే నా బాధ్యతలు, అలసట నన్ను విడిచి జారుకొంటాయి. బిల్, అది ఎంత ఉపశమనమో నీకు తెలియదు" అన్నాడు.

"అది మిగిలిన మా అందరికీ ఎంత ఉపశమనమో నీకు తెలియదు" అని సరసత లేని ఆ కెప్టెన్ జోన్స్ బదులు పలికాడు

యజమాని కార్యాలయానికి రిపోర్టులను తీసుకొని రావలసిన ఒక రోజున బదులుగా ఆరడుగుల ఎత్తు పరివాడు, తేజోవంతుడు అయిన ఒక యువకుడు హాజరై కెప్టెన్ పంపితే వచ్చానన్నాడు. అతడు సంక్షిప్తరూపంలో వున్న రిపోర్టును అందిస్తే తల యెత్తబోయే ముందు కార్నెగీ కొద్ది క్షణాలు నిశ్శబ్దంగా పరిశీలించాడు.

"కర్మాగారాన్ని గురించి నీ కంతా తెలుసునని కెప్టెన్ అంటున్నాడు" అన్నాడు కార్నెగీ.

"ఔను. దాన్ని గురించి నాకు బాగా తెలుసును"అని ఆ యువకుడు సమాధానం చెప్పాడు అందమయిన చిరునవ్వు యథాప్రకారంగానే ఆతని ముఖాని కందాన్నిచ్చింది.

"నీ పేరేమి" అంటూనే మహావ్యాపారి కెప్టెన్ వ్రాసిన చీటికి క్రింద భాగాన్ని చూస్తున్నాడు.

"ఛార్లెస్ యం. స్కావ్బ్."

"మంచిది. చార్లీ అక్కడ మన స్థితి ఎలావుందో చెప్పు. నాకు చాలు." అన్నాడా వ్యాపార ప్రముఖుడు. విపులమయిన నివేదనను వినటానికి అతడు కుర్చీలో వెనక్కు వాలాడు. నివేదన అతనికి ఆశ్చర్యాన్ని కలిగించేటంత విపులంగా వచ్చింది. ఈ యువకుడు నిశ్చయంగా కర్మాగారాన్ని గురించి అంతా తెలిసినవాడు. కార్నెగీ ఎన్నో ప్రశ్నలను కురిపించాడు. అతడు వెంటనే అన్నిటికీ పూర్తిగా సమాధానం చెప్పాడు. ఈ మధ్యకాలంలో కార్నెగీ అతని ముఖం ఎక్కడో కొంత పరిచితమయినట్లు తోచింది.

"మనం పూర్వం ఎప్పుడయినా కలుసుకొన్నామా!" ఇది తరువాతి ప్రశ్న.

"ఔను, క్రెస్సన్‌లో మీ గుర్రాన్ని పట్టుకుంటుండే వాణ్ణి."

అక్కడే, ఆ క్షణాన క్రొత్త భాగస్వామి ఇంకొకడు ఏర్పడ్డాడు.

ఉక్కు వ్యామోహం ఆకర్షించటంవల్ల సాక్వబ్ పద్ధెనిమిదేళ్ళ వయసులో బ్రాడ్డాక్ వరకు వచ్చి, అక్కడ ఒక చిల్లరకొట్టులో వుద్యోగానికి కుదిరాడు. అప్పుడు అతడు కెప్టెన్ జోన్సుకు నిత్యం చుట్టలు సప్లయి చేస్తుండేవాడు. "కెప్టెన్ జోన్సు, మిల్లులో నాకేదైనా వుద్యోగమివ్వగలవా!" అని ఒకరోజు ఆయనను అడిగాడు.

అప్పటికే జోన్సుకు ఆ యువకుడిమీద ప్రీతి ఏర్పడి వుంది. "యేమిటి! చార్లీ తప్పక యిస్తా" నన్నాడు.

అది అంత చులకనగా జరిగిపోయింది. తెలుసుకొంటున్నకొద్దీ అతడు చార్లీని మెచ్చుకోటం ప్రారంభించాడు. స్క్వాబ్ మంచి బుద్ధికుశలత కలవాడు పనివిషయంలో అలుపంటూ ఎరగడు. శ్రద్ధ వివేకం జీవించి వున్నవారిలోకల్లా మనోహరమయిన వ్యక్తి. వెంటనే అతడు వుక్కును నిర్మించటాన్ని గురించిన రాసాయనిక శాస్త్రగ్రంథాలు చదవటం ప్రారంభించాడు కెప్టెన్ బిల్ అన్నట్లు అనతికాలంలోనే అతడు ఆ కర్మాగారాన్ని గురించిన అన్నివిషయాలు తెలుసుకొన్నాడు. ఇతని వంటి వ్యక్తులే కార్నెగీకి ప్రీతిపాత్రులంకాగల అర్హతగలవాళ్లు తొలి సమావేశమయిన క్షణంనుంచీ అతడు ఆ వుక్కురాజు 'బాలు'లో ఒకడయినాడు. తనకు వారందరికంటే అతడికి అతి సన్నిహితుడయినాడు. జోన్సు అతనికి వుద్యోగమిచ్చిన తరువాత ఆరునెలలలోనే స్క్వాబ్ బ్రాడ్డాక్‌లో అసిస్టెంటు మేనేజరయినాడు. అతడు కేవలం స్వశక్తివల్ల ఆస్థానాన్ని సంపాదించుకున్నాడు. తరువాత ఐదు సంవత్సరాలకు కెప్టెన్ జోన్సు కర్మాగారంలో కలిగిన ఒక హఠాత్సంభవంవల్ల మరణించినప్పుడు చార్లీ హోమ్‌స్టెడ్ కర్మాగారానికి సూపరింటెండెంటు అయినాడు. అతని పర్యవేక్షణక్రింద ఉత్పత్తి ప్రశంసనీయంగా పెంపొందింది.

కార్నెగీ తరువాత ఒక కాంగ్రెషనల్ కమిటీతో ప్రసంగిస్తూ "మిస్టర్ స్క్వాబ్ ఒక మేధావి. అతనితో సమానమయినవాణ్ని నే నెన్నడూ కలుసుకోలేదు!" అన్నాడు.

అనేక సంవత్సరాలల్లో అనేకమంది యువకులకు భాగ

స్వామ్యం ఇచ్చినట్లే తరువాత స్క్వాబ్ కు కూడా భాగ స్వామ్య మిచ్చి భాగస్థుణ్ని చేయటం జరిగింది. అతనికోసం కార్నెగీ కార్పొరేషనులోని కొన్ని వాటాలను అసలు విలువకు అమ్మటం జరిగింది. వాటినే స్టాక్ ఎక్స్చేంజిలో పెడితే ఎంత వచ్చేదో చెప్పటం కూడా జరగలేదు. డివిడెండ్ల నుంచి ఈ డబ్బును అతడు అతి వేగంగా చెల్లించాడు. అతడు తరువాత మహా భాగ్యవంతు డయినాడు. ఇలా ఎన్నుకోబడ్డ యువక భాగస్థులందరూ భాగ్యవంతులయినారు. కార్నెగీ గ్లాసెస్టర్ ఫిషింగ్ ఫ్లీట్ తన దృష్టిలో ఆదర్శమయిన వ్యాపార సంస్థ అని చెపుతుండేవాడు. అందులో జీతంపుచ్చుకొనేవాళ్ళంటూ లేరు. అందరూ లాభాలు పంచుకునే వాళ్ళే.

మనుష్యుల గుణ నిర్ణయం చెయ్యటంలో కార్నెగీ మహా ఘటికుడు. అతడు ఒకణ్ని మంచివాడని నిశ్చయించుకున్న తరువాత అతడిమీద గొప్ప విశ్వాస ముంచేవాడు. స్క్వాబ్ మీద అతడుంచిన విశ్వాసం దరిదాపుగా పరిపూర్ణమయినది. అతని పై అధికారిని కార్నెగీ స్క్వాబ్ను క్రొత్త కన్వర్టింగు మిల్లును కట్టనీయవలసిందని త్వరపెట్టాడు. "ఆ మిల్లును నిర్మించటంవల్ల మనం టన్నుకు యాభై సెంట్లు ఉక్కును పొదుపు చెయ్యగల"మని అతడు వాగ్దానం చేశాడు

అది కార్పొరేషన్ దేశంలో మిక్కుటంగా ధన మున్న సమయం కాదు, అయినా తుదిమాటగా కార్నెగీ "మంచిది. సాగిపొండి !" అన్నాడు.

మిల్లును నిర్మించటం జరిగింది. ఒకనాడు యజమాని దానిని చూడవచ్చాడు. ఎప్పటిలాగానే తేజస్సుతో, పొంగి పొరలే ఆత్మవిశ్వాసంతో మోయవలసివున్న మహాకార్య భారాన్ని వహించే ఉత్సాహంతో స్క్వాబ్ తనకు కనిపిస్తాడని అతడు ఆశించాడు. కానీ, కార్నెగీ అన్నిటినీ పరిశీలిస్తూ నడుస్తున్నప్పుడు అతడి కుశాగ్రమయిన బుద్ధి స్క్వాబ్ ఉయ్యాహంతో లేడని గమనించింది. చార్లీ అక్కడ కేవలం ఉద్యోగానికి వున్న ప్రదర్శకుడు (Guide)లా వున్నాడు. ఏదో నిత్యం గడచిపోతున్న పనిలాగానే ఉద్యోగొట్టు ధోరణిలో అతడికి విషయాలను తెలియజేస్తున్నాడు.

చివరకు ఆ ప్రముఖు డన్నాడు : "చార్లీ, ఇక్కడ ఏదో లోపం కనిపిస్తున్నది. నీ కేదో ఆశాభంగం కలిగినట్లు నాకు తోస్తున్నది ఈ కర్మాగారంలో ఏదో దోష మేర్పడ్డది. అటువంటిదేమీ లేదా !"

"లేదు కార్నెగీ !" అని సమాధాన మిచ్చాడు స్క్వాబ్.

"ఇది ఎలా వుంటుందని నేను చెప్పానో అలాగే వచ్చింది. నేను చెప్పినట్లు మనం ఖరీదులు తగ్గించుకున్నాము అయితే, దీన్ని నేను మళ్లా నిర్మించమంటూ వస్తే కొద్ది కాలానికి పూర్వమే క్రొత్తగా కనిపెట్టబడ్డ మరొకదాన్ని ప్రవేశపెడతాను. అందుమూలంగా మనం టన్నుకు పది సెంట్లు కాదు, డాలరు పొదుపు చేసుకోవచ్చును" అన్నాడు.

"అయితే నీ అభిప్రాయ మేమిటి ! ఈ మిల్లును నీవు మార్చగలవా !"

"మార్చలేను. బ్రద్దలుకొట్టి మళ్ళీ 'కట్టటమే నా ఉద్దేశం."

క్షణమాలోచించకుండా కార్నెగీ "అది చెయ్యాదగ్గ పని. కంటికి తప్పిపోయిన దానిని సరిదిద్దుకోటంవల్ల, పనిజరిగి పోయిన తరువాత కనిపెట్టబడ్డ దానివల్ల ప్రయోజనం లభిస్తుంటే దాన్ని పొందకపోవటం తెలివితక్కువ. దీన్ని పడగొట్టించి మళ్ళీ కట్టు"

అతడు క్రొత్తగా కనిపెట్టింది ఏమిటని కూడా ప్రశ్నించలేదు. అయితే స్వాబ్ దానిని వెంటనే తెలియజేశాడు. ఈ విషయాన్ని గురించి ముందుగా నీ వెందుకు ఆలోచన చెయ్యలేదని అతడు అడుగకపోవటం కృతజ్ఞతాపూర్వకంగా జ్ఞాపకం పెట్టుకున్నాడు. తరువాతి కాలంలో స్వాబ్ తన ఛాయా చిత్రాన్ని యజమానికి పంపిస్తూ "నా అత్యంత ప్రియమిత్రునకు, యజమానికి" అని వ్రాయటంలో ఆశ్చర్యమేమీ లేదు.

కానీ కార్నెగీ కొన్నిమాట్లు తన 'బాలుణ్ని' దుబారాతనం విషయంలో మెత్తగా చీవాట్లు పెట్టటం జరిగింది. "చార్లీ, నీవు నాకు అర్థంకావటంలేదు. పేదకుర్రవాడివి. గ్రామసీమలో పుట్టినవాడివి. అయినా డబ్బువిలువ నీకు తెలియలేదు. నీకు పరిమితిలేనంత ధనం వున్నట్లు నిరంతరం క్రొత్త పనులను పెంచటంలో వ్యయం చేస్తుంటావు" అని అతడన్నాడు. కాని చార్లీ అతనితో ఎదురువాదన చేస్తుండే వాడు. అయితేనేం యజమాని ఎన్నడూ తనకు అప్పుడైన ఆశ్రితుని పథకాలను వేటినీని షేధించకపోవటంకనిపిస్తుండేది,

ఒక మధ్యాహ్నం వేళ జరిగిన సంఘటనను గురించి చెప్తూ స్క్వాబ్ తరువాతి కాలంలో ఎంతో సంతోషిస్తుండేవాడు. స్క్వాబ్ తాను న్యూయార్క్ చేరిన తరువాత ఒక వ్యాపార విషయాన్ని గురించి కార్నెగీ సలహాను పొందటం కోసం అతని యింటికి వెళ్లాడు. అలా వెళ్ళినది యింకా స్వయంచోదకాలయిన బండ్లు ఏవీ లేని రోజులు. అతడు తనకు సహజమైన రీతికి తగినట్లుగా అందమయిన “కాబ్”ను గాని, లేదా ఒంటి గుర్రపు బండిని గాని పిలవకుండా ఒక “కారేజి”ని పిలిచాడు. యజమానితో మాట్లాడటానికి యింట్లోకి వెడతూ శకట చోదకుడితో వేచివుండవలసిందని చెప్పాడు. వాళ్ళ సమావేశం అనుకున్న దానికంటె ఎక్కువసేపు పట్టింది. చివరకు అతణ్ణి తనతో భోజనానికి వుండిపొమ్మని కార్నెగీ ఆహ్వానించాడు. బండిని గురించి పూర్తిగా మరచిపోయి చార్లీ ఆహ్వానాన్ని అంగీకరించాడు. భోజనానంతరం తన సంభాషణను యింకా పొడిగించాడు. చివరకు బట్లరు వచ్చి ద్వారం దగ్గర నిలచి అన్నాడు.

“క్షమించండి మిస్టర్ స్క్వాబ్ బండిని మీరు యింకా వుండమంటారా ?” చార్లీముఖం బీటు దుంపలా ఎర్రివారిపోయింది. తిరిగి స్వస్థాయిని పొందేలోగా అతడు కలవరపాటును పొంది మాటల్లో నోటితుంపరలు రాల్చాడు. అతని పూర్వ యజమాని ఒక మాటయినా అనలేదు. ఊరక కూర్చుని హఠాత్తుగా తోచిన హాస్యాస్పదమయిన అభినయంతో అతనివైపు చూశాడు. మాటలతో పని లేకపోయింది.

# వివాహం ఐశ్వర్య సువార్త

## 10

కార్నెగీకి గుర్రపుస్వారీ అంటే చాలా యిష్టం. రక రకాల యువతులతో కలిసి అతడు కేంద్రారామంలో (Central Park) స్వారిచేశాడు. ఈయువతుల్లో లూయిూవిట్ఫీల్డ్ ఒకతె. ఈమె న్యూయార్క్‌లో ఒక టోకు వ్యాపారస్థుని కుమార్తె. ఈమె అంటే ఆంద్రూకు ఎక్కువ మక్కువ. ఒకటి రెండు సంవత్సరాల సాహచర్యం కలిగిన తరువాత ఆమె అంటే తనకు ప్రేమ వున్నట్లు అతడు గ్రహించాడు. జీవితంలో ఈ ప్రేమభావమంటూ కలగటం అతని కిదే మొదటిసారి. ఆమెతో పూర్వానురాగ ప్రేమసంవాదం ప్రశాంతంగా నడిచింది. చివరకు మిస్ విట్ఫీల్డు అతడుచేసిన వివాహ సూచనకు అంగీకరించింది. కొంతకాలం వారుఒడం బడిక సమయంగా గడిపారు.

ఈ మధ్య కాలంలో కార్నెగీ ప్రతి సంవత్సరం చేసే విదేశయాత్రల సందర్భాలలో గ్రేట్ బ్రిటనులోని అనేకు లతో స్నేహసంబంధాలు, ఇతర సంబంధాలు ఏర్పరచుకొ

న్నాడు. మాథ్యూ ఆర్నాల్డు, తాత్వికుడు హెర్బర్టుస్పెన్సర్ వైకౌంట్ మోర్లే, ఎరల్ ఆప్ ఎల్గిన్, సర్ విలియంవెర్నాన్ హార్ కోర్ట్, నార్డు బ్రైస్, గ్లాడ్ స్టన్, రోజ్ బరీ, బాల్ఫోర్ కాంబల్ బానర్ మన్ ప్రభృతులయిన ప్రధానమంత్రులు, తప్పనిసరిగా ప్రముఖులయిన పారిశ్రామికులు, బ్యాంకర్లు అతని ఆ ప్తమిత్రవర్గంలోని వారయినవారు. అతడు ఒకమారు బ్రిటీష్ ఐరన్ అండ్ స్టీల్ ఇన్స్టిట్యూట్కు అధ్యక్షపదవిని నిర్వహించారు. అనేక విషయాలమీద తన అభిప్రాయా లను వెల్లడిస్తూ బ్రిటిష్ పత్రికల కెన్నిటికో వ్యాసాలు వ్రాశాడు. 1886లో ప్రకటితమైన అతని "ట్రియం ఫేంట్ మార్చ్" అన్న గ్రంథంలో అతడు పూర్వ ప్రపంచంకంటె అమెరికాకున్న ఆధిక్యాన్ని విశేషంగా పొగడినప్పటికీ అతని మీద బ్రిటన్లో జనానురాగం ఇంచుకైనా తరగలేదు. అనేకమంది బ్రిటిష్ మంత్రులతో అతడు సంభాషించిన సమ యాలల్లో అతడు రాచరికాన్ని రద్దుచేసి గణతంత్ర రాజ్య వ్యవస్థను నెలకొల్పుకోవలసిందని యెంతో తీవ్రంగా వాదించాడు. తన అతివాద భావాలను ప్రచారం చెయ్యటంకోసం అతడు యునైటెడ్ కింగ్డమ్ లోని అనేక పత్రికలను కొన్నాడు. అతని దృష్టిలో బ్రిటిషువారు కేవలం మితవాదులు. అయినప్పటికీ అతడు ఆ బ్రిటిషువారి ప్రేమను విశేషంగా చూరగొన్న అమెరికన్ అని అనిపించు కొన్నాడు. ఇంగ్లీషు, స్కాచ్, ఐరిష్ జాతులవారు, ఒకరి తరువాత ఒకరు, అతనికి "ఫ్రీడమ్ ఆఫ్ ది సిటీ" ఇచ్చి గౌర వించారు. ఈ సమయాలలో వారు సుదీర్ఘమైన 'ప్రశంసలు'

[సన్మాన పత్రాలు] ఇచ్చి అవసరమయిన తంతును అతి ఘనంగా జరిపించారు. ఇతరు లందరికంటె ఇతను ఈ జాతి గౌరవాలను విశేషంగా పొందాడు. అవి ఏబది తొమ్మిది. ఈ గౌరవాలను పొందిన వారిలో ఇతని తరువాతివాడు మిస్టర్ గ్లాడ్‌స్టన్. ఇతని కబ్బిన ఇట్టి గౌరవాలు పదిహేడు మాత్రమే ఈ అమెరికన్ ఘనవ్యాపారిని పార్లమెంటుకు ఎన్నుకోవాలన్న వదంతి కూడా ఇంగ్లండులో బయలుదేరింది.

మిస్ లిట్ఫీల్డ్ ఇదంతా చూసి భయపడిపోయింది. ముఖ్యంగా ఆమె భీతికి కారణం ఇతడు బ్రిటిష్ పార్లమెంటులో కూర్చోబోతున్నాడని వినటం. చివరకు ఇంత విశేషంగా విస్తృతిని పొందిన అతని జీవితానికి తాను ఉపకరించ లేదనే నమ్మకంతో ఆమె ఒడంబడికను (Engagement) భగ్నంచేసింది.

1886 లో క్రెస్సన్ పర్వత శిఖరంమీద ఉన్నప్పుడు కార్నెగీకి టైఫాయిడ్ జ్వరం పట్టుకున్నది. ఆ సమయంలో దుఃఖం అతణ్ని విశేషంగా క్రుంగదీసింది. అతని తల్లి, సోదరుడు ఇరువురూ జబ్బుచేసి మరణించారు. మిసెస్ కార్నెగీ మరణానికి విశేషంగా వృద్ధాప్యం కారణం. కానీ నలభై మూడేళ్ళ వయసులోనే టామ్ చనిపోవటం అంటే దూకు అనుకోని ఉపద్రవం. ఈ వార్తను అతనికి తెలియజేసినప్పుడు అతడు ఇక తాను జీవిస్తేనేం మరణిస్తేనేమన్నంత నిస్పృహ చెందాడు. అఖల ప్రపంచంలో అతని కత్యంత ప్రియతము లయిన ఇద్దరినీ అతను కోల్పోయినాడు. ఆ ఇరువురూ అతనికి విలువయిన సలహాదారులు, సహాయకులు, టామ్ కార్నెగీ

సంస్థ లన్నింటికీ అధ్యక్షుడు. అతనికి కుడిభుజం. అతడూ లేకుండా జీవితాన్ని ఎలా సాగించాలో అతనికి అర్థంకా లేదు.

కొంతకాలం అతడు ఎంతగానో క్రుంగిపోయాడు. క్రమంగా అతడు శారీరక మానసిక బలాలను రెంటినీకొద్దిగా పొందుతున్నాడు. అతడికి మరొక "ప్రియతమయిన వ్యక్తి లూయీ విట్ఫీల్డ్. ఆమెను గురించి మరల మరల వచ్చే మనోభావాలను త్రోసిపుచ్చలేకపోతున్నాడు. బహుశః ఆమె ఇప్పుడు కొంత దుఃఖపడి వుండవచ్చు. జబ్బునుంచి, దుఃఖం నుంచి తేరుకొని లేచి కూర్చోగలిగిన వెంటనే అతడు తమ ఒప్పందాన్ని పునరుద్ధించవలసిందని కోరుతూ ఒక లేఖ వ్రాశాడు. అతనికి ప్రయాణం చేయగల పరిస్థితి చేకూరింది. అప్పుడు అతనికి వైద్యంచెయ్యటంకోసం ఆహ్వానింపబడ్డ అతి సమర్థుడయిన న్యూయార్క్ వైద్యుడుడాక్టరుఎఫ్.ఎస్ డెన్నీ అతణ్నిన్యూయార్క్‌లోని డెన్నీహోమ్‌కు తీసుకొనిపోయాడు అక్కడ ఆ వైద్యుడు, అతని భార్య చూపిన శ్రద్ధవల్లఅతడు బాగా కోలుకొవటం జరిగింది. మిసెస్ విట్ఫీల్డు అక్కడికి వచ్చి అతని దుస్థితిని, దైన్యాన్నిచూసి, పునఃపరిసీలన చేశానని ఇప్పుడు అతణ్ని వివాహమాడటానికి తన కిష్టమేనని చెప్పింది. ఆమె అతణ్ని ప్రేమించింది కదా మరి ! "ఇప్పుడు నా అవసరం నీ కున్నదని నేను భావిస్తున్నాను. ఇప్పుడు నేను నీకు నిజమైన సహాయకురాలినిగా ఉండగలను" అని ఆమె అతనితో చెప్పింది.

ఏప్రియల్, 1887 న వారిరువురూ వివాహం చేసు

కున్నారు. విస్ట్ ద్వీపంలో 'హనీమూన్' గడిపారు. అంకుల్ లాడర్, మరొక మారిసన్ కజిను అక్కడికి కొలదికాలం విహారయాత్రకోసం వచ్చారు. అంకుల్ లాడర్ వారికోసం స్కాట్లండ్‌లోని గ్రాంపియన్ కొండల్లోని గ్రాంటుల పూర్వీకుల ఇల్లయిన కిల్‌గ్రాష్టన్ కాజిల్‌ను వేసవిగృహంగా ఉపయోగించుకోటానికి అద్దెకు సంపాదించిపెట్టాడు. ఉత్తర దిక్కుగా పయనిస్తున్నప్పుడు మార్గమధ్యంలో వారు పూర్వం నగరానికి వచ్చిన గ్రంథాలయానికి కార్నెగీ శంఖుస్థాపన చేసిన ఎడింబరోలో ఆగారు. అతనికి "ఫ్రీడమ్ ఆఫ్ ది సిటీ" అనే గౌరవాన్ని ప్రసాదిస్తున్నప్పుడు లార్డు సాలిస్‌బరీ ముఖ్య ప్రసంగం చేశాడు. ఎడింబరోనుంచి వారు డన్‌ఫర్మ్‌లైన్‌కు వెళ్లారు. అక్కడ వధువు ఆ నగరాన్ని, బంధువర్గాన్ని చూసి ఆనందించింది. బంధువర్గంకూడా ఆమెను చూచి యెంతో సంతోషించారు. వాళ్ళలో చాలామంది ఆమె భర్తతో అన్నారు: "ఆండ్రూ ! ఆమె నిన్ను వివాహం చేసుకొన్నందుకు నా కాశ్చర్యంగా ఉంది" అని. అందుకు అతడు "మీరు నాకంటే విశేషమైన ఆశ్చర్యాన్ని పొంది ఉంటారు !" అని ప్రతిభాషణం చేశాడు.

ఈ వివాహంకంటే ఏదీ ఆనందప్రదంగా వుండదు. మిసెస్ కార్నెగీ తనకంటెకూడా ఎక్కువ స్కాచ్ అయిపోతున్నదని ఆమె భర్తే అన్నాడు. ప్రాత నగరాలు, కొండలు సరస్సులు, పూలు అన్నీ ఆమెకు సంతోషప్రదాలైనాయి. ఆమెకు ముఖ్యంగా బాగ్‌పైప్ సంగీతమంటే ఇష్టం కలిగింది. నిద్ర మేల్కొనేటప్పటికల్లా ప్రతి దినం బాగ్‌పైప్ సంగీత

జ్ఞుడు తమకు పాడుకుంటూ ఎదురురావటం, భోజనవేళల్లో ఆ వాద్య సంగీతాన్ని వినిపించటం ఎంతో ఉల్లాసకరాలుగా ఉంటాయని ఆమె సూచించింది. ఆమె కోర్కె వెంటనే తీర్చబడింది. తన శాఖకంతటికీ ప్రముఖుడయిన క్లరీమెక్ఫర్ సన్ గొప్పగా సిఫారసు చేస్తూ ఒక లేఖను వ్రాసియిచ్చి పై పరొకణ్ణి కార్నెగీల దగ్గరికి పంపించాడు. వారు కిల్గ్రాస్టన్ దుర్గంలో ప్రవేశిస్తున్నప్పుడు తన సంగీతంతో అతడు వారికి ముందు నడిచాడు.

ఆ వేసగి ఎంతో సంతోషంగా గడిచిపోయింది. గుంపులు గుంపులుగా అతిధులు వారి సౌధంలో మూగుతు న్నారు డన్ఫర్మ్లైన్ బంధువర్గంకూడా వారితో చేరారు. వీరందరూ వస్తూపోతూ ఉండటంతో కాలం గడచిపోతూం డది. ఆకురాలు కాలంలో కార్నెగీలు న్యూయార్కుకు తిరిగి వచ్చేటప్పుడు వెంట పైపరునుకూడా తీసుకువచ్చారు. ఫిఫ్టీ ఫస్టు స్ట్రీట్లో ఫిఫ్త్ ఎవెన్యూలో అతి విశాలమైనదీ, ఆడం బరం లేనిది అయిన తమ యింట్లో అతణ్ని ఒదిగించటం కొంచెం కష్టమని వారు గమనించినప్పటికీ అతణ్ని తీసుకు వచ్చారు. తరువాతవచ్చిన వేసగికి మెక్ఫర్సన్ దగ్గంనుంచి క్లనీ కాజిల్ను అద్దెకు పుచ్చుకొని అక్కడికి వచ్చినప్పుడు కార్నెగీలు తిరిగి వారి దేశంలోకి వచ్చినట్లు భావించారు. ఇలా వారు పది వేసగి ఋతువులు గడిపారు.

కొన్ని సంవత్సరాలనుంచి కార్నెగీ పెద్దమొత్తాలుగా డబ్బుదానం చేస్తున్నాడు. 1887లో గ్లాడ్స్టన్తో ఒకమాటు "ఒక మనిషి ధనికుడిగా మరణించటం అవమానకరమైన

విషయ" మన్నాడు. ఇది జీవితాంతంవరకూ నిలుపుకోలేక పోయినప్రకటన అని అతడుగుర్తించాడు,1889లోఅతడునార్త్ అమెరికన్ రివ్యూలో రెండు వ్యాసాలు వ్రాశాడు. వీటిలోని సారాంశమే చివరకు అతని "ఐశ్వర్య సూత్రం" (Gospel of Wealth) అన్న పేరుతో ప్రసిద్ధికెక్కింది. అతడు ధనాన్ని బంధువులకు తన తదనంతరం వారసత్వంగా చెందేటట్లు ఇచ్చి వెయ్యవచ్చు. తన మరణానంతరం ప్రజా సంక్షేమ కార్యాలకు దానిని వినియోగించటంకోసం విడిచి పెట్టవచ్చు. లేదా దాన్ని తన జీవితకాలంలోనే ఇచ్చి వేయవచ్చు. ఈ మూడింటిలో కార్నెగీ చివర మార్గాన్ని మిగిలిన రెంటి కంటె మంచిదిగా భావించాడు. ధనాన్ని ప్రజా వారసత్వంగా విడిచిపెట్టి వెడితే దాతకుగల వాస్తవమైన ఆదర్శంగానీ, లేదా ఆకాంక్షగాని కొన్ని సందర్భాలలో సఫలం కాకపోవచ్చు. ఏమయినా అత డిలా అన్నాడు: "లోకానికి ఎక్కువ ప్రయోజనకారి కాకపూర్వమే అతడు మరణించేటంతవరకూ ఆగి వుండటానికి తృప్తివహించగలిగితే ఆ స్తిని మరొకరి పరం చేయడానికి ఇది ఒక సాధన మాత్రమే ఔతుంది." ఇటువంటి ఆచారాలను నిరుత్సాహపరచటం కోసం వారసత్వాల మీద విశేషంగా పన్నులు విధించాలనీ అతడు అభిప్రాయ పడ్డాడు. "తనవెంట తీసుకుపోలేని దానిని విడిచి పోయినందుకు ఒక వ్యక్తిని స్తుతించటం అసాధనం. వ్యక్తి మరణవేళ ఎంత విడిచిపెట్టి వెళ్ళినా అది పరిగణీయ మయింది కాదు. అట్టి ధనం అతడి దగ్గరనుంచి బలవంతంగా

లాగుకోబడ్డది గాని దాన మివ్వబడినది కాదు” అన్నా డతడు.

నగరం కనుక 15,000 డాలర్లు ప్రతిసంవత్సరం కేటాయించి దానితో సక్రమ నిర్వహణకు ఏర్పాటు చేయిస్తా మంటే తాను ఒక ప్రజాగ్రంథాలయానికి 2,50,000 డాలర్లు ఇస్తానని కార్నెగీ పూర్వం 1881లోనే పిట్స్‌బర్గు మేయరుకు ఒక లేఖ వ్రాశాడు. నగర ప్రముఖులు కొందరు ఈ సూచనకు వ్యతిరేకించటం చాలా వింతయిన విషయం. పిట్స్‌బర్గు టైమ్స్ పుస్తకాలు, మాగజిన్లు, వార్తా పత్రికలు పెద్దఖరీదు లయ్యేవి కావు కాబట్టి గ్రంథాలయం అనవసరమని ప్రజాపార్కు అవసరమని అందువల్ల కార్నెగీ దానికి ఇస్తే బాగుంటుం దీసంపాదకీయం వ్రాసింది. అంతేకాకుండా గ్రంథాలయంకోసం పన్నులువేసి డబ్బుచేకూర్చటానికి నగరానికి అధికారంకూడా లేదని అది సూచించింది. అందువల్ల శాసనసభ గ్రంథాలయాన్ని నెలకొల్పి దానిని పాలన చేయించే విషయంలో ఒకశాసనం చేసేటంత వరకూ ఈ విషయం ఆ రేళ్ళపాటు వెనకబడ్డది అప్పటికి ఇంకా పిట్స్‌బర్గుతో చేరిపోని అలీఘను ఈ మధ్యకాలంలో కార్నెగీని అభ్యర్థించి కల్నల్ ఆన్డర్‌సన్ మెమోరియల్‌తో బాటుగ దానినికూడ పొందింది ఆ ఉత్సవ సమయంలో ప్రసంగించటానికి ప్రెసిడెంటు బెంజిమిన్ హారిసన్ వాషింగ్టన్‌నుండి వచ్చారు.

పిట్స్‌బర్గు 87 చివరిలో ఆ దానాన్ని పుచ్చుకోటానికి సంసిద్ధమైనప్పుడు కొలది సంవత్సరాలలోనే ఆ నగరంబాగా వృద్ధి పొందనున్న దన్న అంశాన్ని గమనించి దానికి ఆ

దానశీల తాను ముందు భావించిన దానికంటె పరిశోధన, సంచరణ (Circulation) గుణాలకు అవకాశాన్నిచ్చే బృహద్గ్రంథాలయము, కళాఖండ నివేశనగృహం. (Art gallery) ఆడిటోరియంలు అవసరమని గుర్తించాడు. నగరం పాలనకోసం 40,000 డాలర్లు వ్యయంచేస్తానని వాగ్దానం చేస్తే తాను పదిలక్షలడాలర్లు ఇస్తానన్నాడు. తరు వాత త్వరలోనే దానికి మరో 1,00,000 [లక్ష] డాలర్లు చేర్చాడు. ఆర్టు గ్యాలరీకోసం ఒక పదిలక్షల డాలర్లు యిచ్చాడు. కార్నెగీ ఇన్‌స్టిట్యూట్ పెరిగిపోయింది. ఒక పావు శతాబ్దిలో దాని దాత దానికోసం 2,80,00,000 [రెండుకోట్ల ఎనభై లక్షలు] డాలర్లు వ్యయం చేశాడు.

అతని దానాలు విస్తృతిలోను, సంఖ్యలోను క్రమంగా పెరిగిపోతున్నవి. కొంతకాలంగా అతడు క్రొత్త భవనాలలో నిర్మించుకోటానికి గ్రంథాలయాలను ఇతరమయిన అవకాశా లను చేర్చుకునేటందుకు కళాశాలలకు 10,000 మొదలు 1,00,000 డాలర్లవరకూ కొన్ని సందర్భాలలో ఇంకా ఎక్కువ మొత్తాలు ఇస్తూ వచ్చాడు. అతడు నగరంలో ఇది వరకే ఉన్న గ్రంథాలయాలను పెంపొందించుకోనేటందుకు డబ్బు ఇచ్చిన సందర్భాలెన్నో వున్నాయి. ఉదాహరణకు అట్లాంటాలో యంగ్ మెన్స్ లైబ్రరీ ఎసోసియేషన్ ముప్పది సంవత్సరాలనుంచి ఒక ప్రజా గ్రంథాలయాన్ని నెలకొల్పి నడపించటానికి ఎంతగానో తికమక పడుతున్నది. దాన్ని పెంపొందించి మంచిస్థితిలో నిలపటం కోసం కార్నెగీ వారికి 1,25,000 డాలర్లు ఇచ్చాడు. వారికి పనిని పూర్తి చేయ

టానికి చాలా సంవత్సరాలు పట్టింది. ఆ భవనాన్ని తిరిగి తెరిచి నప్పుడు అల్బానాలోని చిన్న పిల్లలు పెన్నీలు పెన్నీలుగా ఇచ్చిన ద్రవ్యంతో తయారు చేయించిన చిన్న పాలరాతి కార్నెగీ విగ్రహం, ఊర్ధ్వకాయం (Dust) కృపాళువయిన ఆ దాత జ్ఞాపక చిహ్నంగా ప్రవేశద్వారానికి వెనక ప్రక్కన ఉంచబడింది.

అతడు న్యూయార్క్‌లోని ఇంజనీరింగ్ సంస్థలకు, ప్రతి ఒక్క స్థలం ప్రత్యేక నివేశనాన్ని ఏర్పాటుచేసుకోటానికి, గ్రంథాలయము, ఆడిటోరియం ఏర్పాట్లతోసహా, కేంద్రి మన్హాట్టన్‌లో పదునైదంతిసుల క్లబ్బ్‌ను నిర్మించే ఉద్దేశములో 1.,00,0(0 డాలర్లు దానమిచ్చాడు.

ఎల్లవేళలా సంగీతమంటే అతనికి ఎంతో ప్రీతి కనుక సంపాదించుకోలేక కష్టపడుతున్న చర్చిలకు 'ప్రైవు' వాద్యాలను ఇవ్వటం ప్రారంభించాడు. అతని దానాలల్లో కల్ల కోట్ల జనాలకు సంతోషాన్ని కలిగించింది న్యూయార్క్ యాభైయేడవ వీథిలో ఏడవ ఎవెన్యూలో అతడు కట్టించిన సంగీత సౌధం. కొన్నిసంవత్సరాలవరకు సంగీతప్రపంచంలో ప్రముఖులైనవారి సంగీతం అందులో వినిపించింది. దాత దానికి న్యూయార్క్ మ్యూజిక్‌హాల్ అని పేరు పెట్టాడు కానీ చిరకాలం జనం దాన్ని "కార్నెగీ హాల్" అని వ్యవహరించటంవల్ల తరువాతి ధర్మకర్తలు అదే పేరును దానికి నిర్ణయించారు. ప్రసిదుడయిన రష్యన్ వాగ్గేయకారుడు పీటర్ ప్రైక్కోలి స్కీని అతడు 1891 లో, దాని ప్రారంభోత్సవ

సమయంలో ఏర్పాటైన సంగీత సమ్మేళనాన్ని నడిపించ టానికి పిలిపించాడు. అతడు ఏర్పాటుచేసిన సంగీత సమ్మేళ నంలో ఆ రష్యన్ సంగీతజ్ఞుడు కూర్చిన తౌర్యత్రికాలు [Symphonies] కూడా ఉన్నాయి. ట్చైకోవ్‌స్కీ బృం దాన్ని కార్నెగీ తన యింటికి విందుకు పిలిచాడు. అందులో అతడు పూర్వం సంగీత సౌధ ప్రారంభోత్సవ సమయంలో విన్పించిన సంగీతాన్ని కార్నెగీ అనుకరించి విన్పించాడు. ఇలా అతిథేయి విన్పించిన సంగీతాన్ని గురించి తరువాత ట్చైకోవ్‌స్కీ "నేనే మహానందపడేటట్లుగా, అంత ఉదాత్త ముగా అసలు నేనే సంగీతాన్ని వినిపిస్తున్నట్లుంది" అని వ్రాశాడు.

ఉక్కును, ఆయుధసామగ్రులను నిర్మించేవాళ్లు స్వలా భాలకోసం యుద్ధాలను తెచ్చిపెడుతుంటారు. ఇది సత్య మయినా కాకపోయినా ఆండ్రూ కార్నెగీ యుద్ధోత్సాహి కాడు. యుద్ధాలను కల్పించేవాళ్ళలో ఒకడు అతడు ఎన్నడూ కాలేదు. అతడు కాంగ్రెస్‌లో తనతో బాటుసహాప్రతినిధి అయిన మిస్సోరీ సెనెటర్ హెన్డర్‌సన్‌ను కలుసుకొన్నాడు. అతడు అప్పుడే పోర్‌హామ్ హోటల్‌లో ప్రవేశిస్తున్నాడు. వాళ్లు మాట్లాడుతుండగా వీథిలో ఒకవంకకు చూస్తూ "అడుగో అధ్యక్షుడు. నిన్ను పిలుస్తున్నాడు" అన్నాడు.

ఆ రోజుల్లో అమెరికా అధ్యక్షులు ఒకడైనా అంగ రక్షకుడు పరికాన లేకుండానే తమ ఇష్టంవచ్చినచోటికి, తమ ఇష్టంవచ్చిన సమయంలో వెళ్లుతుండేవాళ్ళు.

వీధిని అడ్డంగా దాటి అధ్యక్షుడి దగ్గిరకు వెళ్ళి కార్నెగీ అతని కరచాలనం చేశాడు

"ఓహో! కార్నెగీ ఎప్పుడు వచ్చావు!" అన్నాడు అధ్యక్షుడు.

"ఇప్పుడే హోటల్‌లోకి రిజిష్టరు చేయించుకోటానికి వెళ్లుతున్నాను"

"నీవు ఇక్కడికి ఏం పని మీద వచ్చినట్లు!"

"మీతో మాట్లాడటానికి"

"అయితే రా!" అని అతడి చేయిని చేతిలోకి తీసుకొని "నడుస్తూ మాట్లాడుకుందాం. మాట్లాడు" అన్నాడు అధ్యక్షుడు.

సాయంత్రం చీకటి పడబొయ్యేటంతవరకూ వాళ్ళు వీధుల్లోగుండా నడుస్తూనే మాట్లాడుకున్నారు. ఇరువురిమధ్య చర్చ యెంతో ఉల్లాసకరంగా సాగింది.

"మిష్టర్ ప్రసిడెంట్, ఆ శాంతి సమావేశం దరిదాపుగా విఫలమయినట్లే. అయినప్పటికీ శాంతివహించి క్షమించటం మనకు కర్తవ్యమనుకుంటాను. మీరు లాటిన్ అమెరికన్ ప్రతినిధులతో, వారి గౌరవార్థంగా ఆ చిన్న సైనిక సమీక్ష చేసి చూపించాయేగాని ఇంత సైన్యం మన కుందని చూపించటం కాదు. పయిగా మనకు సైన్యం లేదనీ, అవసరం లేదనీ చూపించటంకోసమే అని నిష్కర్షగా చెప్పారు. ఇది మీకు జ్ఞప్తి వుందనుకుంటాను, మనది గణతంత్రరాజ్యకుటుంబంలో జ్యేష్ఠ సోదరుడివంటిది మాత్రమే. అని వారితో చెప్పారు.

యిలా చెప్పిన మీరు విభిన్న మార్గాన్ని స్వీకరించి వ్యవహారించటం చూసి నేను ఆశ్చర్యపడటమే కాదు యెంతో చింతిస్తున్నాను."

"అయితే ఇది తగాదా. కేవలం అభిప్రాయభేదం కాదు." అని అధ్యక్షుడు అభ్యంతరం చెప్పాడు. "మన పౌరులను వాళ్లు కావాలని చంపారు. గాయపరిచారు, విదేశాల లోని మన పౌరులకు రక్షణ కల్పించే విషయంలో మనకు యెంతో ప్రఖ్యాతి వుంది"

"ఆ మాటకు వస్తే ఆనావికుల్లో చాలామంది అమెరికన్లు కాదు. విదేశీయులు. ఒక చిన్న వీధి కలహాన్ని ఆధారం చేసుకొని చిలీవంటి చిన్న దేశంమీద కఠినచర్య తీసుకుందామని మీరు ఆలోచిస్తున్నట్లు విన్నందుకు నేను యెంతో చింతిస్తున్నాను"

న్యూయార్క్ పురవాసులు వ్యాపారం, డాలర్లను గురించి తప్ప మరొక విషయాన్ని దేన్నిగురించీ ఆలోచించరని అన్నాడు అధ్యక్షుడు తాత్పర్యంతో. "ఇదే న్యూయార్క్ వారి రీతి. గణతంత్రి రాజ్యగౌరవంకంటె వారు తమ ధనపు పంచీలను గురించి ముందు ఆలోచిస్తారు"

"మిస్టర్ ప్రెసిడెంట్ యుద్ధంవస్తే విశేష లాభాలను పొందే యునైటెడ్ స్టేట్సు వాళ్ళల్లో నేనొకణ్ని. ఉక్కును వుత్పత్తి చేసేవాళ్ళలోకల్లా పెద్దవాణ్ని కావటంవల్ల యుద్ధం నా జేబుల్లో కోట్లు క్రుమ్మరిస్తుంది" అని కార్నెగీ నమ్రదిగా మనసు కెక్కేటట్లు మాట్లాడాడు.

"బహుశః ఇది నీ విషయంలో సత్యమయి వుండ వచ్చు" అని అధ్యక్షుడు హారిసన్ అంగీకరించాడు.

"కానీ పోరాడటమంటూ వస్తే నేను సరిపుచ్చుకోవాలని చూచుకుంటాను"

"చిన్నదిగదా అనీనిన్ను యే దేశమయినా అవమానిస్తే ఊరుకుంటావా!"

"నన్ను నే నవమానించుకోవలసిందే గాని ఇతరులు ఎవరూ నన్ను అవమానించలేరు. గౌరవానికి సంబంధించిన గాయాలను ఎవరికివారే చేసుకుంటుంటారు"

"మన నావికుల నిద్దరిని తీరంమీద ఎదుర్కొని వాళ్లు చంపివేశారు. అయితే నీ పీ చర్యను సహించగల వన్న మాట"

"మిస్టర్ ప్రసిడెంట్ త్రాగుబోతులయిన నావికుల మధ్య జరిగిన చిన్న కలహంవల్ల యునైటెడ్ స్టేట్స్ అవమానితమయిందని నేను అనుకోను. ప్రజాశాంతి భంగమయి నగరంలో కొట్లాటలు జరుగుతున్నప్పుడు నావికులను తీరం మీదికి దిగి తిరగనిచ్చినందుకు నేనయితే ఆ నావ కెప్టెనును కాల్చేయిస్తాను"

వైట్‌హౌస్ ద్వారందగ్గిర వాళ్ళిద్దరూ విడివడి పోయే వేళకు చీకటి పడ్డది. "ఇవాళ రాత్రికి నే నో విందుకు వెళ్లుతున్నాను. రేపు సాయంత్రంవచ్చి నాతో భోజనం చెయ్యి. అప్పుడు నా కుటుంబం తప్ప ఇంట్లో ఎవ్వరూ వుండరు మనం విపులంగా మాటాడుకోవచ్చు" అన్నాడు అధ్యక్షుడు.

మరునాటి ఉదయం రాష్ట్రకార్యాలయ కార్యదర్శి బ్లెయిన్ ఆఫీసుకు వెళ్ళి కార్నెగీ అతణ్ణి పిలిచాడు. అతడు సంతోషంతో అతణ్ని ఆహ్వానించాడు

"గడచిన రాత్రి నీవు యిక్కడ వున్నట్లు మాకు తెలియజేయలేదేం!" అని అడిగా డతడు. "అధ్యక్షుడు మిసెస్ బ్లెయిన్‌తో నీవు నగరంలో వున్నావని చెప్పినప్పుడు ఆమె ఎంతో చింతపడ్డది. మిష్టర్ కార్నెగీ నీవు ఎప్పు డీ నగరానికి వచ్చినా, మా గృహంలో నీకు ఒక ఖాళీ స్థానమున్నదని భావించు."

"రాత్రి మీ ఇంటి విందును పొందలేకపోయినందుకు ఎంతో చింతిస్తున్నాను" అన్నాడు కార్నెగీ. "కానీ నిన్ను నిన్నటిరాత్రి కలుసుకోకపోవటం ఒకవిధంగా నా అదృష్టం ఇప్పుడు చూడటంవల్ల నేను అధ్యక్షుడు హారిసన్‌తో చేసిన చర్చను గురించి విడిగా నీకు చెప్పడానికి అవకాశం కలిగింది "

"అవును అది అదృష్టమే" అని కార్యదర్శి అంగీకరించాడు.

"అప్పుడు మనం కలిసి వున్నట్లయితే అధ్యక్షుడు ముందుగానే మనం కలసి కూడబలుక్కున్నామని అనుకునే అవకాశముండేది."

అలా వాళ్లు పిచ్చాపాటిగా మాట్లాడుకునే సమయంలో పశ్చిమ వర్జీనియా సెనేటర్ ఎల్కిన్స్ లోపలికి వచ్చాడు.

వచ్చిన ఆవ్యక్తి కార్నెగీని చూడగానే నవ్వాడు. "నేను అధ్యక్షుడి దగ్గరనుంచి ఇప్పుడే వస్తున్నాను" అని అతడు "ఆయన చీలీ విషయంలో నిన్నసీతో దీర్ఘమైన సంభాషణ చేశానని ఆవిషయాన్ని గురించి సీవు ఆయనమీద విరుచుకు పడేటందుకు వచ్చావనీ అన్నాడు. శాంతినిగురించి కార్నెగీ అతి తీవ్రంగా భావిస్తాడు అని నేన్నాను. అతడు మీతో అంతగట్టిగా మాట్లాడితే నాతో ఎలా మాట్లాడుకాడో వినాలని ఉంది, నాతో మాట్లాడినట్లుగా మీతో అతడు అంత స్వేచ్ఛగా మాట్లాడడు, మాట్లాడినప్పుడు కొంత దాచుకొన్నట్లు మాటాడివుంటా డనుకొంటాను అన్నాను. అధ్యక్షుడు "అతనిదగ్గర దాచుకోటమన్న ఆగుణం అణు మాత్రమైనా నాకేమీ కనిపించ లేదని చెప్పాడు" అన్నాడు.

ఆ తరువాత బ్లెయిన్ ఎల్కిన్స్‌లు ఇద్దరూ హృదయ పూర్వకంగా నవ్వుకున్నారు.

మరునాటి సాయంత్రం భోజనం దగ్గిర ఈ విషయం చర్చకు వచ్చింది. అయితే చర్చ ఎంతో మృదువుగా నడి చింది. అధ్యక్షుడి ఉద్రేకం కొంతగా చల్లబడుతున్నట్లు కార్నెగీ గమనించాడు. కార్యనిర్వాహకవర్గంవారు కూడా అధ్యక్షుడికి అనుకూలంగా లేనట్లు అతనికి అర్థమైంది.

"ఈ విషయాన్ని తెచ్చినందుకు క్షమించండి మిష్టర్ ప్రసిడెంట్. మీరు బాగా అలసిపోయినట్లున్నారు. మీకు మంచి మంచి విశ్రాంతి అవసర మనిపిస్తున్నది. మీరు

కొంత సెలవు తీసుకొని ఎక్కడికైనా దూరంగా కొన్నాళ్లు ఎందుకు వెళ్ళకూడదు ?" అన్నాడతడు.

"పన్ను వసూలుచేసే పడవమీద కొన్నాళ్ళు ఎక్కడికైనా వెళ్లుదా మనుకుంటున్నాను. సుప్రీంకోర్టు న్యాయమూర్తి జస్టిస్ బ్రాడ్లీ కొద్దిరోజులకు పూర్వమే మరణించాడని నీకు తెలుసుననుకుంటాను. న్యాయవృత్తిని అనుసరించే వాళ్ళల్లో అతనికి 'అనుగామి'గా ఉండదగ్గవాడు ఎవడా అని నిశ్చయించడం కోసం ఆలోచిస్తున్నాను" అన్నాడు అధ్యక్షుడు హారిసన్ సమాధానంగా.

"అస్థానానికి తగిన యోగ్యతగలవాడు పిట్స్‌బర్గ్‌లో ఒకడున్నాడు. అతడూ నేను పూర్వం చేపలు పట్టటంలో సహచరులం. అందువల్ల అతనిమీద నేను అనుచితమైన పక్షపాతాన్ని వహిస్తున్నానని మిత్రులయిన మీరు అనుకోకుండా వుంటే ఈ ఉద్యోగానికి అతణ్ని నేను సూచిస్తున్నాను. అయితే అతడు నాకు అతిసన్నిహితుడైన మిత్రుడు కావటంవల్ల అతణ్ణిగురించి నేను సక్రమమైన పరిశీలనచేసి ఉండకపోవచ్చు. అతడు బాగా చదువుకున్నవాడు, సత్యనిరతుడైన న్యాయవేత్త అని మాత్రం ఎరుగుదును," అన్నాడు కార్నెగీ.

"అతని పేరు ?"

"జార్జి షిరాస్"

అధ్యక్షుడు తల పంకించాడు. "నీ సలహాను తీసుకొని అతణ్ణి పరిశీలిస్తాను" అన్నాడు.

అధ్యక్షుడు అలాగే చేశాడు. ఒక సుప్రసిద్ధు డయిన సుప్రీంకోర్టు న్యాయమూర్తిని నియమించటం ఈ రీతిగా జరిగింది. మధ్యకాలంలో బీలీ తగాదా సద్దుమణిగింది. సామరస్యం వల్ల అది పరిష్కారమైంది. అంతర్జాతీయ శాంతికి తానుగూడా కొంత తోడ్పడ్డానన్న తృప్తి కార్నెగీకి కలిగింది. ఇలా అతని వాషింగ్టన్ ప్రయాణం ఎంతో ప్రయోజనకారి అయింది.

# హోమ్‌స్టెడ్ - స్ట్రైక్

# 11

ఇనుము, ఉక్కు వాటిని ఉత్పత్తి చేయటానికి కావలసిన బొగ్గు, కోల్, ఇనుప ఖనిజాలు అన్నవాటికి తప్ప కార్నెగీ కాస్రేపను ధనాన్ని ఇతరమైన వేటిమీదా పెట్టకూడదు అని పూర్వం తాను నిర్ణయించుకున్న పధకానికి ఆండూ్రి కార్నెగీ మరీ మరీ కట్టుబడి పోతున్నాడు. హెన్రీ ఫిప్స్‌తో కలిసి ఒకనాటి ఉదయం అతడు బండిలో పిట్స్‌బర్గ్‌కు వెళ్లుతున్నాడు. అప్పుడు అతడు ఒక ట్రస్ట్ కంపెనీవారి వ్యాపార ప్రదేశంలో నుంచి ప్రయాణం చెయ్యటం జరిగింది. ఆ కంపెనీ పేరు అతని మనసులోని తంతువులను కదలించడం మొదలు పెట్టింది. "పెట్టుబడిదారులు వ్యక్తిగతంగా బాధ్యులు" అన్నవాక్యం లీలగా అతనిస్మృతికి తగిలింది.

"ఈ వ్యాపారసంస్థకు సంబంధించిన ఇరవైషేర్లు మన ఎస్టేటు ఆస్థిగా వున్నట్లు మన పుస్తకాలల్లో వుండటం నేను చూశాను కదూ" అని ఫిప్స్‌ను అతడడిగాడు,

"ఔనని ఫిప్స్ సమాధాన మిచ్చాడు.

"ఈ సాయంత్రం నీవు కార్యాలయానికి వెళ్ళగానే

వాటిని అమ్మివేసేయి.” ఫిప్స్ దానిని అంతశ్రద్ధగా కాకుండా ఎదో గా 'సరే' అన్నాడు. “అయితే అంత తొందర లేదు. ఎప్పుడయినా చెయ్యవచ్చు” నన్నాడు.

“అలాకాదు హారీ. వెంటనే జరగాలి! నా మాటను మన్నించు” అన్నాడు యజమాని. ఆ బ్యాంకు కొద్ది నెలలు కాగానే పెద్దమొత్తం లొంగుడు పడి దివాలా తీసింది. అప్పుడు అతడు షేర్లను అమ్మివేయటం మంచిదైందని సంతోషించాడు 1888లో మిల్లులు. కొరములు రోజు ఒక టికి రెండువేల టన్నుల ఉక్కు, ఇనుమును ఉత్పత్తి చేస్తున్నవి. 'కొన్నెలిస్ విల్లీ'లోని నల్లటి రెండు వేల ఎకరాల అందమైన కోహింక్ కోల్ గనుల ప్రాంతానికి మీద ఫ్రిక్ కోక్ కంపెనీ యాజమాన్యం వహిస్తున్నది. తన బాల్యం నాటి మిత్రుడయిన హారీ ఆలివర్ ద్వారా మిన్నెసోటాలో కొత్తగా కనుకోబడ్డ మిస్సబీ ఇనుప ఖనిజపుభూమిని ఎన్నో ఎకరాలు కార్నెగీ గుత్తకు తీసుకొన్నాడు. వందలకొద్ది చిన్న ఉక్కు వస్తువులను తయారుచేసే మరొక కర్మాగారాన్ని స్థాపించటం జరిగింది. దాని ద్వారా వారి ఆజాతి వ్యాపారం కూడా వృద్ధిపొందింది. ఇదైనా 'ఎ. సి.' కి తమ మార్గానికి కొంత దూరమైందిగానే కనిపించింది.

కార్నెగీకి కార్మికులవల్ల ఎన్నడూ ఎటువంటి తీవ్రమైన ఇబ్బందీ కలుగలేదు. బహుసంఖ్యాకులైన కార్మికులతో అతడు సూటిగా సంబంధం పెట్టుకొనేవాడు వాళ్ళ నాయకులందరినీ సాన్నిహిత్యసూచకంగా వాళ్ళ మొదటి పేర్లతో పిలుస్తుండేవాడు. వాళ్లు వినిపించవచ్చిన కష్టాల

వన్నింటినీ జాగ్రత్తగా ఓపికతో వినేవాడు. ఎక్కడయినా కలతలు, అన్యాయాలు ఉన్నట్లయితే వాటిని సరిదిద్దేవాడు. అయితే కార్నెగీ సంస్థలు విపరీతంగా పెరిగిపోయినప్పుడు కొత్తవ్యక్తులు. కొత్త ప్రభావాలు పరిపాలక వర్గాలల్లోను శ్రామికుల్లోనూ ప్రవేశించాయి. కార్నెగీ దీర్ఘకాలం స్కాట్లండులో ఉండిపోతుండడం వల్ల కలత లారంభమై పెరగటం ప్రారంభిస్తున్నవి. ఇప్పుడు విలేక దాక్షిణ్యాలను జోడించి తన ప్రభావాన్ని పాలకవర్గ శ్రామికవర్గాల రెంటి మీద నెరపశక్తిగల టామ్ కార్నెగీ, బిల్ జోన్స్‌లు ఇరువురూ లేకపోవటం బాగా అనుభవానికి వస్తున్నది. బోర్డు ఆఫ్ మేనేజర్లకు అధ్యక్షుడయిన ఫ్రిక్ కఠినుడు, కరుణారహితుడు అని రూఢిగా నిరూపితమైంది. హెన్రీ ఫిప్స్‌కు వయసు పెరుగుతున్నకొద్దీ అతడు ఫ్రిక్ అభిప్రాయాల వంకకు మొగ్గు చూపటం ఆరంభించాడు.

హోమ్‌స్టెడ్ కర్మాగారంలోని హీటర్లు, రోలర్లుఅన్న చిన్న శ్రామికవర్గం వారు ప్రస్తుతం ఇబ్బంది కల్పిస్తున్నారు. ఉన్నత వర్గంనుంచి వచ్చిన క్రొత్త సూపరింటెండెంటు అసంతృప్తితో అల్లరిచేస్తున్న వీళ్ళతో వ్యవహరించే విషయంలో ఎక్కువ వివేకాన్ని ప్రదర్శింపలేకపోయాడు. ఈతని దుర్భావాలే ఇతరులలో కూడా ప్రవేశించి వ్యాప్తిపొందటం ప్రారంభించాయి. బ్రాడ్డాక్ వర్క్సును సక్రమంగా పాలించటం వల్ల సంస్థలో చాలా ఉన్నత స్థాయికి చేరుకొన్న ఛార్లెస్ స్క్వాబ్ హోమ్‌స్టెడ్‌లో ఆచిన్ని శ్రామికవర్గంలో దౌర్జన్యాలు నడిపించే స్థితిలో లేడు. అందువల్ల అల్పసంఖ్య

అయిన మూడువేలమంది కార్మికులకు సంబంధించిందే అయినప్పటికీ, 1892 వేసగిలో హోమ్ స్టెడ్ కర్మాగారంలో సమ్మె వచ్చింది. కార్నెగీ స్కాట్లండులో ఉన్నాడు. ఈ అవకాశంవల్ల చేకూరిన ఉత్సాహంతో సమ్మెను బద్దలు కొట్టేవాళ్ళకు ఉద్యోగాలిచ్చి ప్రోత్సహించటానికి ఫ్రిక్, సూపరింటెండెంటు ఇద్దరూ నిర్ణయించారు. ఇది వాళ్ళ అధ్యక్షుడయిన ఆండ్రూ కార్నెగీకి హృదయ ప్రియాలయిన సిద్ధాంతాలల్లో ఒకదానికి పూర్తిగా వ్యతిక్రమము. ఈ విషయం అతడు పూర్వమే లిఖితరూపంగా వెల్లడుచేశాడు. "ఎవరయినా పనిచేసేవాళ్లు పనిమానివేస్తే మానివ్వటమే కంపెనీ కృతనిశ్చయమని వారికి తెలియజేయాలని నాఊహ. అట్టివారితో స్వేచ్ఛనిచ్చి సంప్రదింపులు సాగించాలి. వాళ్లు తిరిగి పనిలోకి వెళ్లుదామని నిశ్చయించుకొనేదాకా ఓపిక పట్టి ఆగాలి కానీ కొత్తవాళ్ళను పెట్టుకోటం ఎన్నడూ పనికిరాదు, పనికిరాదు."

ఫ్రిక్స్ ఉద్దేశాన్ని గురించిన కింవదంతులు విని సమ్మె చేసిన శ్రామికులు సాయుధులై కర్మాగారానికి ప్రక్క వీథుల్లో పికెటింగ్ చేశారు. సమ్మెను బద్దలు కొట్టేవారు కర్మాగారంలో ప్రవేశించేటప్పుడు వారికి రక్షణను ఇచ్చేటందుకు కౌంటీషరీఫ్ ఒక పెద్ద డిటెక్టివ్ ఏజన్సీని ఏర్పాటు చేశాడు. సమ్మె చేసినవాళ్ళు వీథులను అడ్డివేయటం వల్ల జూలై 1 న రక్షణ యిచ్చి కొత్తపనివాళ్ళను పడవలమీద తీసుకొవచ్చి మిల్లులోపలికి మోనోంగహేలా నదిమీదుగా వెనకభాగంనుంచి ప్రవేశపెట్టటం జరిగింది. అప్పుడు కలిగిన

కలహంలో ఉభయపక్షాలల్లో చాలామంది వ్యక్తులు గాయ పడ్డారు, కొందరు మరణించారు. చివరకు క్రొత్తగా ఎత్తి వచ్చినవాళ్ళను దెబ్బకొట్టి తరిమివేయటం జరిగింది.

ఉభయవర్గాలవారు తాము చేసిన దానికి తల్లడ పడ్డారు. సంధిచేసుకోటం సముచిత మనిపించింది. ఈ విష యము రెండు రోజులు గడచిన తరువాత గాని స్కాట్లం డులో వున్న కార్నెగీకి తెలియలేదు. అప్పుడు అతడు తనకు లభ్యమయిన మొదటి నౌకమీద బయలుదేరి వస్తున్నానని విస్తంత్రీ వార్త (కేబిల్) పంపించాడు. ఫ్రిక్, ఫిప్సులు ఇద్దరూ కంపెనీ క్షేమం కోసం ఈ తడవ అక్కడే అమెరికాకు దూరంగా ఉండవలసిందని కోరుతూ సమాధానం పంపించారు. ఇందుకు కారణమేమిటో ఊహింపలేక పోయి నప్పటికీ కార్నెగీ వారి అభ్యర్థనను మన్నించి అక్కడే వుండిపోయినాడు. "మమ్మల్ని ఏమి చెయ్యమని మీరు కోరుతారో తెలియజెయ్యండి. మీకోసం మే మా పనిని చేసి తీరుతాం" అని కలహం అయిపోయిన తరువాత కార్మి కుల యూనియన్ ఉద్యోగులు యిచ్చిన విస్తంత్రీ వార్తవల్ల విషయం తెలుసుకొని కార్నెగీ ఎంతో చలించిపోయాడు. ఏం ప్రయోజనం. కాలం గడిచిపోయింది. నష్టం జరిగి పోయింది. తరువాత పన్నెదు సంవత్సరాలకు తాను కార్నె గీని అక్కడ ఉండిపొమ్మని అడగటానికి కారణం "వారు కోరేవి యెంత అనుచితంగా వున్నా ఆయన ఎల్లప్పుడూ శ్రామికుల కోర్కెలనే అభిమానించి తీర్చే మనఃప్రవృత్తితో వుంటాడు గనుక, వాళ్లు వాళ్ళ యిష్టప్రకారంగా వ్యవహ

రాన్ని సాధించదలచుకొన్నారు గనుక" అని న్యూయార్క్ న్యూస్ పేపర్ విలేకరులతో ఒప్పుకున్నాడు.

కొన్ని సంవత్సరాలయిన తరువాత కార్నెగీ ఈ విషయాన్ని గురించి తన ఆత్మకథలో ఇలా వ్రాసుకొన్నాడు: "నాజీవితంలో ఇంతకు పూర్వంగాని, తరువాతగాని ఎన్నడూ ఇటువంటి సమస్యను ఎదుర్కొనవలసి రాలేదు. ఏదీ యింత తీవ్రంగా నన్ను వ్యథ పెట్టనూలేదు. ఈ హోమ్‌స్టెడ్ వ్యవహారంలో తప్ప నా వ్యాపారిత జీవితంలో నే పొందిన మరొక గాయమేదీ లేదు."

ఆకురాలే కాలం రాగానే అతడు అమెరికాకు వచ్చినప్పుడు కర్మాగారానికి వెళ్ళి ఆ కొట్లాటలో పాల్గొనని కొందరు వృద్ధులతో మాట్లాడాడు. "మీరు ఇక్కడ ఉన్నట్లయితే సమ్మె వచ్చేదేకా"దని వారతనికి సమాధానం చెప్పారు. కర్మాగారం యిచ్చిన 'నజరు' చాలా సముచితంగా వుందిగదా!" అని అతడన్నప్పుడు ఆ వృద్ధుల్లో ఒకడు "మిస్టర్ కార్నెగీ! ఇది డాలర్లకు సంబంధించినది కాదు. ఆ పిల్లలను నీవు తన్నినా ఒప్పుకుంటారు, కానీ ఇంకొకడు జుత్తుమీద చెయ్యి వేసి తట్టినా ఊరుకోరు"

ఏమైనా అమెరికాలో అనేకమంది ఈ ప్రమాదాన్ని గురించి విన్నవెంటనే అతడు తిరిగి రాకపోవటం పిరికితనాన్ని ప్రదర్శించటమని అనుకొన్నారు. అతణ్ణి విమర్శించే స్వభావం గలవాళ్లు తరువాత చాలకాలం వరకూ ఇలాగే అతనికి వ్యతిరేకంగా అంటూ వచ్చారు. తనకు ప్రియమైన మర

తులమీాద సమర్థులని తోచిన యువకులను భాగస్థులనుగా తీసుకోవటం యింకా అతడు కొనసాగిస్తూనే వస్తున్నాడు. ఇంతవరకూ అటువంటివాళ్ళు ముప్పదిమంది దాకా ఐనారు; వీళ్ళలో ప్రతి ఒక్కరికీ అనంతసంఖ్యలో 'స్టాప్' ఉంది. ఇలాంటి వాళ్ళల్లో ఒకడయిన ఒక స్కాబ్ యువకుణ్ణి భాగస్వామిగా గ్రహింపబోయేముందు తన ఉద్దేశాన్ని తెలియజేస్తూ అతడు "పీకాక్, నిన్నొక మిలియనీరును చేస్తే నాకేమిస్తావు" అన్నాడు కార్నెగీ. ఆ డబ్బుకుతగ్గట్లు ధారాళమైన డిస్కౌంటు ఇస్తానని వెంటనే ఆ యువకుడు చమత్కారంగా సమాధానం చెప్పాడు. అది ఆ ప్రముఖ వ్యాపారిని విశేషంగా గిలిగింత పెట్టింది.

మార్చి 30, 1897 నాడు కార్నెగీకి ఒక కుమార్తె కలిగింది. ఈ బిడ్డ చాలా అందమైంది. ఈమె తరువాత అతనికి మరెవ్వరూ బిడ్డలు కలుగలేదు. తన ఏకైక సంతానమైన ఈ బిడ్డను అతడు తొలిసారిగా చూచినప్పుడు భార్య అతనితో అన్నది. "ఈ బిడ్డ పేరు మార్గరెట్ మీా తల్లిగారి పేరు ఆమె జ్ఞాపకార్థం ఈ పేరు పెట్టుకుందాము. నాదో చిన్న అభ్యర్థన."

"లౌ, ఏమిటది?" అని అడిగాడతడు.

"మనకు పరమేశ్వరుడిచ్చాడు. గనుక మనకొక వేసగి గృహమంటూ ఉండాలి. ప్రతిసారి మరొకరి ఇల్లును అద్దెకు పుచ్చుకొంటూ, ఒక తేదీనాటికందులో ప్రవేశించటం, మరొక తేదీనాటికి ఖాళీ చెయ్యటం మనం చెయ్యలేము. అది ఇక మన ఇల్లే ఐ ఉండాలి."

అతడు వెంటనే అంగీకరించాడు.

"ఈ విషయంలో నా దొక నియమముంది" అన్నది ఆమె.

"యేమిటది ?"

"అది స్కాట్లండు పర్వత ప్రాంతంలోనే ఉండాలి.

ఆమె అతనికి అంతకంటే సంతోషాన్ని కలిగించే మరొకదాన్ని దేన్నీ సూచించలేదు. ఎలా వున్నప్పటికీ వారు ఇక క్లనీ కాజిల్‌ను వేసవి గృహంగా పొందలేరు. మాక్ఫర్సన్ వివాహం చేసుకుంటున్నాడు. ఇక ఆ గృహం అతని ఉపయోగంకోసం అతనికే అవసరం పది వేసగి సమయాలు కార్నెగీలు అక్కడ నివసించటం వల్ల వారితో అతనికి సన్నిహిత మైత్రి ఏర్పడింది. బిడ్డ కలిగిన వెంటనే వారు అతనికి కేబిల్చి తెలియజేశారు. అతడు ఆ సంతోష వార్త విని అతడు తన మెక్ఫర్సన్ ప్రాంతంలో గొప్ప ఉత్సవం చేయించాడు. తొమ్మిది కొండలమీద మంటలు వేయడం, విందులు జరపటం, కార్నెగీల ఆరోగ్యంకోసం మధుపానాలు చెయ్యటం ఆ ఉత్సవంలోని విశేషాలు.

అందువల్ల నూతన పిత అద్దెకుగాను క్రొత్త మిరాసీని (Manor) వెదకకుండా స్వంత ఆస్తినే కొనటానికి యత్నిస్తున్నాడు. డ్యూక్ ఆవ్ సథర్‌లాండ్‌కు స్కైవో అనే పేరుతో ఉత్తరస్కాచ్ పర్వతప్రదేశంలో ఒక ఎస్టేటు ఉన్నదనీ, అతను దాన్ని అమ్మదలుచుకున్నాడనీ అతడు తెలుసుకున్నాడు. అడవులు, సుందరమైన నిమ్నోన్నతాలు ప్రీతికరమైన

వాహ్యాళిస్థలాలు, ఆరోహణాలు, మంచి మత్స్య సంపద గల సరస్సులు, విశ్వసించదగిన సమస్థితి గల వాతావరణం. జన వరిలో వికసించే పుష్పకుంజాలు అన్నీ దానికి వున్నట్లు అతడు తెలుసుకున్నాడు. ఆ ఆస్తికి వున్నవాటన్నిటిలో అత్యుత్తమమైంది ఉన్న శిలా ప్రదేశం పైనిల్చి నదీ సాగర సంగమం వంకకు తిలకిస్తూ ఉన్న గొప్ప ప్రాచీన శిలాసౌధం చూచిన వెంటనే కార్నెగీకి ప్రీతి కలిగింది. అతడు దాన్ని కొన్నాడు. కొన్నిమార్పులు కూర్పులు చేసి క్రొత్తరూప మిచ్చాడు. ఎలివేటర్‌ను ఏర్పాటు చేయించాడు విద్యుద్దీపా లను పెట్టించాడు. ఆధునికమైన 'ప్లంబింగ్'ను పెట్టించాడు. టర్కిష్ స్నాన శాలలను నిర్మించాడు. అందులో మేలుజాతి పశువులు గల 'సానిటరీ డైరీ'ని నెలకొల్పాడు. అందలి పూ ద్రోటలు అమిత ఖ్యాతి వహించాయి.

ఆ సౌధం కార్నెగీల ఇంటికి ఎందరు అతిథులు వచ్చినా ఒక్కమాటుగానే ఆతిథ్య మివ్వటానికి తగినంత విశాలంగా వుంది. అతిథుల అసంఖ్యాకంగా వస్తుండేవారు. వయోవృద్ధులైన మిత్రులు గ్లాడ్‌స్టన్, మేథ్యూ ఆర్నాల్డుల వంటివారు వెళ్ళిపోయినారు. తరువాత తరంవారైన రుడ్డి యర్డు కిప్లింగ్, పాడెరివిస్కీ, సర్ ఎడ్వర్డుగ్రే, స్కాబ్ ఉక్కు నిర్మాత సర్ ఛార్లెస్ టెన్నంట్, ఇలిహురూట్, ఉన్నత వర్గం వారైన ఇంకా ఇతరులు అతిథులుగా వస్తుండేవారు. వారి పూర్వ మిత్రులు లార్డు, లేడీ మోర్లేలు ఋతువుకు రెండు మార్లో మూడు మార్లో వచ్చి వెళ్లుతుండేవారు. స్కిబోకు పదిమైళ్ళ దూరాన వున్న రైలు స్టేషను దగ్గిర

విక్టోరియా యుగపు తొలిరోజులనాటి నాలుగు గుర్రాల బండి ఒకటి క్రొత్త వార్నీసు మెరుపుతో నీటుగా నిలచి అతిథులకు స్వాగత మిస్తుండేది. ఎర్రకోటు వేసుకొన్న బోదకు డొకడు దాన్ని నడుపుతుండేవాడు. ఇతని లాగానే ఎర్రకోటు తొడిగి బండి వెనక ఎత్తయిన ఆసనంమీద కూర్చొని 'కాలరి' (Footman) ఒకడు 'శృంగా'న్ని (Horn) ఊదు తుండేవాడు.

స్కిబోయిలర్డ్ అనిపించుకున్న కార్నెగీ వంశవృక్షాన్ని వంశ లాంఛనాలను అసహ్యించుకున్నాడు. కాని స్కాచ్ దేశీయులు ధరించే దుస్తులకు కొద్ది మార్పులుజేసి 'కార్నెగీ ప్లయిడ్' అన్న ఉడుపును రూపొందించుకొన్నాడు చిన్ని మార్గరెట్ ఇంట్లో తిరుగుతున్నప్పుడు, తండ్రి చేయి పట్టు కొని నడుస్తున్నప్పుడు, కొండ ఎక్కుతున్నప్పుడు స్కాట్లండు లోని పర్వత ప్రాంతీయులు ధరించే రంగురంగుల తార్తాను ధరిస్తుండేది. కార్నెగీ స్కిబో వుండేటప్పుడు ఈ కుచిళ్ళ దుస్తును తానే ధరిస్తుండేవాడు. ఆ ఎస్టేటులో పనిచేస్తున్న సేవకులు, శ్రామికులుకూడా దీన్నే ధరిస్తుండేవారు స్కిబో పరిసరాలల్లో ఈ గుడ్డను కుటీరాలల్లోని మగ్గాలమీద చేత్తో నేస్తుండేవారు. అక్కడ అక్కడ స్కాచ్ తనానికి విశేష ప్రాముఖ్య మివ్వబడింది. స్కాచ్ గృహపాలకుడు, స్కాచ్ ఉగ్రాణోద్యోగి (Butler), ఒకరో ఇద్దరో స్కాచ్ ఉప సేవ కులు. పై పరుకూడా వీరివలె స్కాచ్. ఇతడు ఉదయవేళ మేల్కొలుపుతూ, భోజన సమయాలల్లో తన జంత్రంమీద పార్వతేయ గీతాలను అటూ ఇటూ తిరుగుతూ వినిపిస్తుండే

వాడు. ఇతడు ఆ ప్రదేశంలోని ప్రముఖ వ్యక్తులలో ఒకడు. వీళ్ళందరూ చలికాలాలకు ఆ కుటుంబంతో బాటు అమెరికా వెళ్ళేవాళ్ళు. ఆ ఎస్టేటులోని శ్రామికుల ఉద్యోగాల లాగానే వీరివి కూడా జీవితపర్యంతోద్యోగాలు.

జూలై నాల్గవ తేదీన ఆసౌధంమీద బ్రిటిష్ అమెరికన్ జెండాలు రెండూ ఎగురుతున్నవి ఈ రీతిగా రెండు జెండాలు మరొక కొత్త జెండాను ఎగురవేసేటంతవరకు ఎగిరాయి. ఈ క్రొత్త జెండా తొలుత తొలుతగా వచ్చిన అతిథులకు ఆశ్చర్యాన్ని కలిగించింది. వారు దానివంక జాగ్రత్తగా పరిశీలించి చూచినమీదట తమ 'అతిథేయి' గ్రేట్ బ్రిటన్ అమెరికాల జెండాలను రెంటినీ కలిపి విశిష్టంగా రూపొందించుకున్న సమ్మేళిత పతాకమని వారర్థం చేసుకున్నారు. ఆ పతాక బహుశః ఉద్దేశించినది కాకపోయినా, ఒకనాటికి గ్రేట్ బ్రిటన్, అమెరికాలు రెండూ కలిసి ఒక గణతంత్ర రాజ్యం లాగా సమ్మేళనాన్ని పొందబోతున్నవన్న ఉద్దేశాన్ని వ్యక్తీకరిస్తున్నట్లుండేది.

కార్నెగీ వనజంతువులను చంపటం సహించలేడు. జింకలు, కుందేళ్ళు, అడవి కోళ్లు అతని ఎస్టేటులో అసంఖ్యాకంగా వున్నవి. అయితే అతడు వాటిని ఎన్నడూ వేటాడలేదు. అతడు అతని అతిథులు చేపలను పట్టడానికి వెళ్లు తుండేవాళ్లు "వెళ్ళండి, మీకు ప్రియమైనదైతే వేటకు వెళ్ళండి. కానీ చంపవలసి వస్తే తప్ప చంపవద్దు దాన్ని గురించి నాకు ఏమీ తెలియనివ్వవద్దు" అని అతిథులతో

అనేవాడు. అటువంటి పరిస్థితిలో ఏ కొద్దిమందో తప్ప వేటాడ టానికి పూనుకుండేవాళ్లు కారు. మానవులది గాని, జంతువు లది గానీ రక్తపాతమంటే కార్నెగీ అసహ్యించుకొనేవాడు.

ఈ మధ్యకాలంలో అతడు నెంపాదిగా చిన్న కళా శాలకు, చర్చిలకు సినొగాగ్‌లకు, ఆర్గనులను కొనుక్కో టానికీ, జంతువాద్య సమ్మేళనాలను పెంపొందించుకోవ టానికి; గ్రంథాలయాలను నిర్మించుకోటానికి డబ్బు ఇస్తుండే వాడు. స్కిబోకు పదిమైళ్ళ మేరలో వున్న ప్రతి చిన్న గ్రామంలోను, కొన్ని సందర్భాలల్లో ఇంకా చిన్న గ్రామాల ల్లోను కార్నెగీ గ్రంథాలయం ఏర్పడింది. అతడు న్యూయార్క్‌లోని కూపర్ ఇన్స్టిట్యూట్‌కూ, మర్చంట్స్ అండ్ ట్రేడ్‌మన్ ఇన్స్టిట్యూషన్‌కు ఒక్కొక్క దానికి 7,50,000 డాలర్లు ఇచ్చాడు. పాత మిత్రత్వాలను అంటిపెట్టు కార్నెగీ 1859 మొదలు 1863 వరకూ పెన్సిల్వేనియా రైల్ రోడ్డు పిట్స్‌బర్గు డివిజనులో తన క్రిందపని చేసిన వారంద రికీ పింఛను (Pension) లిచ్చాడు. వారిలో కొందరు సహా యానికి దరఖాస్తులు పెట్టుకొన్నారు. చివరకు అందరినీ వెతికి వారికి, వారి వితంతువులను కూడా కలిపి పింఛనుల పట్టికను తయారుచేయమని తన మిత్రుడయిన టామ్ మిల్లర్‌ను నియ మించాడు "వీరి మధ్యలోకి వెళ్ళినప్పుడు నేను చిన్న కుర్ర వాడను వీరంతా నా యెడ ఎంతో దయాళువులై ప్రవ ర్తించారు. వీరు నా ప్రియమిత్రులు" అని వీరిని గురించి వివరించాడు. మిల్లరు ప్రతివ్యక్తిని గురించి రిపోర్టు పంపి నప్పుడు చాలా వాటిమీద "జాన్ నాకెంతో బాగా గుర్తు

న్నాడు "బిల్ మా మంచి ట్రాల్‌మన్‌లలో ఒకడు" "హై స్టీకి నాశుభాకాంక్షలను అందజెయ్యి" -ఈరీతిగా లఘుటీకలు వ్రాశాడు.

అంతర్యుద్ధకాలంనాటి సైన్యములోని టెలిగ్రాఫర్లంటే కార్నెగీకి ప్రీతి విశేషం. అతనికి వారితో కొంత లీలగా సంబంధ మున్నది. వారు నిర్మించుకొన్నదీ చారిత్రక ఖ్యాతిగన్నదీ ఆయన సమాజంలో కార్నెగీ ఒకప్పుడు సభ్యుడు. కొన్నిమార్లు వారి వార్షిక సమావేశాలకు హాజరైనాడు. వార్తాహారి బాలుడుగా వున్న తన తొలినాటి అనుభవాలను గురించి అతడు ఆ సభల్లో ప్రసంగించాడు. సైన్యానికి వీరిసేవ అత్యంత ప్రధానమైందికనుక వీరికికూడా పింఛనులు ఇవ్వాలని ఎంత చెప్పినా ప్రభుత్వం పట్టించుకో లేదుగనుక అతడికి కోపం కలిగింది. సైనికుల లాగానే వీళ్ళల్లో చాలామంది యుద్ధభూమిలో ప్రాణాలను కోల్పోయినారు. వికలాంగులయినారు. గాయాలు తగిలి, వాతావరణం పడక ఆరోగ్యాన్ని చెడగొట్టుకున్నారు. శత్రువుల కారాగారాలల్లో బంధితులయినారు. వారి దేశ ప్రభుత్వం దగ్గరనుంచి వారు పుచ్చుకో వలసినంత మొత్తాలు వారికి చెల్లించటానికి వీలు కలిగేటట్లు అతడు 'కార్నెగీ నిధి'ని ఏర్పాటు చేశాడు.

చిత్రమైన చిక్కుల్లో పడ్డ వ్యక్తులమీద కార్నెగీ తప్పనిసరిగా చూపించే దయకు క్రింది దొక ఉదాహరణం మాత్రమే.

మిష్టర్ గ్లాడ్‌స్టన్ ఒకమారు అతనితో అన్నాడు "మన మిత్రుడు లార్డు ఆక్టన్ ఆర్థిక సముద్రంలో మునిగి

పేదే స్థితిలో వున్నాడు. అది నన్ను బాధ పెడుతున్నది. అతడికి ఎంతమంచి గ్రంథాలయముందో నీకు తెలుసు. చూశావు కూడాను. అయితే, దాని విలువ అంతా అతనికి తిరిగి రాకపోయినప్పటికీ దాన్ని విడిచిపెట్టటమంటే దరి దాపుగా అతని గుండె బద్దలయ్యే పరిస్థితి ఉన్నప్పటికీ, విక్రయిద్దామనుకుంటున్నాడు.

కార్నెగీ "దాన్ని నేను కొంటాను. అయితే...

గ్లాడ్‌స్టన్ మధ్యలో ఆపి "నన్నొక సూచన చెయ్యనీ. అతని జీవితం పర్యంతం దాన్ని అతనిదగ్గరే ఉండనీ. అతని తదనంతరం దాన్ని నీవు నీ ఇష్టం వచ్చినట్లు చెయ్యనీయ వచ్చు.

ఆ రాజనీతిజ్ఞుడితో కరచాలనం చేస్తూ "తప్పక చేస్తాను. మీ సూచనకు నా మనస్సులు."

ఆక్టన్ చెప్పిన ఖరీదుకు అతడుఆతని గ్రంథాలయాన్ని కొన్నాడు అయితే గ్లాడ్‌స్టన్ చెప్పినటు ఆ ఉదాత్తుడయిన లార్ బహుకాలం జీవించలేదు. 1902 లోని ఆతని మృతికి పిమ్మట అనతికాలానికే కార్నెగీ మోర్లేలు కలుసుకొన్నారు కార్నెగీ మిత్రునితో "మీ కో విషయం చెప్పాలి. కొద్ది సంవత్సరాలకు పూర్వం లార్డు ఆక్టన్ ఇబ్బందుల్లో ఉన్న ప్పుడు అతని గ్రంథాలయాన్ని అమ్మకానని సూచన చేస్తే...

మోర్లేమొగాన ఉదయించిన చిరునవ్వు ఆ వాక్యాన్ని మధ్యలో ఆపింది. "ఈ విషయం మీరు కొన్న రోజునుంచి నే నెరుగుదును" అన్నా డతడు

"మీకు తెలుసునా !"

"అవును. గ్లాడ్‌స్టన్ ఈ రహస్యాన్ని నిలుపుకో లేక పోయినాడు. దానిని అతడు లార్డు ఆక్టన్‌కు జీవిత పర్యంతం దక్కించగలిగినందుకు మహానందపడ్డాడు."

"బాగుంది. దాన్ని నే నిప్పుడు మీ పరం చెయ్య బోతున్నాను."

"నా పరమా ! ఆశ్చర్యపడటం ఇప్పుడు నా వంతుకు వచ్చింది."

"ఔను. దానివల్ల సక్రమమైన ప్రయోజనాన్ని పొందటం మీకు బాగా తెలుసు. మీరు తరువాత దానిని విచ్ఛిన్నం కాకుండా చూసి, కావాలని మోహపడే ఒక సంస్థకు ఇచ్చివేస్తారని నమ్ముతున్నాను."

# సంకట స్థితి - పరిష్కారం

## 12

కొంత కార్నెగీ వాటాలలో కొన్నింటిని స్టాక్ మార్కెట్టులో ప్రవేశపెట్టేటందుకు యితరుల చేతుల్లోకి - వాస్తవానికి బ్రోకర్ల చేతుల్లోకి, ప్రవేశపెట్టాలని ఫ్రిక్ ఎప్పుడూ వుద్దేశపడుతుండటం కార్నెగీకి తెలుసు. చివరకు పిట్స్‌బర్గు బ్యాంకరయిన ఒక కోటీశ్వరుడికి కార్నెగీ కంపెనీ వారి రెండు శాతం వాటాలను అమ్మి కొన్ని అభివృద్ధులను సాధించవలసిందని కంపెనీ కోశాధికారికి సూచన చేసినప్పుడు, దీనిని మించేటట్లుగా స్టాక్ ధరను గురించి కార్నెగీతో నోటి మాటగా చేసుకొన్న ఒడంబడికను జాత్తిగా తోసిపుచ్చినపుడు సహజంగా శాంతస్వభావుడయిన ఆ స్కాచ్ దేశీయుడు వున్మత్తుడయినాడు.

హెన్రీ ఫిప్స్ ఫ్రిక్ పక్షంవహించటం కార్నెగీని అన్నిటికంటె అధికంగా గాయపరచింది. ఫ్రిక్‌ను కంపెనీ నుంచి తొలగించాలని నిశ్చయించుకొని 1899 శరత్తులో తీక్షణముఖుడై ఇంటికి తిరిగివచ్చాడు. యింతకుపూర్వం ఎన్నడూ భాగస్థులతో అతనికి తీవ్రమయిన వివాదా లేవీ

రాలేదు. అయినా, కార్నెగీ తప్పనిసరి అయి తాను తీసు కోటానికి నిశ్చయించుకొన్న చర్యను అసహ్యించుకున్నాడు. తన స్టాకును యితర భాగస్థులకు అమ్మి కంపెనీలోనుంచి ప్రశాంతంగా విరమించుకోమని అతడు ఫ్రిక్‌కు సూచన చేశాడు. అందుకు ఫ్రిక్ నిరాకరించాడు. ఈ కారణాంగా ఖరీదయిన దావా నడించింది. అతణ్ని పంపించి వేయుటం కోసం రాజీ పడవలసివచ్చింది. చివరకు ఫ్రిక్ వెళ్ళిపోయి నాడు. తరువాత ఫ్రిక్ కార్నెగీతో సంధియత్నాలు చేశాడు. వారిరువురూ తిరిగి మిత్రులయినారు. అయినా వెనుకటి సంవత్సరాలలో కనుపించిన సౌమనస్యం వారికి మళ్ళీ ఎన్నడూ చేకూరలేదు. తన్ను ఎన్నో రెట్లు మించిన కోటీశ్వరుడయి జీవించి మరణించినా ఫ్రిక్‌కు తన పథకాలను నిరంతరం భగ్నం చెయ్యటమే పనిగా పెట్టుకుంటాడని కార్నెగీ అంటే అనిష్టం.

ఈ కలహం కార్నెగీని వ్యథపెట్టింది. ఒకవంక అతడు వ్యాపారికమయిన బాధ్యతలనుంచి విడుదలపొందాలని అతిగా కుతూహల పడుతున్నాడు. మరొకవంక తన జీవితమంతా దేన్ని సాధించాడో దాన్ని వదలిపెట్టి వెళ్ళిపోవట మన్న భావాన్ని ఎదుర్కోలేక పోతున్నాడు. మహాశక్తిమంతుడయిన జె. పియర్‌పాంట్ మోర్గన్ అధ్యక్షతన నడుస్తున్న మోర్గన్ బ్యాంకింగ్‌హౌస్ ఉక్కు వ్యాపారపు పెట్టుబడులను కొనటం ప్రారంభించింది. ఈ సమయంలో కార్నెగీ సంస్థకు స్వాబ్ అధ్యక్షుడు. కార్నెగీ సంస్థ ఓహియో రాష్ట్రంలో ఈరీసరస్సు వొడ్డున కోన్నియాట్ దగ్గర క్రొత్త ఉక్కు

కర్మాగారాన్ని నిర్మించి దానికి ఎదురుదెబ్బ తీసింది. మిస్సాబి ఇనుప ఖజానాన్ని ఈ క్రొత్త కర్మాగారానికి సూటిగా పడవలమీద చేర్చటానికి వీలుంది.

మోర్గన్ యిప్పుడు కార్నెగీని కొనివెయ్య గలమా అని అబ్బురపడటం ప్రారంభించాడు. ఇతడు జాన్ డబ్లియు. గేట్సు దగ్గరనుంచి బార్బుడువైరు, ఉక్కు వ్యాపారాలను కొన్నాడు. అతడు మోర్గన్‌తో యిలా చెప్పాడు. "కార్నెగీ దగ్గిరపలుకుబడి గలవ్యక్తిఒక్కడే వున్నాడు. అతడు చార్లీ స్కాబ్. అతణ్ని పట్టగలిగితే మీపనిజరుగుతుంది."

మోర్గన్ స్కాబ్‌ను, ప్రముఖులయిన యితరఉక్కు వ్యాపారస్థులను సిమాలోచనలకోసం ఆహ్వానించాడు ఒక రాత్రంతా మరపురాని సమావేశం జరిగింది."

స్కాబ్ వారితో "వ్యాపారిక బాధ్యతవల్ల ఆయన అలసిపోతున్నాడు. అయినా ఉక్కుతో వున్న సమస్త సంబంధాన్ని వదలుకోటానికి ఆయన యిష్టపడడు." అన్నాడు ధరలను గురించి కర్మాగారాల మూల్యాలను గురించి కొన్ని గంటల చర్చలు సాగినతరువాత స్కాబ్ "ఈ విషయంలో నేను చేయగలిగింది చేస్తాను." అని వాగ్దానం చేశాడు.

అతడు ఎంతో తెలివిగా మొదట మిసెస్ కార్నెగీని కలుసుకున్నాడు.

"ఆయన యిక విరమించుకోవాలి" అని ఆమె అంగీకరించింది. ఈ భావం అప్పుడప్పుడూ ఆయన మనస్సుకు రావటం నాకు తెలుసు. అయినా దానినుంచి పూర్తిగా

విడిచిపెట్టమనే భావాన్ని ఆయన అసహ్యించుకొంటుంటాడు" అన్నది.

కొంతసేపు వాళ్ళిద్దరూ దాన్ని గురించి చర్చించుకొన్నారు. "ఆయనను ఏ గోల్ఫ ఆటకో తీసుకుపోయి అక్కడ ఉల్లాసంగా వున్నప్పుడు ఈ విషయాన్ని నీ వెందుకు సూచించగూడదు !" అన్న దామె. చిరు నవ్వుతో ఇంకా యిలా అన్నది. "ఈ భావాన్ని ఆయనకు నచ్చజెప్ప గలవాడెవడయినా ఉన్నాడంటే, ఛార్లీ అది నీ వొక్కడవే" అన్నది,

అందువల్లచార్లీస్ స్క్వాబ్ తనయజమానిని వెస్ట్‌ఛెస్టర్ కౌంటీలోని గోల్ఫ క్లబ్‌కు తీసుకు పోయినాడు. యిద్దరూ అక్కడ ఒక పచ్చిక బీడులు మీదుగా నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ నడుస్తున్నప్పుడు స్క్వాబ్ విషయాన్ని ఎత్తుకున్నాడు. మొదట అతడు ఏమాత్రం సుముఖుడుగా లేడు. "కాదు. కాదు. విరమించుకోటం నాకు యిష్టంలేదు " అని కళవళ పడుతూ అన్నాడు. ఆ తత్తరపాటు అతడు మనసులో ఒక అంతర్యుద్ధాన్ని సాగిస్తున్నట్లు వెల్లడి చేస్తున్నది. ఇప్పుడు ఆయనను ముట్టడించినవాడు చరిత్రలోకల్లా ప్రసిద్ధుడయిన సేల్స్‌మన్ అని సమకాలికుల చేత అనిపించుకొన్న వ్యక్తి. అతని అందానికి తిరిమి ఒప్పించే నేర్పుకు దరిదాపుగా తట్టుకో గలగడం అంటూ వుండదు.

"వ్యాపారంలో పెట్టేందుకు మోరన్‌కు వందలకొద్ది మిలియన్లున్నాయి. అతడు మనకు చాలా క్లేశకరమయిన ప్రతిద్వంది అయితీరుతాడు. అంతేకాదు అతడు మీ రే మడి

గితే అది దరిదాపుగా ఇవ్వటానికి సంసిద్ధుడయినాడు" అన్నాడు స్క్వాబ్.

"కావచ్చు. నాకు డబ్బుతో పని లేదు. వ్యాపారం నుంచి బయటకు వెళ్ళి నేను చేసే దేముంది ?" అన్నాడు కార్నెగి అడ్డు చెబుతూ.

"డబ్బును దానంచేస్తూ మహానందాన్ని అనుభవించవచ్చు. మీ ఐశ్వర్య సువార్తను నిరూపించి చూపవచ్చు. "ఇలా అతడు యజమాని నిశ్శబ్దంగా వింటూంటే వాక్య పరంపరను క్రుమ్మరించాడు.

చివరకు కార్నెగీ అడిగాడు. "దీన్ని గురించి ఇతర భాగస్థుల అభిప్రాయ మేమిటి ? మరి, వాళ్ళతో నీవు సంప్రదించావా ?"

"మేము ముగ్గురమో, నలుగురమో ఒకరితో ఒకరు ఏదో చెప్పుకున్నాము" అని స్క్వాబ్ ఒప్పుకున్నాడు. "అయితే వాళ్ళంతా అంగీకరిస్తారని నా నిశ్చయం. మాలో ఉక్కు వ్యాపారంలో వుండిపోదలచుకొన్నవా ళ్ళెవరయినా వుంటే మోర్గన్ రూపొందిస్తున్న ఆ యునైటెడ్ స్టేట్స్ స్టీల్ కార్పొరేషన్‌లో స్టాకును, బాండ్లను పుచ్చుకొంటాము మీరు వెంటనే డబ్బు రూపంలోకి మార్చుకొనేందుకు గాని దాన ధర్మాల కుపయోగించుకొనేందుకు గాని అనువైన బాండ్లనే తీసుకోవచ్చు."

మధ్యాహ్నమైంది. వాళ్లు కొద్దిసేపటికి విడిపోబోయే టంతవరకూ కార్నెగీ ఇంకా కొంత మాట్లాడాడు. "ఇతర

భాగస్థులను కలుసుకో" వారి అభిప్రాయాలేమిటో తెలుసుకో అని అతడు ఆదేశించాడు.

ఇతర భాగస్థు లందరూ అమ్మకానికి అంగీకరించారు స్క్వాబ్ ఆ విషయాన్ని మోర్గన్‌కు తెలియజేశాడు. అప్పుడు ఆ బ్యాంకరు కార్నెగీని టెలిఫోన్ మీద పిలిచాడు. ఇరువురూ శుభాకాంక్షలను చెప్పుకున్న తరువాత అతడు అతి ముఖ్యమయిన విషయాన్ని ఎత్తుకున్నాడు. "మీరు ఇక్కడికి వచ్చి ఎందుకు దాన్ని గురించి మాటాడగూడదు ?" అని ఆ బ్యాంకరు సూచన చేశాడు.

"మిష్టర్ మోర్గన్, ఫిఫ్టీఫస్ట్ స్ట్రీట్ నుంచి వాల్‌స్ట్రీటు ఎంతదూరమో, వాల్‌స్ట్రీటునుంచి ఫిఫ్టీస్ట్రీటు అంతేదూరం" అని ఆ ఉక్కురాజు మధురంగా ప్రత్యుత్తర మిచ్చాడు.

"అందులో వున్న అంతరార్థమేమిటో మోర్గన్ వెంటనే గమనించాడు. ప్రపంచంలోని ఉక్కు ఉత్పత్తిదారుల్లోకల్లా పెద్ద అయినవాడు ప్రపంచంలోని బ్యాంకర్లలోకల్లా పెద్ద అయినవాడిచేత పోషింపబడదలచ లేదు. ఉక్కు డబ్బుకంటే గొప్పది: కొండే మహమ్మదు దగ్గరికి రావాలి.

"సరే ! నేనే వస్తా"నని మోర్గన్ గుర్రుమన్నాడు.

అతడు బండిని పిల్చి కార్నెగీ ఇంటికి వెళ్లాడు. పదిహేను నిమిషాలలో పర్వతమంత లావాదేవీకి ఒప్పందం కుదిరింది. వాళ్లు మాట్లాడుకుంటున్నప్పుడే కార్నెగీ చిన్న కాగితపు ముక్కమీద 40,00,00,000 [నలభైకోట్లు] డాలర్లు అని అంకెవేసి మోర్గన్ చేతికిచ్చాడు. ఇది ఆతని భాగపు ధర.

అతి కఠిన శిలవంటి మోర్గన్ ముఖంలో అణుమాత్రమైనా మార్పు కనిపించలేదు. "అది తృప్తికరంగానే వున్నది" అన్నాడు. మరికొంతసేపు మాట్లాడి, బండియెక్కి వాల్ స్ట్రీట్‌కు వెళ్ళిపోయినాడు. "అడిగినట్లయితే ఆయన కింకో పది కోట్ల డాలర్లు ఎక్కువ ఇచ్చివుండేవాణ్ని" అని తరువాత మోర్గన్ స్క్వాబ్‌తో అన్నాడు.

కనుక మోర్గన్ 110,00,00,000 (నూట పదికోట్లు) డాలర్ల కాపిటల్ షేర్లతో యునైటెడ్ స్టేట్స్ కార్పొరేషన్ అన్న మహాసంస్థను నిర్మించాడు. ఇరవై అయిదు సంవత్సరాలకు పూర్వం పదిహేను పదహారు సంవత్సరాల వయసులో పెన్సిల్వేనియా కొండల్లో బండి తోలి బ్రతికిన కుర్రవాడయిన స్క్వాబ్ దీని కధ్యక్షుడు. ఈ వ్యాపారాన్ని ఇంతకంటె అధికశక్తిమంతుడయిన వ్యక్తి చేతుల్లో పెట్టేందుకు అవకాశం లేదని చార్లీ పూర్వ యజమాని అంగీకారపూర్వకంగా భావించాడు.

వ్యాపారాన్ని విడిచిపెట్టటంవల్ల కలిగిన క్రుంగుబాటు తలపు కార్నెగిలో ఎక్కువ కాలం నిలువలేదు. తరువాత వెంటనే అతడు తాను చేయదలచుకొన్న పనులను గురించి ఆలోచన ప్రారంభించాడు. చార్లీ చెప్పినమాట సత్యం. తన ధనాన్నంటినీ దానం చెయ్యటంవల్ల అతడెంతో ఆనందాన్ని అనుభవించబోతున్నాడు. అతని వయసిప్పుడు అరవై ఆరు సంవత్సరాలు. ఇక యెక్కువ కాలం మిగిలివుండక పోవచ్చు.

దానం చెయ్యటంలో వెనుకంజ లేనిమాట నిజం.

తన 40,00,00,000 నలభైకోట్ల డాలర్ల ధనాన్ని దానం చెయ్యటం ప్రారంభించిన సరసమై దయాన్వితమైన గుండ్రని మోము, తెల్లని గడ్డము గల ఈ కురుచై లావైన చిన్న మనిషి, అతని గడ్డమే మరికొంత నిడివిగలదైన దైతే శాంతా క్లాస్‌కు ఆదర్శమయిన ప్రతిమూర్తిని వహించిన ట్లుండేవాడు. అయితే ప్రతిఫల రహితంగా అతడు సహాయంచేసిన వేల కొలది పాఠశాలలకు కళాశాలలకు, ధర్మసంఘాలకు వ్యక్తులకు అతడుఇప్పుడే శాంతా క్లాస్.

అసంఖ్యాకంగా శాఖలను నిర్మించే విషయంలో అతడు ఇప్పుడుకూడా న్యూయార్క్ ప్రజాగ్రంథాలయ ధర్మకర్తలతో ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుతున్నాడు. తొలుతగా మిలియను డాలర్లు ఇచ్చి ఇంతకు పూర్వపు సంవత్సరం పిట్స్‌బర్గులో కార్నెగీ ఇన్స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీని ప్రారంభం చేశాడు. తరువాత తరువాత అతడు తన జీవితకాలంలో ధర్మాలుగా యిచ్చిన మొత్తం 1,60,00,000 (ఒక కోటి అరవై లక్షల] డాలర్లు అయినది. స్కెన్లే పార్కులో అతడు కట్టించి ఘన నిర్మాణానికి నాలుగు శాఖలున్నవి - స్కూల్ ఆఫ్ అప్లయిడ్ సైన్సు, స్కూల్ ఆఫ్ అప్లయిడ్ డిజైను, స్కూల్ ఆఫ్ అప్లయిడ్ ఇండస్ట్రీస్, మార్గరెట్ మారిసన్ కార్నెగీ స్కూలు. ఇవన్నీ యువతులకు గృహశాస్త్రంలోను. దానికి సంబంధించిన అనుబంధ విషయాలల్లోను శిక్ష రాయిచ్చే సంస్థలు. ఇవన్నీ ఆ యా శాస్త్రాలల్లో పట్టభద్ర బిరుదా లిచ్చేవే.

వ్యాపారంనుంచి విరమించుకొన్న తరువాత కార్నెగీ

చేసిన మొదటి పనులలో ఒకటి. ఉక్కు కర్మాగారాలు కొలువుల్లో పనిచేసిన వారి సంక్షేమంకోసం 50,00,000 [యాభైలక్షల] డాలర్లు ప్రత్యేకించి వుంచటం అతడు ఇందులో ఒక మిలియను డాలర్లు తాను వారికోసం ఏర్పాటు చేసిన గ్రంథాలయ పాలనకోసం వేరుగాపెట్టి వుంచాడు. మిగిలిన ధనమంతా వయోవృద్ధుల పింఛనుల కోసం కర్మాగారంలో వికలాంగులయిన వారికి సహాయ మివ్వడం కోసం మృతినొందిన కార్మిల కుటుంబాలకు సహాయ మివ్వటంకోసం వుద్దేశింపబడింది.

ఆ సంవత్సం వసంతంలో నాలుగు స్కాచ్ విద్యాల యాలలోను అతిప్రాచీనమై ప్రబల ప్రతిష్టను గడించుకొన్న సెయింటు ఆంద్రూస్కు లార్డు రెక్టరుగా నియమితుడు కావటం కోసం స్కాట్లండు వెళ్లాడు. విశ్వవిద్యాలయాలలో లార్డు రెక్టర్ ఒకప్పుడు ప్రముఖోద్యోగిగా వుండేవాడు ఐతే శతాబ్దులు గడచిన తరువాత అది ఒక గౌరవ పదవిగామారి పోయింది. ప్రతి సంవత్సరం విద్యార్థులు ఎన్నుకొన్న ఒక ప్రముఖవ్యక్తి ఆ పదవిని స్వీకరిస్తుండేవాడు. సెయింటు ఆండ్రూస్ చరిత్రలో గడచిన అయిదు శతాబ్దాలలో ఈ పదవిని నిర్వహించిన విశిష్టవ్యక్తులు సుదీర్ఘ పట్టికలో తాను ఒకడుగా వుండే అవకాశమిచ్చిన ఈ గౌరవానికి కార్నెగీ గర్వించటం ఎంతో సమంజసం. ఈ ఎన్నికో బడటం విష యంలో ఇతడు బ్రిటిష్ పౌరులు కాని వారిలో ప్రథముడు, తరువాత 1902లోకూడా విద్యార్థులు అతణ్నే మరోమారు

కూడా ఈ రెక్టర్ పదవికి ఎన్నుకొన్నప్పుడు అతడు ఇంకా విశేషంగా గర్వించాడు.

రెక్టర్స నైట్స్‌లో అతడు ఎంతో సంతోషించాడు. వీటిలో రెక్టర్ సంపూర్ణంగా విద్యార్థులతో కలిసిమెలసి చలిస్తాడు. ఎంతో ఆదాన ప్రదానం జరుగుతుంది. వీటిలో ఉండటానికి అధ్యాపకవర్గంలో ఒకడికయినా అనుమతి దొరకదు. మొదటి రెక్టర్స్‌నైట్ గడచిన తరువాత ప్రిన్సిపాల్ డొనాల్డ్‌సన్ "భలాన రెక్టరు మాకు వ్యతిగా మాటాడాడు. మరొక రెక్టర్ మాకు అనుకూలంగా మాటాడాడు. వారిద్దరూ వేదికనుంచే మాటాడారు. రెక్టరు కార్నెగీ చక్రాకారంగా వున్న మా మధ్య కూర్చుని మాతో మాట్లాడాడు." అని విద్యార్థులు చెప్పుకొన్నట్లు అతనికి తెలియజేశాడు. సెయింట్ ఆంద్రూస్‌లో దరిదాపు రెండువందల మంది విద్యార్థులే వుడటంవల్ల యిలా చేయుటం ఏ మంత కష్టమయిన పని కాదు.

ఆబర్‌డీన్, ఎడింబరో, గ్లాసో. సెయిండ్ మాథ్యూన్ అన్న నాలుగు విశ్వ విద్యాలయాలు ఆర్థికంగా స్తోమతతప్పి వున్నదని శక్తివుండికూడా విశ్వవిద్యాలయవిద్యను అనేక మంది బాలురు పొందలేకపోతున్నారనీ గమనించి కార్నెగీ 1,00,00,000 (కోటి] డాలర్‌లు నిధితో స్కాచ్ యూనివర్శిటీ ట్రస్టును ఏర్పాటు చేశాడు. ఇందులో సగభాగం పై నాలుగు సంస్థల ఉపయోగంకోసం మిగిలిన సగభాగంవిద్యార్జనను ఆశించే యువకులకు సహాయం చెయ్యటం కోసము వుద్దేసింపబడ్డాయి. విశ్వవిద్యాలయ ప్రధానాచార్యులను.

వారి కుటుంబాలతో వచ్చి ఒక వారం రోజులు గడిపిపోవలసిందని ఆహ్వానించారు. యూనివర్సిటీ ట్రస్టుకు అధ్యక్షుడయిన ఎరల్ ఆఫ్ ఎల్జిన్, బ్రిటిష్ మంత్రివర్గంలో స్కాట్లండు తరఫున కార్యదర్శి అయిన లార్డు బాల్ఫోర్ కూడా వారు వచ్చినపుడు విచ్చేశారు. తరువాత తరువాత ప్రిన్సిపాల్స్ వీక్' అన్నది స్కిబోలో ప్రతిసంవత్సరం జరిగే ఒక వుత్సవమయింది. అది ఎప్పుడూ ఒక సంతోషకరమైన సమయంగా వుంటుండేది.

మొదట ప్రిన్సిపాల్స్ వీక్ అయిన తరువాత ప్రిన్సిపాల్ లాంగ్ వెళ్ళేటప్పుడు కార్నెగీతో కరచాలనం చేస్తూ "స్కాట్లాండు విశ్వవిద్యాలయ ప్రిన్సిపాల్‌కు ఏలా మా సమావేశాలను ప్రారంభించుకోవాలో తెలుసుకోటానికి అయిదు వందల సంవత్సరాలు పట్టింది. ఇందుకు అందరూ ఒక వారాన్ని కలసి గడపటమే పరిష్కారం" అన్నాడు.

తానిప్పుడు సంపూర్ణ స్వేచ్ఛ కలవాడు కనుక విశ్రాంతిని పుచ్చుకొన్న ఆ పారిశ్రామికుడు తను చేయదలచుకొన్నది ఎంత వుందో గమనించి మనోహరమైన ఆశ్చర్యాన్ని పొందాడు. అమెరికన్ బ్రిటిష్‌పత్రికలకు తాను వ్రాసిన వ్యాసాలు కొన్నింటిని సమకూర్చుకొని, మరికొన్ని అదనపు విషయాలను చేర్చి 1901లో "ది ఎంపైర్ ఆఫ్ బిజినెస్" అన్న పేరుతో ఒక సంపుటిని ప్రచురించటం ఈ చేయదలచిన పనులలో ఒకటి. అతడు జేమ్స్‌వాట్ జీవిత చరిత్రవ్రాయటమనే అభిలాషతో ఉర్రూతలూగుచున్నాడు. ఫిఫ్ ఎవెన్యూకు రెండుమైళ్ళకుపైన నైన్‌టీన్‌త్ నైన్‌టీఫస్టు

స్త్రీల్లకు మధ్య అత డొక నూతన గృహాన్ని నిర్మించాడు. కుటుంబం 1902లో ఆ నవమందిరానికి మారింది. అది చాలా విస్తీర్ణం కలది. దాన్ని నిర్మించుకొన్న యజమానిలా బలిష్ఠము; చోకము అయినది దాని నమూనా అతిసామాన్య మయినది. దానిచుట్టూ వున్న నేల వసంతం మొదలు వేసగి వరకూ వుండే పూలతో కళకళలాడు తుండేది. ఆ గృహ యజమాని శయ్యాగృహంలో గోడమీద ఒక బొమ్మ వేళ్ళాడు తుండేది. అది బిల్ జోన్స్ చిత్రం.

కార్నెగీ కార్పొరేషన్ రద్దయిన తరువాత పూర్వం దానిలో భాగస్థు లయినవాళ్లు, వీరు మొత్తం నలుబదిమంది వారిలో చివరివాడుకూడా మరణించేటంత వరకు పూర్వపు జీవిత స్మృతులను నిలుపుకోటం కోసం కార్నెగి వెటరన్సు ఎసోసియేషన్ అన్న పేరుతో ఒక సంస్థను స్థాపించుకొ న్నారు. నూతన గృహనిర్మాణం పూర్తిఅయిన తరువాత మిసెస్ కార్నెగి తన భర్తకు సంతోషకరంగా "ప్రథమంగా మనం కార్నెగి వెటరన్లను ఆహ్వానిద్దాం" అన్నది. వారు విందుకు వచ్చినపుడు గృహానికి శుభాకాంక్షలు పలికారు. 'వెటరన్సు డిన్న' రన్నది. తరువాత ప్రతిసంవత్సరం ఆ కొత్త యింట్లో ఒక ఆచారంగా జరుగుతూ వచ్చింది. అందరూ దీనికోసం ఎదురు చూస్తుండేవాళ్లు. సంవత్సర మంతటిలో అనుభవించు ప్రముఖమైన ఆనందసమయాలల్లో ఇది ఒకటి కావటంవల్ల అలా ఎదురుచూసే వాళ్ళల్లో అగ్రి గణ్యుడు ఆతిథేయి కార్నెగి. ఆ వెటరన్లను "నా బాలు ల్లారా !" అని కార్నెగి పిలుస్తుండేవాడు. వారు తనయెడ

అతిపిౖతిని పిౖదర్శిస్తుంటే ఆనందం అనుభవిస్తుండేవాడు. ఆ ప్రేమ వాళ్ళ కన్నుల్లో మెరుస్తుంటే తిలకించి పరవశుడౌ తుండేవాడు. తన ఆత్మకథ టిప్పణిలో అతడు ఇలావాౖశాడు "సంపద లేకపోయినా ఇది కావాలి. బహు కోటీశ్వరత్వం కంటె ఇది ముఖ్యం. ఔను, వేయిమారులు ఔను."

మొదటి విందువేళ వారు మిసెస్ కార్నెగీని వెట రన్స్ ఎసోసియేషన్‌లో గౌరవ సభ్యురాలినిగా ఎన్నుకొ న్నారు. వెంటనే ఒకరు "చిన్ని మార్గరెట్‌ను కూడా ఎన్ను కుందా"మని సూచన చేశారు. ఈ సూచన వెంటనే అంగీక రింపబడింది.

వెటరన్లలో ఒకడయిన చార్లెస్ స్క్వాబ్, ఒకనాటి గాౖమీణ దరిదౖ బాలుడు, నేటి స్టీల్ ట్రస్టు సంస్థకు ప్రధాని రివర్ సైడు డౖౖవ్ మీద, ఒక బలిష్ఠమైన సౌధాన్ని నిర్మిం చాడు. దీన్ని ఇతడు తన కతిపిౖయమైన ఫౖాన్సులోని లోయిరీ నదిమీది దుర్గపు నమూనా ననుసరించి కట్టాడు. ఇది గోపుర శిఖరాలతో ఒప్పే ఒక గృహ నిర్మాణం.

అతని పూర్వ యజమాని అప్పుడప్పుడూ ఎవరైనా మితుౖన్ని "నీవు చార్లీ నూతన భవనాన్ని చూశావా!" అని తనలో తాను నవ్వుకుంటూ అడిగేవాడు. "దానితో పోల్చి చూస్తే నా ఇల్లు చిన్ని కుటీరంలా కనిపిస్తుంది" అనే వాడు.

# పంపకం

## 13

న్యూయార్క్ ప్రజా గ్రంథాలయం డైరెక్టరు మిస్టర్ జె. యస్. బిల్లింగ్స్ మన్‌హాట్టన్, బ్రాంక్స్ పేటల్లో శాఖాగ్రంథాలయాలను నెలకొల్పే విషయంలో కొంత కాలంనుంచి కార్నెగీతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతున్నాడు. 1901 లో ఒక్కొక్క దానికి 80,000 డాలర్ల ఖర్చుతో అరవై అయిదు శాఖలను యేర్పాటు చేస్తానని సద్దులేకుండా సూచన చేశాడు. ఇతరఖర్చులు కాక ఇందుకయ్యే మొత్తం యాభై రెండు లక్షల డాలర్లు.

"యాభైరెండు లక్షలు పెద్ద ఆర్డరు!" అన్నాడు కార్నెగీ. కాని "ఈ భవనాలు అవసరమని తోస్తే తప్పక కట్టితీరవలసిందే" అందువల్ల నగరం తగిన నివేశన స్థలాలను వెదకటం ఆరంభించింది. డబ్బు లేకపోవటంవల్ల చాలా పర్యాయాలు ఆగటంవంటి సాధారణ ప్రతిబంధకాలు లేమీ-లేకుండా డబ్బు ఇవ్వటానికి పారిశ్రామిక అల్లాడీన్ ఉండటంవల్ల పని వేగంగా జరిగింది. అయితే కావలసిన డబ్బు అంత మొత్తమే కాదు. ఇంకా మొదట అంచనాను అతిక్రమించి

మరి మూడు క్రొత్త భవనాలు చేర్చబడ్డాయి. తరువాత మరొక ప్రత్యేక సంస్థ అయిన బ్రూకిలిన్ గ్రంథాలయానికి ఇరవై శాఖ లివ్వబడ్డాయి. ఈ గ్రంథాలయా లన్నింటికీ కొన్ని లక్షణా లుండాలి. ప్రతి ఒక్కదానికి రిఫరెన్స శాఖ, సంచారశాఖ వుండాలి. పిల్లల కక్ష్య, పత్రికల సంచికలు వుండాలి, బయటికి ప్రతి భవనం ఇది గ్రంథాలయమని ఎరుకపడే రూపంతో వుండాలి. అయితే వీటిలో ఒక్కటీ రెండోదాన్ని పోలివుండటానికి వీల్లేదు.

వీటిలో అనేక కట్టడాలలో అన్ని సౌకర్యాలు గల బేస్‌మెంటు నాటకశాల లుండేవి. వీటిలో తరువాత కొన్ని సమయాలల్లో నాటక ప్రదర్శనలు జరిగేవి. తరువాతి సంవత్స రాలల్లో వీటిమీద ఇంగ్లీషులోను ఇతర విషయాలల్లోను రాత్రి తరగతులు నడిచేవి. తరువాత కొన్ని సంవత్సరాలు ఒక లోకోపకారి అయిన న్యూయార్క్ నాటక ప్రదర్శకుడు జాన్ గోల్డెన్ లైబ్రరీ థియేటర్లపైనే పేరుపెట్టి కొన్నినాటక సంస్థలను నడిపాడు. మంచి నటకులున్న సంఘాలకు ఉద్యోగా లిచ్చి నిలిపి ఈ లిటిల్ థియేటర్లకు వెళ్ళి వీటిలో క్రొత్తగా బ్రాడ్వేలో ప్రదర్శించినట్టి నాటకాలను ప్రదర్శింపజేస్తుండే వాడు. ఈ నాటకాలు చూడటానికి, పరిమితమైన పట్టిలో స్థానాన్ని పొందిన, పోషకులకు ప్రవేశ రుసుం వుండేది కాదు.

1919 లో కార్నెగీ తన దాన ధర్మాలను పూర్తిగా నిలుపుదల చేసిన నాటికి 6,03,64,808 డాలర్లు ఖర్చుతో అతడు 2,811 స్వేచ్ఛా ప్రజాగ్రంథాలయ భవనాల ఏర్పా

టుకి దానం చేశాడు. వీటిల్లో 1946, సంయుక్త రాష్ట్రాల లోను, మిగిలినవి విదేశాలలోను ఉన్నవి. ఈ గ్రంథాలవల్ల ప్రయోజనం అనేక వేల మిలియన్ల మానవులకు అవి ఇచ్చిన అపరిమితమయిన విజ్ఞానానందాలు.

ఈ దాతే ఇలా చెప్పాడు : "గ్రంథాలయం ముఖ్యమైన ప్రయోజనం తా నివ్వలేనివారికి అది ఏమీ ఇవ్వకు యువకులు తమంత తామే విజ్ఞానాన్ని సంపాదించుకోవాలి. దీనిలోనుంచి తప్పించుకోపోవటమంటూ ఏమీ లేదు. ఇంకా అత డిలా అన్నాడు : "నేను నా చిన్ననాటి అనుభవాన్ని బట్టే తమలో మంచి ఉండి దాన్ని వృద్ధిపొందించుకునే శక్తి ఆసక్తి ఉన్న బాల బాలికలకు శ్రేయాన్ని చేకూర్చే గ్రంథాలయాలను, పురపాలక సంఘాన్ని ఎలాగో అలా, సాయపడి నిలుపుకోగల ఇచ్ఛ వున్న సమాజ మధ్యంలో వాటిని స్థాపించటంకంటే డబ్బును వినియోగించుకోటానికి మంచి మార్గం లేదని నిశ్చయించాను. స్థాపించిన గౌరవాన్ని నాకు దక్కించిన ఈ గ్రంథాలయాల భవిష్యత్తు ఈ అభిప్రాయం ఎంత సత్యమైందో నిరూపించి తీరుతుంది. ఎందువల్లనంటే ప్రతి గ్రంథాలయాల్లో ఒక్క వ్యక్తి అయినా దానిని ఉపయోగించుకొని కల్నన్ ఆండర్సన్ నాలుగు వందల మాసిపోయిన సంపుటాల గ్రంథాలయంవల్ల నేను పొందిన లాభములో సగమైనాపొందగలిగితే వీటిని స్థాపించటం వ్యర్థంగా నేను భావిస్తున్నాను."

న్యూయార్క్‌లో ఈ గ్రంథాలయాలను నిర్మిస్తున్న దినాలల్లోనే 'వాషింగ్టన్ కార్నెగీ ఇన్స్టిట్యూటు ప్రారంభ మైంది. దానికి స్థాపనోత్సవం జరిగినది. జనవరి 28, 1902 న "పరిశోధన, క్రొత్త విషయాలను కనుక్కోటం, మానవాభ్యుదయానికి విజ్ఞానాన్ని వినియోగించటం అన్న విషయాలను పెంపొందించటంకోసం" నిర్మాత దీనికి 2,60,00,000 [రెండు కోట్ల ఏభై లక్షల] డాలర్లు దానమిచ్చాడు. థియొడోర్ రూజ్‌వెల్టు క్రింద సెక్రిటరీ ఆఫ్ స్టేట్‌గా వున్న జాన్ హే దీని బోర్డుకు మొదటి అధ్యక్షుడు. వాషింగ్టన్‌లోని దీని ఆర్థిక- సాంఘికశాస్త్రము, చారిత్రిక పరిశోధన, జియొఫిజికల్ డిపార్టుమెంటులే కాక, దీనికి సంబంధించిన కార్యక్రమాలు ఎన్నోచోట్ల నడుస్తుంటివి. ఆరిజోనా ఎడారిమీది బొటానికల్ లాబొరేటరీ, ఫ్లొరిడో తీరానికి దూరంగా డ్రైటార్టుగస్ ద్వీపాల్లోని మెరైన్ బయొలాజికల్ లాబొరేటరీ, దాని గొప్ప టెలిస్కోపుతో కాలిఫోర్నియాలోని మౌంట్ విల్సన్ లాబొరేటరీ, న్యూయార్క్ ఆల్బనీలోని అబ్జర్వేటరీ, సముద్రాలపై ప్రయాణం చేస్తూ పూర్వం రూపొందించబడ్డ సర్వే పటాలను సరిదిద్దుతున్న చిన్న నౌక- ఇంకా యిందులోనివి ఎన్నో వున్నవి.

తరువాత తనకు అతి ప్రియమైనది కానున్న హీరో ఫండు కమీషను నెత్తుకున్నాడు. 1904 లో 50,00,000 [యాభై లక్షల] డాలర్లు ఇచ్చి దీనిని ప్రారంభించాడు. ఈ వంకకు ఆతని బుద్ధి మరలించినది పిట్సుబర్గుకు సమీపంలో ఉన్న జొగ్గు గనిలో జరిగిన విషాద సంఘటన. గనిలో ఒక

పేలుడు కలిగి లోపల వున్న జనమంతా సమాధి చెయ్య బడ్డారు. ఆ గనికి పూర్వపు సూపరింటెండెంటు మిష్టర్ టైలర్ ఇతను ప్రస్తుతం మరొక వ్యాపారంలోకి వెళ్ళాడు. ఆ గనిని గురించి తనకున్న జ్ఞానం, అనుభవం ఎందుకైనా ఉపకరిస్తుం దన్న ఆశతో అతివేగంగా ఆ దృశ్యం జరిగిన చోటికి వెళ్లాడు అతడు నాయకత్వానికి పేరెన్నిక గన్నవాడు. ఆదు ర్దాతో చుట్టూ మూగిన వాలంటర్లను చేర్చుకొని నాయ కత్వం వహించి అతడు గనిలోకి దారితీశాడు. వాళ్లు మృతి చెందకుండా అనేకమందిని బయటకు తీసి బ్రతికింప గలిగారు కాని ధీరుడయిన టైలర్ మాత్రం ఆ చర్యలో తన ప్రాణా లను కోల్పోయినాడు.

మిత్రులకోసం తన ప్రాణాలను అర్పించిన ఈ వ్యక్తి కంటె ప్రేమ మరెవ్వరిలో అధికంగా వుండి వుండదు. యీ వాక్యం ఈ విషాద సంఘటన తరువాత చిరకాలం వరకూ కార్నెగీ మనస్సులో మారుమ్రోగుతుంది. గొప్ప సమయ ములో ఈ హీరోఫండు పుట్టింది. అతడు తరువాత ఇలా వ్రాశాడు. "నాకు దానిమీద పితృప్రేమ వుంది. ఎందువల్ల నంటే ఇది నాకు ఎవరూ సూచించింది కాదు. నాకు తెలిసి నంతవరకూ దీన్ని గురించి ఎవరూ సూచించటం జరగలేదు. నిశ్చయంగా ఇది నా మేధాపుత్రిక.

ఇది యుద్ధ సమయంలోని వీరవరులకు, వీరనారీమణు లకు కాకుండా శాంతి సమయంలోని వీర స్త్రీ పురుషులకు ఉద్దేశింపబడటం వల్ల దీని గుణాధిక్యాన్ని గురించి కొందరు

శంకించారు. వీరోచిత కృత్యాలకు ఇది ఉద్బోధకముగా ఉండటంచేత బహుమతికోసం సాహసచర్యలను ప్రేరేపించటం దీని ప్రయోజనమౌతుందని ఈ పథకాన్ని విమర్శించేవారు ఊహించారు. అయితే దాత మనసులోకి అటువంటి అభిప్రాయం ఎన్నడూ రాలేదు "నిజమైన వీరు లెన్నడూ బహుమతినిగురించి ఆలోచించారు" అని కార్నెగీ అన్నాడు. వారు దివ్యోద్రేకం కలవాళ్లు. తమను గురించి కాకుండా ఎల్లవేళలావారు ప్రమాదస్థితిలో వున్న తమవాళ్ళను గురించి ఆలోచిస్తారు.

పరిశీలకులు వెదికి తనముందుకు కొన్ని సంఘటనలు తీసుకొవచ్చినప్పుడే ఈ కమీషన్ వ్యవహరిస్తుంది. "మానవుల ప్రాణాలను రక్షించటంలో వీరోచితయత్నం చేసి దెబ్బ తిన్నవాళ్ళకు తిరిగి పనిచేసుకోగలిగేటంతవరకూ ఇది ఆర్థిక సహాయమిస్తుంది. ఇటువంటి యత్నంలో మరణించినప్పుడు, ఆతని భార్యకు, బిడ్డలకు, ఇంకా అతనిమీద ఆధారపడే వాళ్ళకు- ఆమె పునర్వివాహం చేసుకుండేదాకా. పిల్లలు తమ్ము తామే పోషించుకునే వయస్సు వచ్చేదాకా జీవిత యాత్రికు వీలు కల్పిస్తుంది. వీరుడు గాయపడకపోయినప్పటికీ ఇటువంటి పారితోషికం ఇవ్వటం ఉచితమని కమీషన్ భావిస్తే అతనికి కొంత డబ్బును ఇవ్వవచ్చు. ఆ వీర కృత్యాన్ని తెలియజేసే రచనతో ఒక పతకాన్ని ఆ వీరుడికి గాని, అతని భార్యకుగాని, లేదా తరువాతి సన్నిహిత బంధువులకు గాని ఇవ్వవచ్చు.

హీరోండ్ కమీషన్ కధ్యక్షపదవి పూర్వం కార్నెగీకి భాగస్థుడైన చార్లెస్ టైలర్ మీద పడ్డది. మనలోమాట- ఎవరి ఆత్మత్యాగం ఈనిధి నిర్మాణానికి కారణభూతమైందో ఆ వ్యక్తికి ఇతడు బంధువుకాడు. టైలర్ ఇంతకు పూర్వమే పూర్వపు ఉక్కుకర్మాగారంలోని కార్మికులకోసం ఏర్పాటు చేసిన రిలీఫ్‌నిధిని, ఎంతో పూర్వం కార్నెగీ క్రింద పనిచేసిన పెన్సిల్వేనియా రైల్‌రోడ్డు కార్మికులకోసం ఏర్పాటు చేసిన ఫండును చూస్తున్నాడు. ఎట్టి దుష్ప్రచారాలనైనా త్రోసిపుచ్చుతూ, ఏ పనికీ ఒకసెంటు ప్రతిఫలం పుచ్చుకోకుండా ఇప్పుడితడు తగిన శ్రద్ధతో, సమర్థతతో ఈ మూడు నిధుల వ్యవహారాలను చూస్తున్నాడు. ఆయనటువంటి వ్యక్తిమీద పూర్వయజమానికి అంతగాఢమైన అనురాగముండుట సహజం. లెహై విశ్వవిద్యాలయానికి భక్తిశ్రద్ధలుగల పూర్వ విద్యార్థి ఇతడు. ఆ విశ్వవిద్యాలయానికి క్రొత్త లాబొరేటరీ కావలసి ఉందని చెప్పటం ప్రారంభించాడు. "ఓహో! చార్లీతోకూడా సంబంధం పెట్టుకోటానికి ఇది అవకాశం" అనుకున్నాడు, ఆ లోకోపకారి.

ట్రస్టీలు ఆలాబొరేటరీకి తాను పేరు పెట్టటానికి అంగీకరిస్తే దానికి కావలసిన ధనాన్ని తానిస్తానని కార్నెగీ లెహై అధ్యక్షుడు డ్రింకరుకు లేఖ వ్రాశాడు. "తప్పక అంగీకరిస్తా" మని సమాధానం వచ్చింది. దాత దానికి "టైలర్ హాల్" అన్న పేరును ప్రత్యేకించి ఉంచాడు. తరువాత కొంతకాలానికి చార్లి తబ్బిబ్బులు పడుతూ కార్నెగీ దగ్గిరికి వచ్చాడు.

"మిస్టర్ కార్నెగీ. ఈ పేరు వద్దు. ఆ భవనాన్ని నేను ఇవ్వటంలేదు. అదీకాక నేను ప్రసిద్ధి పొందిన ప్రముఖుడనుకాదు కేవలం ఈవిద్యాలయంలో విద్యార్థిని మాత్రమే. ఇంతటి గౌరవాన్ని పొందటానికి నేను చేసిందేమీలేదు,". అని అతడు అభ్యంతరం చెప్పాడు.

"ఈ భావాన్ని నాకు కల్పించినవాడివి నువ్వే" అని కార్నెగీ అడ్డుపడి అన్నాడు. నీవు నన్ను ఆ భవనానికి డబ్బు యిచ్చేదాకా నా వెంటబడి నేను సగం చచ్చేటంతగా పీడించావు. సెంటు అయినా పుచ్చుకోకుండా నాకు ప్రియమైన మూడు పథకాలకు అధిపత్యం వహించి నైలర్‌లా (మేకులు చేసేవాడు) పనిచేస్తున్నావు. ఇంతకుమించి నేను నీకు ఏమీ చెయ్యలేదు."

"అటువంటి చిన్నపనులకు ప్రతిఫలం పుచ్చుకుండే వాణ్ణి కానని హైలర్ మీరు ఇటువంటి సంస్థలకు లక్షలాది ధనమిచ్చారు నేను దీనికోసం కొద్ది గంటల కాలాన్ని విని యోగించగలను. ఇది అదికాదు. ఆ భవనానికి నావు రూపాలు లేని నాపేరు పెట్టటం, అన్నభావం. దానికి గాను నేను ఏమీ ఇవ్వలేదని అందరికీ తెలుస్తుంది. అప్పుడు నేను పరిహాసపాత్రుడ నౌతాను. కొత్తవాళ్ళెవరైనా ద్వారం మీద ఆపేరు చూస్తే "ఈ హైలర్ వర్తమానకాలం వాడా, భూతకాలం వాడా అని అడగరా !

జేబుల్లో చేతులు పెట్టుకొని కార్నెగి వేడితగ్గి మాట లైపోయేటంతవరకూ వెనక్కువ్రాలి కుర్చీనానుకొని కూర్చు

న్నాడు. అతని ప్రసంగం పూర్తి అయిన తరువాత అతని వంకకు ప్రేలునాడిస్తూ "నేను చెయ్య ననుకో, కాని నేను షైలర్ హాల్ అని పేరుపెట్టవలసిందే నని పట్టు పట్టితే అప్పుడు నీవు పరిహాసపాత్రుడివికావా ? అయితే నీవు లేహై కోసం అట్టి ఆత్మత్యాగాన్ని చెయ్యటానికి అంగీకరించటానికి సిద్ధపడవలసిందే! అది నీ విద్యామాతకు తోడ్పడుతున్నది. ఆ సందర్భంలో నిన్ను ఏదోగర్వం ఆవరించకపోయి నట్లయితే నీ పేరును ఎవరు ఎలా ఉపయోగించుకొన్నా నీవు పట్టించు కుండే వాడివికావు. షైలర్ అన్న పేరులో ఏముంది? యిక్కడ యిబ్బంది పెడుతున్నదల్లా నీ తాళలేని ఆత్మగర్వం. నీవు దాన్ని జయించి తీరాలి—"

"యజమానీ ! ఇక ఆపండి యిలా వెర్రిని చేయటం" అన్నాడు షైలర్ జేవురించిన మోముతో "విషయాన్ని పెడత్రోవ పట్టిస్తున్నారు. ఇది మీకు తెలుసు"

"సరే మంచిది. నీ వోక నిర్ణయానికి రా" చేయి ఊచుతూ అన్నాడు కార్నెగి "షైలర్ అన్న పేరును విడచి పెడతావో, లెహైని విడిచిపెడతావో నీ యిష్టం వచ్చింది చెయ్యి కానీ షైలర్ లేకపోతే హాలు లేదు— చార్లీ ఇది నీ తుది నిర్ణయం."

షైలర్ చివరకు లొంగిపోయినట్లు చేతులెత్తాడు.

కార్నెగి ఇలా వ్రాశాడు. "తరువాత రోజుల్లో ఆ నిర్మాణాన్ని చూచి షైలర్ ఎవరని ఆశ్చర్యపడ్డారు. అతడు లెహైకి భక్తితత్పరతగల పుత్రుడని, సోదరమానవ సేవను

గురించి కేవలం బోధలు చేసేవాడు కాక కార్యరూపంలో చేసి చూపించాడనీ, అతనిపై జీవించిన అత్యుత్తమ మానవుల్లో అత డొకడని నిశ్చయించేసుకొన్నాడు."

మొదటి హీరోఫండ్ కమిషన్ యునైటెడ్ స్టేట్స్ కెనడా, న్యూఫౌండులాండులకు మాత్రమే వర్తించింది. కానీ 1908లో కార్నెగి గ్రేట్ బ్రిటన్ ఐర్లండులకు హీరోఫండును నెలకొల్పాడు. గ్రేట్ బ్రిటన్ పాలకుడు కింగ్ ఎడ్వర్డు VII జర్మన్ పాలకుడు కైజర్ విల్హెల్మ్ II ఉన్నత వర్గం వారు అతణ్ని మెచ్చుకుంటూ స్వయంగా లేఖలు వ్రాశారు.

కొన్ని సంవత్సరాలపాటు, మధ్య మధ్య ఘనదానాలతో, సంవత్సరానికి ఒక నిర్మాణాన్ని ఉద్దేశించి దానాలు చేశాడు. చర్చిపీస్ యూనియన్‌కు 20.00,000[ఇరవై లక్షలు] డాలర్లకుమించి, హేగ్‌లో పీస్‌పాలెస్ నిర్మాణానికి 15,00,000 [పదిహేను లక్షల] డాలర్లు, ఇంటర్ నేషనల్ బోర్డ్ ఆఫ్ అమెరికన్ రిపబ్లిక్స్‌కు 8,50,000 [ఎనిమిదిన్నర లక్షల] డాలర్లు ఇతనికి ఘనదానాలు. ఇవికాక చర్చి ఆర్గన్లు, గ్రంథాలయాలు, కళాశాల భవనాలు. లాబొరేటరీలు, ప్రొఫెసర్ పీఠాలు ఎన్నో దానం చేశాడు.

కరుడుగట్టిన పూర్వవాసన విశేషంగాగల హైలాండ్ స్కాచ్ ప్రెస్బిటీరియన్లు చర్చిలలో సంగీతవాద్యాలుండటం మత విశ్వాసానికి విరుద్ధమని భావించేవాళ్లు. వీరు కార్నెగి చర్చిలలో ఆర్గన్లను ప్రవేశపెట్టి క్రైస్తవ పూజావిధానానికి నైతికపతనాన్ని కల్పిస్తున్నాడని గొణిగారు. 'మానవ

కంఠంలో వినిపించేదే పవిత్రసంగీతం.'క్రీస్తువాద్య'పు ఈలలు అట్టివి కావని వా రన్నారు. దీన్ని గురించి ఎక్కువగా విన్న తరువాత కార్నెగీ స్కాట్లండుకు ఇలా వ్రాశాడు : "ఇది నన్ను చాలా బాధపెట్టింది. ఇకముందు నేను చేయబోయే ఈ పాపానికి తోడుగా ఒక భాగస్వామి వుండాలి. ఇకనుంచి సమావేశాలను ఆర్గన్ ఖరీదులో సగ మిచ్చుకోమని కోరదలి చాను." ఇందువల్ల స్కాటిష్ పార్వతీయుల్లో ఆర్గన్ వాద్యాల నిమ్మని కోరటం కొంత తగ్గింది.

కళాశాలలకు ఇచ్చే దానాలకు తాను గౌరవించే వాళ్ళ పేర్లుగాని, తన మిత్రుల పేర్లుగాని, స్మృతి పాత్రులైన వాళ్ళ పేర్లుగాని పెట్టటమంటే కార్నెగీకి ఇష్టం. బ్రౌన్ యూనివర్సిటీలోని జాన్‌హే గ్రంథాలయము, హామిల్టన్ కాలేజీలో ఎలిహూ పౌండేషను, వెస్టరన్ రిజర్వు యూనివర్సిటీలోని హెన్నాబైగు, వెలస్లీలోని ఫ్రెన్సిస్ క్లీవ్‌లాండ్ లైబ్రరీ ఇందు కుదాహరణాలు.

ఓహియోలోని కెన్‌యాన్ కాలేజీలో వున్న స్టాంటన్ ఛైర్ ఆఫ్ ఎకనమిక్స్, అధ్యక్షుడు లింకన్‌కు యుద్ధ కార్యదర్శిఅయిన ఎడ్విన్ ఎం స్టాంటన్ పేర నెలకొల్పినది. ఇతడు మొదట, ముక్కోపి అని ఎక్కువమంది అభిప్రాయం: అయినా, ఉక్కురాజు ఇతణ్ని పిట్స్‌బర్గులోని న్యాయవాదిగా జ్ఞప్తి కుంచుకున్నాడు. న్యాయవాదిగా వున్న ఆ రోజుల్లో ఇతడు ఆండ్రీ కార్నెగీ అన్న తంతి వార్తాహరి బాలుడితో ఎల్లప్పుడూ ఉల్లాసంగా మాట్లాడుతూ ఉంటుండేవాడు.

అతడికి ఎక్కువ యిష్టమైన దానాలల్లో ఒకటి అతడు డన్‌ఫర్మ్‌లైన్‌కు పార్కు, దానిలోవున్న చారిత్రాత్మక భవనాలను ఇవ్వటం అక్కడివారు పార్కు కావాలని బహుకాలం నుంచి వ్యామోహ పడుతున్నారు. కొన్ని తరాలుగా హంట్సు లైయర్డ్స్, పిటిన్ కీఫ్‌ల యాజమాన్యం క్రింద ఉంటున్న తమ ప్రాచీన వారసత్వాన్ని — పాత్ర అబ్బీ, దాని మైదానాలు, రాజభవన శిధిలాలు - తిరిగి పొందటంకోసం తమ గ్రామస్థులు చేసిన దీర్ఘ యుద్ధాలను గురించిన కథలు, వాళ్లకు పెద్దలు చెప్పగా విన్నవి, వాళ్ళు చెప్పటంవల్ల తాను విన్నవి ఆండ్రూకు బాల్యస్మృతుల్లోని అంశాలుగా మిగిలిపోయినవి. పిట్టెన్ కీఫ్‌గ్లెన్ ఆ తగాదాకు చెందిన భూభాగంలో చేరిందే. ఇది నగరానికి సంబంధించిన రెండు ప్రధాన వీధులచే చుట్టబడింది. అరవై యెకరాలకు మించిన అందమైన రాతి ప్రదేశం ఇందులో చిన్న అడవి వుంది. ఆండ్రూ చిన్ననాడు ఇది అతనికి ఎంతో అందంగా కనిపించేది. అతనికి దీనితో పోల్చదగ్గది ఒక స్వర్గం మాత్రమే అని అనిపించేది. అతడు అందులో ప్రవేశించటానికి ఆటంకం వుంది. కనుక అతను దాన్ని బయట నిలబడి మాత్రమే చూడగలిగాడు. హంట్స్‌మీద జరిగిన పోరాటానికి అతని మాతామహుడు మారిసన్ నాయకుడు ఇతని మేనమామ బైలీ తరువాత నడచిన కొట్టే యుద్ధానికి నాయకుడు. అంతే కాదు. అతడు లైయర్డు కట్టిన కంచెలు బ్రద్దలుకొట్టడానికి గుంపును కూర్చినందుకు శిక్ష అనుభవించాడు కూడాను ఆ తరువాత లైయర్డుగ్లెన్ లోపలికి ఏ మారిసన్‌ను ప్రవేశింప

నీయరాదనీ ఆజ్ఞాపించాడు. ఈ మారిసన్ అన్నపేరుతో కార్నెగీకి ఒక వర్గం బంధువులుకూడా చేరుతారు అందు వల్ల అంకుల్ లాడర్ డాడ్ నైగ్‌లను ఇద్దర్నీ ఒక ఆదివారం మధ్యాహ్నవేళ ఆగ్లెన్ అంచు చుట్టూరా త్రిప్పి, దాని లోపలి భాగాన్ని చూడడానికి వీలయిన ఒక ఎత్తు ప్రదే శానికి తీసుకుపోయాడు.

కొంతకాలం డన్ఫర్మ్‌లైన్ నివాసి, కార్నెగీ చేసిన కొన్ని ధర్మాలకు, యితరమయిన తన ఆస్తులకు అతని ప్రతి నిధి – డాక్టర్ జాన్ రాస్ 1900 ప్రాంతంలో కార్నెగీలను చూడడానికివచ్చి, వారితో ఏకాంతంగా "కల్నల్‌హాంట్ డన్ఫర్మ్‌లైనులోనితన ఆస్తులను అమ్మేసే సమయం వచ్చి నట్లు తెలిసింది" అన్నాడు.

"మంచిది" వాటిని నేను కొంటాను." అన్నాడు కార్నెగీ సంతోషంతో.

"అయితే, అతడు చెబుతున్న ధర చాలా ఎక్కువగా ఉన్నట్లు తోస్తున్నది" అన్నాడు రాస్.

ఇరువురు ఈ విషయాన్ని గురించి మరి కొంతసేపు చర్చించారు. పరిస్థితిని కనిపెట్టడానికి డాక్టర్ రాస్ స్కాచ్ జాగరూకతతో వ్యవహరించాలని ఇరువురు నిశ్చయించారు. ఒక సంవత్సరంకాలం కాచుకున్న తరువాత డాక్టర్ రాస్ కార్నెగీ దగ్గరకి వచ్చాడు.

అతడు "ఎండింబరులోని మిష్టర్ షాతో, [ఇతడు

పూర్వం డన్‌ఫర్మ్‌లైన్‌వాడు.] కల్నల్‌హంట్ ఏజంట్లతో కదల్చమని మనం చెప్పవచ్చు ననుకొంటున్నాను"అన్నాడు.

"బాగుంది. నాకు ఇచ్చివేయకపోవడంవల్ల తరువాత వారి యజమాని చింతపడవలసి వస్తుంది. దాన్ని కొనటానికి మరొక డెవ్వడూ అంత చులకనగా రాడు. నేను మనస్సును మార్చుకోటానికిగాని, మరణించటానికిగాని అవకాశముంది" అని వాళ్ళకు చెప్పండి అన్నాడు కార్నెగీ.

"ఆ విషయంలో ఎలా జాగ్రత్తపడాలో టాయ్‌షా బాగా ఎరిగినవాడు" అన్నాడు రాస్.

దీనితరువాత కొద్దికాలానికే కార్నెగీ న్యూయార్క్ వెళ్ళాడు.

కొన్ని వారాలు గడిచాయి. ఒకనాడు షా దగ్గర నుండి కేబిల్ వచ్చింది. "కల్నల్ హంట్ 45,000 పౌన్లకు ఒప్పుకుంటాడు. బేరం నిశ్చయించినా!"

"సరే. ఇది రాస్ పెట్టెషరతులన్నిటికీ అనుకూలంగా వుంటే అంగీకరించవచ్చు." అని సమాధాన మిచ్చాడు.

కొద్దిరోజులు గడిచాయి. మధ్యాహ్నం బాగా గడచిన తరువాత అది క్రిష్టమస్ సాయంత్రం. షా దగ్గరనుంచి మరొక కేబిల్ వచ్చింది. "హెయిల్, లైయర్డ్ ఆప్ పిట్టెన్ క్రీప్"

"పిట్టెన్ క్రీప్ ప్రభువుకు జయము!" ఇది ఒక కథను

తెలియజేస్తుంది. "నేను యింతకంటే మంచి క్రిష్టమస్ బహుమానాన్ని పొందలేను." అన్నాడు లైయర్డ్. నేను జగత్తులోని బిరుదాలన్నిటిలోకి అత్యుత్తమమైన బిరుదును పొందిన వాణ్ని. రాజా. అతడు కేవలం రాజకుమారుడు మాత్రమే. అతడికి మాల్కొంరాజు శిఖరం లేదు. సెయింటు మార్గరేటు ఆలయం లేదు. పిట్టెన్ క్రీఫ్ గ్లెన్ లేదు. అతడు ఏమీ చూపలేడు నేను అతడు డన్ఫర్మ్లైన్కు యాత్రకు వస్తే నేను దిగివచ్చి ఉదాత్తధోరణిలో అతడికి ఇవన్నీ చూపెడతాను. ఇది నాకెంతో ఆనందప్రదమైంది."

ట్రస్టీలలో రాస్ ప్రథముడు కావటం తప్పదు కదా! వారికి వ్రాసియిచ్చిన పత్రంలో కార్నెగీ తన వుద్దేశాన్ని ఇలా వెల్లడించాడు. "డన్ఫర్మ్లైన్లో కష్టపడే శ్రామిక జనుల విసుగుదలతో కూడిన జీవితానికి కొంత తీయదనాన్ని కొంత వెలుగును ఇవ్వటానికి ముఖ్యంగా యువకులకు ఇతర చోట్ల వసించేవారు పొందలేని కొంత తేజం, కొంత ఆనందం, కొంత ఉన్నతిని చేకూర్చేటందుకు, నా జన్మస్థానంలో బిడ్డ తదనంతర కాలంలో తదనంతర జీవితంలో వెనుకకు చూచుకొని, ఇంటి దగ్గరనుంచీ ఎంత దూరం తిరిగినప్పటికీ కేవలం తాను అక్కడ ఉండటమే సుగుణంవల్ల జీవితాన్ని ఆనందప్రదంగాను ఉత్తమంగాను చేసుకొనేటట్లు కల్పింపబడ్డ దని భావించుకోటం కోసం" అని వ్రాశాడు.

ఆస్తిని పెంచి దాని నిత్య పాలన కోసం ఒక ఫండును ఏర్పాటు చేసేటందుకుగాను 25,00,000 [ఇరవయ్యైదులక్షల)

డాలర్లు ఇచ్చి అతడు ట్రస్టీలను ఆశ్చర్యచకితులను చేశాడు. అతడుమరికొంతఇచ్చినతర్వాత ఆ మొత్తం $7,50,000[ముప్ఫ య్యేడు లక్షల యేభై వేల] డాలర్లు అయింది. ప్రజలఆస్తి ఏదీ ఇంత జాగరూకతతో పాలింప బడలేదు. ప్రజలకు ఏదీ ఇంత ప్రీతిపాత్రము కాలేదు.

విశ్వవిద్యాలయ ట్రస్టీగా ఉండటంచేత కార్నెగీ అక్కడ చదువు చెప్పేవారికి చాల తక్కువ జీతాలు ఇస్తు న్నట్లు గమనించాడు. అతడు ఆతురతతో "ఇది అత్యుత్తమ వృత్తిగా పరిగణింపబడవలసింది అయినా అన్ని వృత్తులలోకి ఉపాధ్యాయ వృత్తికి చాలా అన్యాయంగా, అవుట, నీచంగా ప్రతిఫలం ముడుతూంది. యువకులకు విద్య చెప్పటం కోసం జీవితాన్ని అంకితం చేసిన విద్యావంతులు మరీ అల్పభృతు లను తీసుకొంటున్నారు. అందువల్ల అతడు ఏప్రియల్ 16, 1905 న విద్యాబోధనాభివృద్ధి కోసం అయిదు శాతంబాండ్లు రూపాన కోటి డాలర్లతో యునైటెడ్ స్టేట్స్ కెనడాల్లో వున్నతవిద్యకు దోహదమివ్వదలచి, విశ్వవిద్యాలయ కళా శాలలోపాధ్యాయులకు పించనుకు యేర్పాటుచేసి వారి విధ వలకు పెన్షన్ల ఏర్పాటుతో కార్నెగి ఫౌండేషన్ ఏర్పాటు చేశాడు.

దాని ధర్మకర్తృత్వ సంఘంలో ఇరవై అయిదుమంది విశ్వవిద్యాలయాధ్యక్షులు, కళాశాలాధ్యక్షులు వున్నారు. వీరిలో చాలామంది అతనికి పూర్వమే మిత్రులైనవారు ఈ నిర్మాణసందర్భంలో వీరు కార్నెగీ గృహంలో సమావేశమై

నప్పుడు వీరికి కలిగిన భావాల్లో ఒకదానిని తాను మెచ్చు కొని కార్నెగీ తాను ఎంతో ప్రీతిని వహించే మిత్రుల పట్టి కలో వారిని చేర్చటం జరుగుతుండేది. కార్నెగీ మిత్రుల పట్టికకు ఎప్పుడూ అంతు అనేది లేదు.

రెండు సంవత్సరాలైన తరువాత మరికొంత మొత్తం 50,00, 00 (యాభై లక్షల) డాలర్లు, తరువాత మరొకమారు 12,50,000 (పన్నెండు లక్షల యాభై వేలు) కార్నెగీ ఆ ఫౌండేషనుకు చేర్చాడు. 1918 లో కార్నెగీ కార్పొరేషను దానికి 1,20,00,000 [ఒక కోటి ఇరవై లక్షల] డాలర్లు విరాళమిచ్చింది. మొదటి పాతిక సంవత్సరాలల్లో ఇది పద కొండు వందరలమంది ఉపాధ్యాయులకు వారి విధవలకు ఎల పెన్స్, పెన్షన్ల రూపంలో 2,00,00,000 (రెండు కోట్ల) డాలర్లు వినియోగించింది. కార్నెగీ ఫౌండేషను, జాన్ డి. రాక్ ఫెల్లర్ జనరల్ ఎడ్యుకేషన్ బోర్డు అన్న సంస్థలు ఒకటి చేస్తున్న పనినే మరి రెండవది చేస్తున్నట్లు కన్పించి నప్పుడు మిష్టర్ రాక్ ఫెల్లర్ "మీరు మా బోర్డులో మెం దుకు సభ్యులుగా చేరకూడదు. అప్పుడు రెంటిలో ఏమిజరుగు తుందో మీకు తెలుస్తుంది దానివల్ల చేసిన పనిని తిరిగి చెయ్యటమనే దాన్ని నిలిపివెయ్యవచ్చు" అని కార్నెగీతో అన్నాడు. కార్నెగీ ఉభయ నిధులకు ఉపయోగించేటందుకు గాను రాక్ ఫెల్లర్ జనరల్ ఎడ్యుకేషన్ బోర్డులో సభ్యుడై నాడు.

ప్రసిద్ధ సంపాదకుడు, విమర్శకుడు, అతనికి సన్నిహిత

మిత్రుడు అయిన రిచ్చర్డు వాట్సన్‌గిల్డర్ ఒకమారు కార్నెగీ గురించి ఇలా వ్రాశాడు : "ఎ. సి. అనంతమైన సామర్థ్యం, అద్భుతమయిన భావనాబలం గలవాడు. అతని భావాలన్నీ అతి విశాలములైనవి. అంతేకాదు, భవిష్యదర్థసూచకములు. నేను ఇచ్చే అభిప్రాయం పొరబాటైంది కాకపోతే అతడికి కళంకరహితమయిన నైతికశీల మున్నది. అతడు పరిపూర్ణుడు కాకపోవచ్చును. కానీ అతడు మన అభిలాషను చూరగొన్న గలవాడు. విశిష్టత గలవాడు. సత్యమైన ప్రజాస్వామిక పౌరుడు.అతని లోకోపకారకృత్యాలన్నిటికీ మూలం ఉత్తమ సిద్ధాంతాలు, శీలము. అన్న గుణాలు రెంటిలో కన్పిస్తుంది. అతడే మరొక సందర్భంలో వ్రాస్తూ "ఎ. సి. నిజంగా ఒక మహావ్యక్తి రసాత్ముడు, పట్టుదల గలవాడు. దయాళువు. అనేక విషయాల మీద బుద్ధిని ప్రసరింప చేసేవాడు కొన్ని సందర్భాలల్లో ఇతడు తన అభిప్రాయాన్ని రుద్దటానికి యత్ని స్తుంటాడు. ఆ సమయాల్లో ఇతడు దరిదాపు క్రూరుడుగా వర్తిస్తుంటాడు. మళ్లా కోమలహృదయం లేకపోలేదు, నిండు ప్రేమ గలవాడు ఉద్వేగి నిరంతర భావుకుడు. అసాధరణ విశాల దృక్పథం, అభిప్రాయాలూ గలవాడితడు. జీవిత చరిత్ర వ్రాయదగ్గవాడు, 'నీకు నీవే బాస్వేలువు కమ్మ'ని (జీవిత కథాకారుడు) నేను ప్రబోధిస్తున్నాను అతడిలోఅన్ని విషయాల్లోను పరస్పర వ్యతిరేకత గోచరిస్తుంది. అయితే ఇది మహోన్నత విషయాలమీది అత్యంత ప్రీతివల్ల కలుగు తున్నది. మానవ సౌభ్రాత్రం, వివిధ జాతుల మధ్య శాంతి మత విషయికమైన పవిత్రత..."

కార్నెగీ పరస్పర విరుద్ధ ధోరణిలో ప్రవర్తించి వుండవచ్చు. అయితే, అతడెల్లప్పుడు తన ఆత్మవిశ్వాసాలకు సన్నిహితుడయి జీవించాడు. అయినా తన అభిప్రాయాల విషయంలో ఎన్నడూ మొండిపట్టు కలవాడు కాడు. అతడిచ్చిన దానాల నన్నిటినీ దానోద్దేశాలను వెల్లడించిన తరువాత మిగిలిన పాలనావ్యవహారాల నన్నింటినీ పాలక వర్గంవారి నిర్ణయాలకు విడిచిపెట్టేవాడు. అవి ఆచరణయోగ్యాలు కావని, ఎవరి అభిప్రాయాలకు అతడు విలువ యిస్తాడో వాళ్లు నిర్ణయించినప్పుడు తనకు ప్రియమయిన పథకాలను ఎన్నింటినో అతడు వదులుకున్నాడు. కాన్ఫెడరేట్ బాండ్లు ఇందుకు వుదాహరణం. 1880 లో, అంతర్యుద్ధపు చివరదశలో, ఓడిపోయిన అమెరికా కాన్ఫెడరేట్ రాష్ట్రాలవారు ధనవిషయకంగా, ఆర్థికంగా, సంపూర్ణ వినాశనాన్ని పొందినప్పుడు వారు గవర్నమెంటు బాండ్లను ఇందులో ఎక్కువభాగం డబ్బు యూరప్‌ది - పరిత్యజించే విషయంలో నిర్బంధితులైనారు. దక్షిణరాష్ట్రాలను తరువాత తిరిగి సమాఖ్యలో ప్రవేశపెట్టిన తరువాత కార్నెగీ యూరప్‌లో సద్భావాన్ని కలిగిద్దామనే వుద్దేశంతో వాటికి చెల్లించి వేద్దామన్నాడు. కాని రాజనీతిజ్ఞులు, ధనిక వర్గంవారు, న్యాయనిపుణులు అది చాలాకష్టమని దానివల్ల – సద్భావం కలగటంకంటే, కలత వృద్ధిపొందుతుందని దాన్ని నిర్వర్తించటమేమీ అసాధ్య కృత్యం కాకపోయినా అతికష్టమైన పని అని చెప్పినప్పుడు ఆ బాండ్లు విషయం కార్నెగీ తనకు ఇష్టంలేకపోయినా వదులుకున్నాడు.

1906 లో కొద్దికాలం గడిచిన తరువాత సెయింట్ ఆండ్రూస్‌కు కార్నెగీని మూడోమారు డైరెక్టరుగా ఎన్నుకున్నారు. ఆ వేసవిలో జరిగిన పిన్సిపాల్స్ వార్షోత్సవాలల్లో మిస్ అగ్నెస్ ఇర్విన్ కార్నెగీల యింట్లో అమెరికన్ అతిథిగా వుంది. ఈమె రాడ్‌క్లిఫ్ కాలేజికి డీన్ బెంజిమిన్ ఫ్రాన్క్లిన్‌కు మునిమనుమరాలు. సెయింట్ ఆండ్రూస్ ప్రిన్సిపాల్ డొనాల్డ్ సన్, అతడేకాదు మిగిలిన అతిథులందరూ,స్కిబోకు అతిథిగా వచ్చిన ఈమెవల్ల ప్రభావితులైనారు. ఈమెరాకకెంతో సంతోషించారు. ఇందుకు కారణం సెయింట్ ఆండ్రూస్ 1759 లో బెంజిమిన్ ఫ్రాన్క్లిన్‌కు అతనిమొదటి గౌరవపట్టాన్ని ఇవ్వటం జరిగింది.

ఆ సంవత్సరమే ఫిలడల్ఫియాలో ఫ్రాన్క్లిన్ ద్విశత వార్షోత్సవం జరుగుతుంటే నూటనల్భై యేడుసంవత్సరాలకు పూర్వం ఆమె ముత్తాతకు ఇచ్చిన గౌరవపట్టాన్ని మిస్ ఇర్విన్‌కు పంపించింది. ఆ విశ్వవిద్యాలయం రెక్టర్ పదవిని అనుభవిస్తున్న ఆండ్రూ కార్నెగీని ఆమె ఆ ఉత్సవ సందర్భంలో పరిచయంచేసి ఆమె భుజాలమీద ఆ హుడ్‌ను వుంచవలసిందిగా కోరారు.

ఇప్పుడు ఎ. సి. విశ్రాంతైన సమయాలల్లో తన ఆత్మకథకు సంబంధించిన ప్రకరణాంతర్భాగాలను, ప్రకరణాలను వ్రాసుకుంటున్నాడు. ఈ సమయాలల్లో అతడు ఎవరినిగురించి తాను వ్రాయటం జరుగుతున్నదో అట్టి తన ప్రియమయిన మిత్రులు, బంధువులు, ఇతరు లనేకులు మృతినొందిన అంశాలను చింతతో స్మృతికి తెచ్చుకొన్నాడు.

అతడు ఒక పర్యాయం ఇలా అన్నాడు : "నే నిప్పుడు ఏ ఉక్కు కర్మాగారాన్ని చూసి భరించలేకపోతున్నాను. అక్కడికి వెళ్ళితే నాకు నాకంటె ముందు వెళ్ళిపోయిన వ్యక్తు లెందరో జ్ఞప్తికి వస్తారు."

అందుచేతవెనుకటివలె ప్రగాఢప్రేమతో నాహస్తాన్ని బాధించగల నా తొలిలాటి మిత్రులు కొద్దిమంది మాత్రమే నాకు అక్కడ మిగిలి లభిస్తారు. 'ఆండీ' అని నన్ను పిలిచే వృద్ధులు ఒకరో ఇద్దరో మాత్రమే అక్కడ వుంటారు."

# అస్తమయం

## 14

యుద్ధాన్ని క్రమక్రమంగా రద్దు చేయగలుగుతుందనే ఉద్దేశంలో న్యూయార్క్ శాంతి సమాజం నిర్మితమైంది. ఈ ఆశయం విషయంలో కార్నెగీకి అత్యంత శ్రద్ధ ఉన్నట్లుగా అతడు తెలియజేయటంవల్ల ఆ సమాజంవారు అతణ్ని అధ్యక్ష పదవిని స్వీకరింపవలసిందని కోరారు.

"వద్దు, నాకు వద్దన్నాడతడు "హృదయపూర్వకంగా నేను మీతో వుంటాను. ఇది మీకు తెలుసును. నాకు శక్తి వున్నంతవరకూ మీకు తోడ్పడతాను. అయితే, నాకున్న యితర వ్యవహారాలవల్ల ఈ శాంతి సమాజాధ్యక్ష పదవిని స్వీకరించలేను. తీరుబడి వుండదు. నేను నాకున్న కాలంలో ఎక్కువ భాగం ఇందుకు వినియోగించాలని వుంది. అయితే ఆ పని చేయలేకపోతున్నాను."

తన్ను అభ్యర్థించ వచ్చిన శాంతి సమాజ సభ్యులు వెళ్ళిపోయిన తరువాత కార్నెగీని అంతరాత్మ బాధపెట్టటం మొదలెట్టింది. ఎంత తీరుబడి లేదనుకుంటున్నానో అలాగే

తీసుబడి లేకుండా ఉన్నానా ! అది ఎలావున్నా, మరిశాంతికి కాకపోతే నేనెందుకు ఉపయోగపడేటట్లు !

కొన్నాళ్ళు గడచిన తరువాత డాక్టర్ లైమన్ బీచర్‌ను వెంటపెట్టుకొని ముందు వచ్చిన వున్నవారిని కూడా కలుపుకొని కార్నెగీని చూడటానికి వెళ్ళారు. కార్నెగీ వారే పనిమీద వచ్చారో ముందే ఊహించాడు.

"మీరు ఒకమాటైనా చెప్పవలసిన పనిలేదు" అంటూ వారిని లోపలికి రమ్మని ఆహ్వానించాడు. "మీరిక్కడికి ఎందుకు వచ్చారో నాకు తెలుసు. మొన్న నేను మీకు ఇస్తామన్న అధ్యక్ష పదవిని కాదని త్రోసిపుచ్చినప్పటినుంచీ నా అంతరాత్మ నన్ను బాధిస్తున్నది. ఇప్పుడు నేను మనస్సు మార్చుకొన్నాను. ఆ అధ్యక్ష పదవిని స్వీకరిస్తాను. నా కర్తవ్యాన్ని నిర్వహిస్తాను.

ఆ తరువాత వచ్చిన వసంతంలో ఆ సమాజం న్యూయార్క్‌లో శాంతిమహాసభ జరిపించింది. సమాఖ్యలోని రాష్ట్రాలన్నింటిలోనుంచి ప్రతినిధులు, విదేశాలనుంచి అనేక మంది ప్రఖ్యాత పురుషులు సభకు విచ్చేశారు. మానవజాతి మధ్య శాంతిని నెలకొల్పాలంటే సభలు జరపటం, ఉపన్యాసాలివ్వటం, తీర్మానాలు చెయ్యటం కంటే ఇంకా మించిన పని ఏదయినా చెయ్యాలన్న విషయం స్పష్టపడింది. ఇందుకు మరొక మార్గమేదీ గోచరింపక పోవటంవల్ల తన చేతిలో వున్న శక్తిమంతమయిన సాధనాన్ని ధనాన్ని ప్రయోగించటానికి నిశ్చయించాడు కార్నెగీ. అది ఆయన యిత రాశ

యాలను సాధించడానికి అతిశక్తిమంతమయినదని రూఢిగా నిరూపితమయింది. ధనాన్ని వెచ్చించటం వల్లశాంతి లభించే టట్లయితే అతడు దాన్ని నీరులా ప్రవహింపచేసేటందుకు నిశ్చయించుకున్నాడు.

అందువల్ల డిసెంబరు 14, 1910 నాడు అతడు అంతర్జాతీయ శాంతికోసం కార్నెగీ ఎండోమెంటు అన్న ఒక నిధిని ఏర్పాటు చేశాడు. అతడు తలపెట్టిన వాటిలోకల్లా ఒక్క ఈ విషయంలోనే అతనికి కొంత అపజయం కలిగింది. ధర్మకర్త సంఘానికి అధ్యక్షుడుగా అ త డు ఎ ల హూ ట్ ను ఎన్నుకొన్నాడు. ఇత డంటే అతని కెక్కువ మక్కువ. ఇతణ్ని ఎక్కువగా మెచ్చుకుంటుండేవాడు. కార్యక్రమాన్ని నిర్ణయించే పని నంతటినీ ధర్మకర్తల వివేకానికే విడిచి పెట్టేశాడు

ధర్మకర్తలు తమకు చేతనయినంత చేశారు. వారు కార్యకలాపాన్నంతటినీ మూడు శాఖలుగా విభజించారు. ఇందులో ఒకశాఖ "ది డివిజన్ ఆఫ్ ఇంటర్ కోర్స్ అండ్ ఎడ్యుకేషన్! ఇది అంతర్జాతీయ విధానాలను గురించిన భోగట్టాను సంపాదిస్తుంది. అంతర్జాతీయ సుహృద్భావాన్ని వృద్ధి పొందించటం కోసం తగినన్ని ఏజన్సీలను స్థాపించి వాటిని నడిపిస్తున్నది ఇది వివిధ దేశాలల్లో శాస్త్రనిష్ణాతులయిన విద్వాంసులను రచయితలను పరస్పరం వినిమయం చేసుకొనే ఏర్పాట్లు చేస్తుంది. ఏవైనా శాంతి సంస్థలు పూర్వమే ఏర్పడి వున్నట్లయితే వాటికి తగిన సహాయమిచ్చి తోడ్పడుతుంది. దీని ఆర్థిక-చరిత్రశాఖ, "ది డివిజన్ ఆఫ్

ఎకనమిక్స్ అండ్ హిస్టరీ, శాంతి– సమరం అన్న రెండు విషయాలమీద తమ ప్రభావాన్ని నెరపుతున్న రాజకీయ, సాంఘిక; ఆర్థిక కారణాల స్థితిగతులను గురించిన పరిశోధన లను చేస్తుంది. ఆ యా రంగాలలో శాంతి దృష్ట్యా అనుస రించవలసిన మార్గాలను, కార్యక్రమాలను సూచిస్తుంది. అంతర్జాతీయ న్యాయశాఖ ఇది డివిజన్ ఆఫ్ ఇంటర్ నేషనల్ లా, వివిధ దేశాల న్యాయశాస్త్రాలను పరిశీలించి అంతర్జా తీయ న్యాయసూత్రాలను నిర్మించి వివిధ జాతులమధ్య ఏర్పడే తగాదాల విషయంలో వాటిని అమలుపరచేటందుకు యత్నిస్తుంది. ఈ అంతర్జాతీయ న్యాయశాస్త్రమనేది కొన్ని నిబంధనలు ఒడంబడికలు అన్నవాటి సముదాయం తప్ప మరేమీ కాదు.

అంతర్జాతీయ శాంతికోసం తన మిత్రుడు నిలిపిన నిధి విషయంలో అడ్డులేని ఆశావాదికి కూడా విశ్వాసం కలగ టానికి కొంత కాలం పడుతుందనీ, కార్నెగీ చర్చా ప్రచా రములో కూడా అంతర్జాతీయ యుద్ధాలను నిషేధించటాన్ని సాధించలేవనీ క్రొత్తమార్గాన్ని స్వీకరించిన కార్నెగీ దుఃఖా త్మకమయిన ప్రత్యేక గుణపాఠాన్ని నేర్చుకోటం విధి నియ మితమని లార్డు మోర్లే భావించాడు.

మోర్లే వెల్లడించిన భావాన్ని గురించి కార్నెగి ఇలా వ్యాఖ్యానించాడు. "వ్యక్తి రేకాభిప్రాయలు గల వాళ్లు పరస్పరం స్నేహం చేస్తే అది అన్యోన్య ప్రయోజనకారిగా వుంటుందని మేము ఒకరి కొకరము సాన్నిహిత్యాన్ని పెంచు

కున్నాము. అతడు నిరాశావాది. రానున్న ఆపదల విష యంలో అతడు చింతాత్మకంగా, కొన్నిమారులు అంధకార ప్రాయంగా చూస్తుంటాడు. కొన్ని సందర్భాలలో లేనిపోని వేవో అర్థరహితమయిన వాటిని ఊహిస్తూ వుంటాడు. నా పిల్లలన్నీ అంచబిడ్డలైనా యికనొక నేను ఆశావాదిని. నాకు లోకం తేజోవంతంగా కనిపిస్తుంది పలుమారులు ఈ అవ నియే సత్యమయిన అమలిన స్వర్గంగా నాకు గోచరిస్తూంది. నేను యింత సంతోషంతో వుంటాను. దయామయు లయిన విధి దేవతలకు కృతజ్ఞుణ్ని. ఎన్నడూ మోర్లీ దాన్ని గురించి కూడ వుద్దేకి కాలేదు. అతని నిర్ణయాలెప్పుడూ ఆలో చనా పూర్వకములయినవి. అతని కన్ను లెప్పుడు ఆదిత్యుని లోని మచ్చల మీదనే దృష్టి నిలిపి చూస్తూంటాయి.

అయినా మోర్లీ తనమిత్రుని ఆశాభావం, వుత్సాహం అన్న వాటినీ చూచి ఎంతో యిష్టపడుతుండేవాడు. ఆ ఆశాభావంతో ఎల్ల వేళలా అతడు ఏకీభవించ లేకపోతుం డేవాడు. అతడు అన్నాడు "విజ్ఞానం విజ్ఞానతృప్తి, నూతన వస్తువులలో కనుగోటం, భావజ్యోతిని ప్రసాదించటం, సాంఘిక సంబంధాలను వృద్ధి పొందించటం తుల్య ప్రజ్ఞకు తుల్య మయిన అవకాశాలు కలిగించటం, శాంతిప్రియత్వం అన్న ప్రపంచమందలి ఉత్తమాశయాలకోసం అతడు పొందిన విస్తారమైన అనుభూతికి తగిన న్యాయాన్ని జరిపించటం వివేకం ఇవన్నీ మహోన్నత విషయాలు. వాటిని గురించి ప్రకటించేటప్పుడు అత్యుక్తి లేశం వుంటె వుండవచ్చును. దాన్ని సర్దుకోటం చాలా సులభం." ఈ ఆదర్శాల విష

యంలో కార్నెగీకి గల దృష్టి మహోదాత్తమైందని మోర్లీ అంగీకరించాడన్నమాట!

శాంతిని నెలకొల్పడానికి యత్నిస్తున్నందుకు ప్రపంచంలోని వివిధదేశాలూ కార్నెగిని గౌరవించాయి. ఫ్రెంచి ప్రభుత్వం అతణ్ని నైట్ కమాండ్ ఆఫ్ దిలీజియన్ ఆఫ్ ఆనర్ అన్న స్థానమిచ్చి గౌరవించింది హాలండ్ దేశం అతనికి "గ్రాండ్ క్రాస్ ఆర్డర్ ఆఫ్ ఆరంజ్ - నాసా" బిరుదంతో సత్కరించింది. డెన్మార్క్ దేశం "గ్రాండ్ క్రాసు ఆర్డర్ ఆఫ్ డెన్నిబ్రాగ్ ఇచ్చి అతన్ని గౌరవించింది. ఇరవై ఒక్క అమెరికన్ రిపబ్లిక్కులు స్వర్ణపతాకాలను బహూకరించినవి. అసంఖ్యాకములయిన విశ్వవిద్యాలయాలు, కళాశాలలు, అతనికి 'డాక్టరేట్' పట్టమిచ్చి గౌరవించాయి. నూట తొంబదికి పైగా సంస్థల్లోను, వైజ్ఞానిక సమాజాలల్లోను క్లబ్బులలోను, అతడు సభ్యుడుగా వ్యవహరించాడు.

తన మరణశాసనాన్ని (Will) వ్రాస్తూ అందులో అమెరికా ప్రజల ప్రయోజనంకోసం ఒక మహా పథకాన్ని అమలులో పెట్టేటందుకుగాను బృహన్నిధి నొకదానిని ఏర్పాటుచేస్తున్నట్లు అందులో వ్రాస్తున్నాడు.

ఈ విధంగా అమెరికావాసుల కిస్తున్న అవకాశాన్ని గురించి అతడు ఎలిహూరూట్‌తో చెప్పటం ఆరంభించినప్పుడు అతడు తల పంకించి యిలా అన్నాడు.

"కొన్ని సంవత్సరాల క్రితం మీ రన్నది మీరే మరచిపోయినారా! అది కార్యాచరణలోగాని, న్యాయ

స్థానాలల్లోగాని తరుచుగా అపమార్గాన్ని పడుతుంది. ఎప్పుడో భవిష్యత్తులో ఆచరణలోకి రాబొయ్యేదాన్ని ఇప్పుడు మీరు మీ మరణశాసనంలో ఏర్పాటుచేసి వుంచటం యెంతో ప్రమాదకారి అయిన విషయం. శామ్యూయల్ జె. టిల్డన్ చేసిన పొరబాటు తిరిగి చెయ్యవద్దు యిప్పుడు మీ సంపత్తితో మీ రేలా చెయ్యాలని భావిస్తున్నారో అప్పుడు అతడలా చేశాడు. అది న్యాయస్థానానికి వెళ్ళినప్పుడు వ్యతిరేకమైంది.

"మరణశాసనాలు అందమైనవేగాని అల్లట తల్లట కలిగించే వాహనాలు" అని, రూట్ ఇంకా ఇలా అన్నాడు. "జీవితకాలంలోనే ఈ నిధిని ఏర్పాటుచేసి, అందుకుగాను మీరు ఏర్పాటుచేసి వుంచిన సంపత్తిలో అధికాంశాన్ని దాని పరంచేసి ఆ వ్యవహారం మీరు సజీవులై వున్నప్పుడు కొంత నడుస్తుండటాన్ని ఎందుకు కల్పించకూడదు ? అప్పుడు అది సక్రమంగా తరువాతి కాలంలో నడిచిపోతుందనే నిశ్చయం మీకు కలుగుతుంది. అంతేకాదు. మీరు ఉద్దేశించిన పనులను ఆచరలో ఆచరణలో పెట్టించిన ఆనందాన్ని మీరు పొందటం కూడా జరుగుతుంది"

అతడు రూట్ ఇచ్చిన సలహాను పాటించాడు 1911లో యునైటెడ్ స్టేట్సు స్టీల్ కార్పొరేషన్‌లోని 5% మొదటి రాబడినిచ్చే 2,50,00,000 [రెండు కోట్ల ఏభై లక్షల] డాలర్ల మూలధనంతో అతడు న్యూయార్క్ కార్నెగీ కార్పొరేషనును న్యూయార్క్‌లోని శాసన సభచేత చట్టబద్ధంచేయించి

స్థాపించాడు. ఇందుకు ధర్మకర్తలుగా వ్యవహరించవలసిందని అతడు కోరిన ప్రముఖ వ్యక్తుల సంఘం నవంబరు 11 న కార్నెగీ గృహంలో సమావేశమైంది. అతడు వారికి తాను ఈ ధర్మనిధిని స్థాపించటంలో ఉద్దేశమేమో తెలియజేసే పత్రాన్ని యిలా చదివి వినిపించాడు. సాంకేతిక పాఠశాలలకు, ఉన్నత విద్యాసంస్థలకు, గ్రంథాలయాలకు, శాస్త్రీయ పరిశోధనకు, పీఠనిధులకు, ప్రయోజనకరములైన ప్రచురణలకు వీటికిగాను కాలక్రమేణ ఏర్పడే ఇతర సంస్థలకు సాధనాలకు తోడ్పాటు నిచ్చి "విజ్ఞానాభివృద్ధి వ్యాప్తులను పెంపొందించటం, ప్రజలమధ్య సుహృద్భావాన్ని పోషించటం" ఈ నిధి లక్ష్యం.

ఈ నిధి అమెరికాలోని వైజ్ఞానిక సాంఘికాభివృద్ధికి సంబంధించిన ఉద్యమాలకు తోడ్పడటమే కాకుండా అతడు నెలకొల్పిన ఇతర సంస్థలకు సహాయ మవసరమైనప్పుడు ధన సహాయం చేయటానికి కూడా ఉద్దేశింపబడ్డది. అతడు ఈ కార్పొరేషను ఏర్పాటుచేసిన అనతికాలంలోనే తొలుకటి మూలధనం చాలదని గుర్తించాడు. తా నుద్దేశించిన సర్వం ఆచరణలోకి వస్తే చూడవలెనంటే ఇంకా ఎంతో అదనపు ధనం అవసరమని తోచింది. అయితే యిప్పుడు భార్యకు, కుమార్తెకు విడిచిపెట్టవలెనని ఉద్దేశించినది బాండ్లరూపంలో గాని, ధనరూపంలోగాని వున్నది 12,50,00,000 [పన్నెండు కోట్ల యాభై లక్షల] డాలర్లు మాత్రమే. మరొక ఐదుకోట్లు లేదా పదికోట్లు డాలర్లు యివ్వటానికి వారు అంగీకరిస్తారా ? క్షణమైనా వెనుదీయకుండామిసెస్ కార్నెగీ అందుకు అంగీకరిం

చింది. యిక కుమార్తె యింకా పదిహేను పదహారు సంవత్స రాల వయసు కన్యక మాత్రమే. ప్రియమైన తన తండ్రి ఏది చేసినా ఆమె క్షేమమే. అందుకే తృప్తిపడుతుంది. అందువల్ల 1912 లో కార్నెగీకార్పొరేషన్ నిధి 12,50,00,000డాలర్లు వరకూ వృద్ధిచేయబడింది ఆ లోకోపకార పరాయణుడు ఒక సంవత్సరములోనే 13,00,00,000 [పదమూడు కోట్ల పై చిలుకు డాలర్లు దానం చేశాడు.

కాంగ్రెసు మాజీ అధ్యక్షులకు వారి భార్యలకు తగిన ఏర్పాట్లను చేయలేకపోయినందుకు కొన్ని సంవత్సరాలనుంచి అతడు వ్యాకులపడుతున్నాడు. అమెరికాలోకల్లా అత్యున్నత మైన గౌరవ స్థానానికి, గణతంత్రప్రజా రాజ్యంలో అతినిష్ఠా యుతములు, బాధ్యతా యుతములు అయిన ఉన్నత పదవు లకు వారిని నియోగించి వారి విరమణ కాలంలో గౌరవయు తంగానుక్లేశరహితంగాను జీవించే విరామభృతుల నివ్వకపోవ టం కృతఘ్నత అనీ, అనాగరికమనీ అతడికితోచింది. ప్రభు త్వంవారికి తగ్గ ఏర్పాటు చేసేటంతవరకూ కార్పొరేషన్ ప్రతి సంవత్సరము ఇందుకుగాను 25,000 డాలర్లు యివ్వవల సిందని కార్నెగీ సూచన చేశాడు.

ఈ అభిప్రాయం ప్రకటితము కాగానే ప్రజల్లోనుంచి వ్యతిరేకభావం వెలివడ్డది. ప్రభుత్వం స్వీకరింపదగ్గ బాధ్య తను ఒక ప్రత్యేక వ్యక్తి గ్రహించటం అనుచితమని వా రన్నారు. యిలా వారికి సిగ్గును కల్గించి వివయబోధ చెయ్య టమే ఈ పథకంలోని రహస్యం. ఈ చర్యవల్ల ప్రపంచ

దృష్టిలో దేశం అవమానిత మాతుందని వారుభయపడ్డారు. అందువల్ల కార్నెగీ మనసులో యిష్టంలేకపోయినప్పటికి ఈ ఉద్దేశాన్ని కొంత విరమించుకోవలసి వచ్చింది. దీన్ని పూర్తిగా విడిచిపుచ్చకపోవటం మనం ముస్ముందు గమని స్తాము.

1911-12 ల శీతకాలం అతడికి ఆ బాల్యమిత్రుడైన టామ్ మిల్లర్ మృతివల్ల అతి వేదనతో గడిచిపోయింది. యింతకు కొద్ది నెలలకు పూర్వమే అతడు ఆత్మకథ వ్రాస్తూ అందులో యిలా అన్నాడు: "అతడు యింకా సజీవుడై వుంటే మిక్కిలి ప్రేమపూర్వకమైన వెలుగును, మాధుర్యాన్ని కురిమ్మరిస్తున్నాడు. ఎన్ని సంవత్సరాలు గడచినా అతడు ఇంకా యింకా విలువైన మిత్రుడనని అనిపిస్తున్నాడు" అని వ్రాశాడు. యిప్పుడు టామ్ వెళ్ళిపోయినాడు. అందువల్ల మరో వాక్యం చేర్చాడు. "ఇకనుంచీ జీవితానికి ఏదో లోటు తీరని లోటు - అతడు నా బాల్య జీవితంలోని సహచరుడు. వృద్ధాప్యంలో అతి ప్రియుడైన మిత్రుడు. అది ఎలాటిదైనా యిపు డత డెక్కడున్నా నేను అక్కడికి వెళ్ళవచ్చునా !"

అతడు తా నేర్పాటుచేసిన అన్ని నిధులను గురించి సంస్థలను గురించి యెంత గర్వించినా తన దానాలపట్టికలలో కల్లా అతడి కతి ప్రియమైంది అతని విరమణ భృత్యాపట్టిక (Pensoin List) ఆర్థిక సహాయార్థం ప్రతి సంవత్సరం అత నికి వేలకొలది లేఖలు వస్తుంటాయి. ఈ ఉత్తరాలు వ్రాసిన వారిలో ఎందరు వంచకులో, వారు చెప్పే స్థితిగతు లెన్ని

కల్పనలో తెలుసుకునే అవకాశం అతడికి సహజంగా లేదు. అయితే ఈ వుత్తరాల నన్నిటినీ అతడు జాగ్రత్తగా పరిశీలించి, సత్యాలని తోచిన కొన్నిటిని ఎంచి వాటిమీద "ఇతణ్ని నెలకు ముప్పదిడాలర్లమీద వుంచండి," "ఈవృద్ధురాలు సుఖంగా జీవించటానికి యే లోపం కలుగకుండా చూడండి" ఈ రీతిగా కార్యదర్శి హొయిస్టన్ వుపయోగార్థం సూచనలు వ్రాస్తుండేవాడు. వృద్ధాప్య జీవన భృతిపట్టికలో చేర్చేవారిలో ఎందరో పూర్వం అతడెరిగినవాళ్లు. యౌవనంలోనో, బాల్యంలోనో అతనితో ఏదో విధమైనసంబంధం కలవాళ్ళను చేర్చటం తప్పక జరిగేది. అట్టివారిలో కొందరు మాత్రమే అతడికి వ్రాసుకొనేవాళ్లు. ఇందులో ఎక్కువమందిని గురించి ఇతరులు వ్రాయటమో, అతడే ఎన్నటమో జరిగేది. వీరిలో కార్నెగీకి ప్రథమంగా ఉద్యోగమిచ్చిన వ్యక్తి కుమార్తెకూడా వుంది. అతడు ఒకప్పుడు పిట్స్‌బర్గులో మంచి ఉచ్చదశను అనుభవించిన వ్యాపారస్థుని కుమారుడు, అతనికి బాల్యంలో కార్నెగీ ఉండీగా తంతి వార్తలను అందజేస్తుండేవాడు. కాని ఇప్పుడతడు అశక్తుడు, పేదవాడు. పూర్వం అలిఘనీలో స్వీడన్బోర్జియన్ సంగీత సమ్మేళనంలో సహ సభ్యులుగా వుండేవాళ్లు. ఇరువురు వృద్ధ కన్యలు 'నేను యౌవనోల్లాసంతో వారితో కలిసి నృత్యం చేస్తుండేవాణ్ని' అని కార్నెగీ వ్రాశాడు.

ఆయన మృతినొందే వేళకు పూర్వమే ఆ పట్టిక ఐదు వందల పేర్లకు మించి వుండేది. కాలం గడిచిన కొద్దీ ఇందుకు

ఎక్కువ ధనం అవసరమని గ్రహించి ఈ భృతిని స్వీకరించే వారు తమ కాభృతి జీవించినంత కాలం భృతిముడుతుందనే నమ్మకాన్ని కల్పించటం కోసం కార్నెగీ యాభై లక్షల డాలర్లతో మరొక ధర్మనిధి నేర్పాటు చేశాడు. దీనికితోడు స్కాట్లండులో మరొక పట్టిక–దీనికి ధర్మకర్త డన్ఫర్మ్లైను పేర్పాటయింది.లోని డాక్టర్ రాస్. ఈ పట్టికలోనే రాబర్టు బరన్స మునిమనుమరాలి పేర, బాల్యంలో కార్నెగీకి అతి ప్రియమిత్రుడైన డన్ఫర్మ్లైన్ పోష్టుమేన్ కుమార్తె పేరు వున్నవి.

ఒక రోజున న్యూయార్క్ కార్నెగీ కార్పొరేషన్ అధిపతి అయిన కార్పొరేషన్ డాక్టర్ హెన్రీ యస్. ప్రిచ్చెట్ను యింటికి రమ్మని పిలిపించటం జరిగింది. అతడు వచ్చేటప్పటికల్లా కార్నెగీ తన డ్రాయింగ్ రూములో అటు యిటూ తిరుగుతున్నాడు.

"డాక్టర్ ప్రిచ్చెట్, అమెరికాలోని అధ్యక్షుల క్రింద పడుస్తున్న సంస్థవంటి నొకదానిని పెద్ది మొత్తంలో నేను గ్రేట్ బ్రిటన్ కోసం ఏర్పాటుచేయదలిచాను. నిశ్చయంగా దాని కెక్కువ డబ్బు అవసరం లేకపోయినప్పటికీ అది ఇవ్వటానికికూడా నా దగ్గర డబ్బులేదు. నా భార్య, కుమార్తెల కోసం విడచిపెట్టిన డబ్బులోనుంచి నేను మళ్లా ఒక పది మిలియన్లు తీయదలచలేదు. అందువల్ల మీ కార్పొరేషన్ ధనం లోనుంచి పది మిలియన్లు తీయదలిచాను" అన్నాడు.

డాక్టర్ ప్రిచ్చెట్ కొంత సంకట పడ్డట్లు కనిపించి అన్నాడు:

"మిస్టర్ కార్నెగీ మీ రాపని చేయటాని వీలులే దనుకుంటాను."

"వీల్లేదా"

"లేదు. 'కార్నెగీ కార్పొరేషన్ ఆఫ్ న్యూయార్క్' అన్నది స్థిరమైపోయింది. దాన్ని మార్చటానికి వీలుండదు."

కార్నెగీ ఆ చెప్పినది నమ్మలేకపోయినాడు. "మీరు మిస్టర్ రూట్‌ను విచారించవచ్చు. నేను చెప్పింది నిజమని నా నిశ్చయం. అయినా ఆయన్ను అడగండి తెలుస్తుంది."

కార్నెగీ మిస్టర్ రూట్‌ను పిలిపించాడు. అప్పుడు అతడు శాసనసభా సభ్యుడు. 'నిశ్చయంగా వీల్లేదు' అని ఆ ప్రముఖ న్యాయశాస్త్రవేత్త అన్నాడు. 'మీరు ఇప్పుడు కార్పొరేషన్ నుంచి ధనాన్ని తీయటానికి వీల్లేదు. జరిగి పోయిందేదో జరిగిపోయింది. మార్పుకు విలుండదు.'

ఇందుకు ఆతడు వెల వెల పోయాడు ఏమయినా అతని బుద్ధి బ్రిటిష్ నిధిమీద లగ్నమై వుంది తనకు మిగి లిన రెండుకోట్ల యాభైలక్షల డాలర్లు భార్యకు, కుమార్తెకు యిచ్చాడు.

మరి నిజానికి వాళ్ళకు అంత డబ్బుతో అవసర ముందా? ఎంతో సేపు మదనపడి ఏర్పడ్డ పరిస్థితిని మిసెస్ కార్నెగీకి ఎరుకపరిచాడు, "మీ భాండ్లలోనుంచి ఈ నిధి కోసం ఒక మిలియన్ను నేను తీసుకోటం మీ కిష్టమేనా ?" అన్నాడు.

క్షణమాత్రమైనా ఆమె వెనకాడలేదు. ఆమెతో సమానురాలు వెనుక పుట్టలేదు, ఇకముందు పుట్టబోదుఅన్న అభిప్రాయాన్ని వెయ్యోమారు నిరూపిస్తూ ఆమె చిరు నవ్వుతో "అండ్రీ! ఏమీ అనుకోము" అన్నది చిరు నవ్వుతో.

బ్రిటిష్ కార్నెగీ ఫండు ఏర్పడ్డది.

కొన్ని సమయాలల్లో అతడు తన కార్యదర్శిని "పొయి న్టన్, ఇప్పటికి నే నెంత దానం చేసివుంటాను" అనేవాడు. అతడికి ఎప్పుడూ అంకెలు నాలుకచివరన సిద్ధంగా వుండేవి. అతడు సమాధానం చెప్పాడు: "ముప్ఫయి నాలుగు కోట్ల డెబ్బయిరెండు లక్షల ఎనభైఐదు వేల ఐదువందల డాలర్లు" [లేదా అప్పటికి ఎంత అయితే అంత]

"ఓహో!" అని సంతోషించేవాడు కార్నెగీ. "యీ డబ్బంతా నే నెలా సంపాదించాను" అనేవాడు.

ఆగష్టు 29, 1918 న హేగ్‌లోని శాంతి సౌధంలో నిలిచి అతడు తన అభిప్రాయాన్ని యిలా వెల్లడించాడు.

"ప్రపంచ శాంతిని నిలువబెట్టటానికి కావలసింది ప్రముఖమైన మూడు నాలుగు నాగరిక ప్రభుత్వాల మధ్య యింకా చేరదలచుకున్న వెన్నివుంటే అన్నిటి మధ్య ఒక ఒడంబడిక -ప్రపంచశాంతికి భంగాన్ని కల్పించేవారికి, లేదా వానికి యెదురు నిల్వటం విషయంలో ఒక సహాకారాన్ని

గురించిన ఒడంబడిక ఏర్పడటమే. అటువంటిది జరుగు తుందా!"

పదకొండు నెలల తరువాత జులై 28, 1914 న ఆస్ట్రియా సెర్బియా యుద్ధాన్ని ప్రకటించింది. ఈ సంఘట నను గ్రహించటానికి కార్నెగీ మనస్సు ఎంతో కష్ట పడింది. అతడు 1907లో జర్మనీ అధినేత కైజరువిల్హెలమ్ II ను కలుసుకున్నాడు. అతని చిన్న ఓడలో అత డిచ్చిన విందు నారగించి నపు డతడు చేసిన ప్రసంగాన్ని బట్టి అతడు ప్రపంచశాంతికి, పురోభివృద్ధికి నిజంగా ఆతురత వహిస్తున్నా డని నమ్మి, అత డంటే మంచి గౌరవభావాన్ని కుదుర్చు కున్నాడు. ఇప్పుడు ప్రథమ సంగ్రామ సమయంలో ఉక్కిరి బిక్కిరి అయినాడు. ధృఢమైన నమ్మకం కలవాడు కాలేక పోయాడు క్రమంగా మానవస్థితిని జూచి హృదయాంతరా ళంలో దుఃఖాకులితు డౌతున్నాడు. భయానకత తీవ్రమై స్పష్టమైన రూపురేకలతో సందర్శనమిచ్చినప్పుడు తాను శాంతి కోసం చేసిన కృషి, వెచ్చించిన ధనం వ్యర్థమైపోయా యని గ్రహించాడు. శాంతియుతము, ఆనందమయము అయిన ప్రపంచాన్ని గురించి అతడు కన్న కలలన్నీ భగ్నమై నాయి.

యుద్ధం ప్రారంభం కావటంవల్ల కార్నెగీ కుటుంబం వేసగికాలంలో స్కాట్లండులో ఎక్కువకాల ముండటం తగ్గించుకోవలసివచ్చింది. ఇంటికి తిరిగి వెళ్ళటంకోసం స్టీమ రెక్కడానికి వారు వేగంగా లివర్‌పూల్ చేరుకున్నారు.

మోర్లే వాళ్ళను పంపించడానికి వెంట వచ్చాడు. అన్యోన్య శ్రద్ధగల ఆ మిత్రులిద్దరూ కరచాలనం చేసి సెలవు చెప్పు కొన్నారు. అదే వారి తుదిసారి కరచాలనం.

తరువాత కార్నెగి బలం, తేజం నెమ్మది నెమ్మదిగా తరిగిపోవటం ప్రారంభించాయి. 1915లో మెయిన్‌లోని బార్ హార్బర్‌లోను, తరువాతి వేసగిని కెనక్టికట్‌లోని నోరోటన్‌లోను గడిపారు. అమెరికా సంయుక్తరాష్ట్రాలు యుద్ధంలో ప్రవేశించిన తరువాత కార్నెగీ ముప్పదిరెండు సైనిక శిబిరాలకు గ్రంథాలయాలను ఏర్పాటు చేశాడు. 1917 ప్రారంభంలో అతడు లెనాక్స్ దగ్గర వున్న బెర్క్‌షైర్ కొండల్లోని 'షాడోబ్రూక్' అన్న మిరాసీ (Estate ని కొన్నాడు. చివరి మూడు వేసగికాలాలను అతడు అక్కడే గడిపాడు. చార్లీస్వాబ్, టామ్ మిల్లర్, మార్క్‌ట్వైన్, రిచర్డ్ వాట్సన్ గిల్డర్, జాన్ బిగలో, జోసఫ్ జాయిట్‌లు మరణించారు. చార్లే యింకా సజీవుడు. ఈ మిత్రులిరువురూ ప్రతి ఆదివారం ఒకరి కొకరు వుత్తరాలు వ్రాసుకుంటుండేవారు.

ఏప్రియల్ 22, 1919 మార్గరేట్‌ను- నిన్న మొన్నటి వరకూ స్కిబో పర్వతప్రదేశపు కోనల్లో తండ్రి చేయి పట్టుకొని మెల్లగా వెంట వచ్చిన చిన్న పిల్ల - రోజ్ వెల్ మిల్లర్ అనే మంచి న్యూయార్క్ యువకుడి కిచ్చి వివాహం చేశారు. ఇదే ఆమె తండ్రి యింట జరిగిన చివరి శుభకార్యం.

ఆ వేసగిలో జార్జి లాడర్, జూనియర్ షాడోబ్రూక్ ను చూడటానికి వచ్చాడు ఇరువురూ కలిసి తీరుబడిగా షికారుకు వెళ్ళారు. చేపలు పట్టారు చెక్కర్స్ ఆట ఆడారు. చివరకు కజిన్ డాడ్ కూడా తుది "గుడ్ బై" చెప్పి వెళ్ళాడు

ఆగష్టు మొదట్లో కార్నెగీ నిమోనియా వల్ల బాధ పడుతున్నాడు మిసెస్ కార్నెగీ ఒక విశ్వాసపాత్రుడయిన సేవకుడు, ఒక మారిసన్ వంశీకుడు, మూడువేళలా అతడికి అప్పుడప్పుడు సేవచేస్తున్నాడు. వ్యాధిఆరంభమైన రెండవ రోజు, ఆదివారం, కొన్ని సంవత్సరాల నుంచి ప్రతిఆదివారం మోర్లేకు వ్రాసే వుత్తరం వ్రాయలేదు. ఆనాటి సాయంత్రం అతడు చాలా నిస్సత్తువగా వున్నా అతని స్థితి సంతృప్తికరంగానే వున్నట్లు కనిపించింది. రాత్రి సెలవు తీసుకొంటూ "ఆండీ, నీవు సుఖంగా నిద్రిస్తున్నావని భావిస్తున్నానని ఆశిస్తున్నా" నన్నది భార్య.

"లా, నేను అలాగే ఆశిస్తున్నాను." అని అతడు సమాధానం చెప్పాడు

అనతి కాలంలోనే గాఢము, ప్రశాంతము అయిన నిద్ర అతణ్ని ఆవహించింది. దాని నుంచి తిరిగి మేల్కొ లేదు.

న్యూయార్కు-టారీటౌనుకు కొంతవుత్తరంగా వున్న 'స్లీపీ హాల్ సెమిటీరి'లో వాషింగ్టన్ ఇర్వింగు విశ్రాంతి ప్రదేశా

నికి అనతిదూరంలో అతణ్ని ఖననం చేశారు. అతని సమాధి మీద స్కాచ్ దేశపు నిలశిల (Granite) తో చేసిన ఒక కెల్టిక్ క్రాస్ నిలచివుంది. స్కిబో ఎస్టేటులో సహచరులుగా వుంటున్న శ్రామికులు ఆ గనుల్లో దానిని మలచి తోసికొని తెచ్చి పట్టామీదుగా రైలుమార్గం దగ్గరకి చేర్చారు. ఒక గ్లాస్గీ కళాకారుడు ఆ క్రాస్‌ను రూపొందించాడు. మిసెస్ కార్నెగీ దానిమీద చెక్కవలసిన మాటలను నిర్ణయించింది. అది అతి సర్వ సాధారణమైన వాక్యం. ఆడంబరం అణుమాత్రం లేనిది. అంతకంటే ఔచిత్యశోభితమైనది మరొకటి వుండే అవకాశం లేనిది.

ఆండ్రూ కార్నెగీ

జన్మ, డన్‌ఫర్మ్‌లైన్, స్కాట్లండ్

25 నవంబరు 1835

మృతి, లెనాక్స్, మసాచ్యుసెట్సు

అంతే !

అతడు తన మరణ శాసనాన్ని స్వయంగా వ్రాసుకున్నాడు. భార్యకు కుమార్తెకు తగిన ఏర్పాట్లు చేశాడు. న్యూయార్క్ గృహంలోని సేవకులను, స్కిబో మిరాసీలోని సేవకులను, శ్రామికులను జ్ఞప్తి యుంచుకొని కొన్ని సంస్థలకు అధిపతులను చేశాడు. చివరకు మాజీ అధ్యక్షులను

గురించి తా ననుకొనినట్లుగానే జీవించాడు. తన మరణ కాలంలో సజీవుడుగా వున్నవాడు ఒకే మాజీ అధ్యక్షుడు, విలియం హెచ్. టాఫ్టుకు జీవితపర్యంతరం ప్రతిసంవత్సరం 10,000 డాలర్లు వార్షికం లభించింది. మిసెస్ గ్రోవర్ క్లివ్ లాండ్, మిసెస్ థియోడోర్ రూజ్వెల్టు ఒక్కొక్కరికి సంవత్సరానికి5,000డాలర్లు చొప్పున ఏర్పాటుచేశాడు. వైకౌంట్ మార్లే, డేవిడ్ లాయడ్‌జార్జి సంవత్సరానికి 10,000డాలర్లు చొప్పున స్వీకరించారు. పార్లమెంటులో లేబర్ సభ్యుడైన జాన్ బరన్స సంవత్సరానికి 5000 డాలర్లు చొప్పున తీసుకు న్నాడు. ఇతడు హోమ్‌స్టెడ్ సమ్మె సమయంలో కార్నెగీని గట్టిగా ఎదిరించి నప్పటికీ ఇంగ్లండుకు ఇతడు గొప్పసేవచేశా డని కార్నెగీ భావించాడు. కార్నెగీని బరన్స విమర్శనుంచి రక్షించిన థామస్‌బర్టు అన్న మరొక సభ్యుడికి కూడా సంవత్సరానికి 5,000 డాలర్లు ఇవ్వటం జరిగింది.

కార్నెగీ తమకిచ్చిన భవనంలో న్యూయార్కు ఇంజ నీరింగ్ సంఘాలు అతని జ్ఞాపక చిహ్నంగా ఏర్పాటు చేసిన సభలో ఎలహూరూట్ మాట్లాడుతూ ఇలా అన్నాడు: "అమెరికా దేశాభివృద్ధిని ప్రపంచానికొక అద్భుత విజయ ముగా చేసిన జాతినిర్మాతల కోవకు చెందినవాడు కార్నెగీ. నే నెరిగినంతలో అంతటి దయాళువు లేడు. ధనం అతని

హృదయాన్ని గడ్డకట్టించలేదు, యౌవనకాలంనాటి స్వప్నాలను మరచిపోయేటట్లు చేయలేదు. కరుణాన్వితుడు, ప్రేమ హృదయుడు, నిర్ణయాల విషయంలో ఊవిగలవాడు. అతడిని గురించి తనకు అవసరంలేని డబ్బును దానంచేసిన ఒక మహా వంతుడు అన్న భావంగల వారందరూ కరుణాన్వితుడై ప్రపంచం కనివిని ఎరుగని ఎన్నెన్ని ఘనకార్యాలు చేశాడో తెలుసుకోటం ఎంతో అవసరం."



A QUALITY PUBLICATION

# ఆండ్రూ కార్నెగీ

ఆండ్రూ కార్నెగీ 1835వ సంవత్సరంలో స్కాట్‌లాండ్‌లో జన్మించాడు. ఆయన తన 12వ ఏట అమెరికా దేశానికి వలస వచ్చాడు. అక్కడే ఆయన ఆ కాలంలోని ఉక్కు ఉత్పత్తి దారులలో ప్రథముడిగా గణుతికెక్కాడు. 1901వ సంవత్సరం వచ్చేనాటికి బాగా ధనార్జన చేసి ముప్ఫయికోట్ల రూపాయలకు పైగా ధర్మకార్యాలకు ఖర్చుపెట్టాడు. 1919వ సంవత్సరంలో ఆయన మరణించేనాటికి అనేక విద్యా సంస్థలకు విరివిగా దానాలు చేశాడు.

అంతేగాక అనేక ధర్మసంస్థలకు, ధర్మకార్యాలకు ఎంతో ధనాన్ని వ్యయించేశాడు. తన సహాయం పొందినవారు పైకి రావాలనేది ఆయన అభిలాష.

ప్రపంచ చరిత్రలో పేర్కొనదగిన మహాదాతలలో ఒకరిగా కీర్తి నార్జించాడు ఆండ్రూ కార్నెగీ.

TITLE PRINTED AT VIJAYA PRESS. VIJAYAWADA-2